ఇది **Stanes**

నేను స్వచ్ఛమైన కాఫీ, నూతనమైనకాఫీ
మీ రుచికి తగినట్లు ప్రత్యేకంగా తయారైనది.
నేను స్వచ్ఛమైన కాఫీ-కోరి త్రాగే కాఫీ
హోటళ్లు, రెస్టారెంట్లు యెన్నుకొనే కాఫీ.
మీరుకూడా దీనినే కోరితీసుకోండి.




**Stanes**

స్వచ్ఛమైన కాఫీ

ది యునైటెడ్ కాఫీ సప్లయి కో-లిమిటెడ్, కోయంబత్తూర్.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక




Founder
K. Nageswara Rao

స్థాపితము
1908





సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్





సంపుటము 55
సంచిక 44

13-7-60
బుధవారం

శార్వరి ఆషాఢ బహుళ పంచమి





విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0





ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
'వాసుశిలావారి 'శ్రీకృష్ణపాండవయుద్ధం'లో
నళినీ జయవంత్



### గమనిక

'వనితాలోకం'లో చేరాలని కోరుచున్నట్లు, చేరడానికి సంబంధించిన నిబంధనలు తెలియపరచవలసినదని పలువురు మహిళామణులు వ్రాస్తున్నారు. మహిళలకోరకు ఉద్దేశించిన శీర్షిక ఇది. మహిళలకు సంబంధించిన అంశాలు గురించిన మహిళల రచనల ప్రచురణమే లక్ష్యం. ఇది సంఘంకాదు. చేరడానికి నిబంధనలూ లేవు. దీనిని మహిళలు గమనించాలని కోరుతున్నాము.

—సంపాదకుడు

## ఉత్తరాలు

### తెలుగు వెలుగులు

'మల్లంపల్లి' గారిని గూర్చి ఇంతవరకు తెలుగు వెలుగుల శీర్షికలో వ్రాయలేదెందుకా అని అనుకొన్నుచున్న మాకు ఈ వారపత్రికలోని వ్యాఖ్యానము చాలా మెచ్చుకోతగ్గదిగా తోచింది. ముఖ్యంగా చాకలి బండలను చదువుబండలుగా మార్చినవారు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు అని అనటంలో అతిశయోక్తి ఎంతమాత్రమూ లేదు.

ఈమధ్య కథలు చాలా చప్పగా ఉంటున్నాయి. ఎందుకు చెప్మా! గళ్ళ నుడికట్టు లాంటిది వారానికి రెండువేసినా బాగుంటుం దనిపిస్తుంది.

మరూరు రామచంద్ర (అనంతపురం)

* * *

ఆంధ్రుల ప్రాచీన చరిత్రను పరిశోధించి, అనేక గొప్పవ్యాసములు వ్రాసిన మహా పరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారిని గురించి వ్రాసినందుకు నా ధన్యవాదములు. ఈ విధముగానే ఆంధ్రదేశములోని ప్రముఖవ్యక్తులను గురించి మీ 'తెలుగు వెలుగులు' శీర్షికయందు ప్రకటిస్తారని ఆశిస్తున్నాను.

నేతి హనుమంతరావు (హైదరాబాద్.)

* * *

"తెలుగు వెలుగులు"లో వి. వి. గిరిగారిని గురించి ఉన్నమాట ఖచ్చితంగా వ్రాశారు. వ్యాసం చదువుతున్నంతసేపూ కొత్త చీకటిగాఉన్నా బాగాఉంది. రచయితకు నా ధన్యవాదాలు.

"స్త్రీలూ, పురుషులూ" వ్యాసం చాలా చక్కగాఉంది.

మంచాళ వెంకట్రావు (విశాఖపట్టణం)

### "వేధ"

అక్కన్నగారు వ్రాసిన "వేధ" వ్యాసం చదువుతుంటే ఏదో తెలియని "బాధ" నాలో కలిగినది.

శ్రీ. హెచ్. వి. వి. ఎస్. ఎస్. మూర్తి,
(తాడేపల్లి గూడెం)

* * *

మీ వారపత్రిక చాలాకాలం నుండి చదువుతున్నాము. 29-6-60 పత్రికలో "వేధ" చాలా బాగుంది. అక్కన్నగారికి నా ధన్యవాదములు. అల్లాంటివి ఇంకా వ్రాస్తే బాగుంటుంది.

కె. సీతారామస్వామి (తాళ్ళపాలెం.)

### గులాబ్ జామ్

ఆంధ్రపత్రిక ఈమధ్య స్వీట్లు 'గులాబ్ జాములుగా అయిపోయాయి. జీవనగంగ పేరి [illegible]

## యమగానం

"సతీసావిత్రి" నాటకం మహా జోరుగా జరుగుతోంది. యముడు సత్యవంతుడి ప్రాణాలు తీసుకు పోతున్నాడు. మైక్ బ్రద్దలయ్యేట్లు పద్యాలు దంచేస్తున్నాడు. సావిత్రి తన భర్త ప్రాణాలు ఇమ్మని అడిగింది యముడు- సావిత్రీ! నీ భర్త ప్రాణాలు తప్ప మరేదైనా వరం కోరుకో—అని ఒక రాగం తీశాడు. ఇంతలో ఒక ప్రేక్షకుడు లేచి ఓ సావిత్రమ్మా! ఆ యముడు ఇంక పాడకుండా వరం కోరుకో తల్లీ అన్నాడు.

ఎమ్. భుజంగరావు (భీమవరం)

యల్ కు మరికొన్ని పేజీలు కేటాయించమని కోరుతున్నాము.

గ్రంధి నాగేశ్వరరావు (నిడదవోలు)

* * *

మీ(మా)పత్రిక అనేకరకములైన కథలు, వ్యాసములు, కార్టూనులు, కబుర్లతో మా మనంబులను రంజింప జేయుచున్నది. ధన్యవాదములు.

బాలలసంఘం సభ్యులకు మీ రొసగిన మహోన్నతావకాశము, పత్రిక యొక్క ప్రగతికి చిహ్నము. ధన్యమగు మీ పరోపకారార్థము.

ఎన్. కోటిరెడ్డి (వరంగల్.)

## జ్యోతిషం : తీర్పు

29-6-60 తేదీ పత్రిక చెప్పలేనంత బాగుగా ఉంది. ముఖ్యంగా జ్యోతిషంగురించి ఇచ్చిన తీర్పు చాలా సమంజసంగా ఉంది. రాజధాని కబుర్లు కమ్మగా ఉన్నాయ్. బాపుగారి బొమ్మలు పసందుగా ఉన్నాయ్. ఇంతెందుకు పత్రిక రెండుసార్లు చదివాను.

బాలల సంఘం పేరిట కల్పించిన అవకాశం చాలామందికి సంతోషం కల్గించి వుంటుంది.

బి. ఉదయశంకర్ (హైదరాబాదు)

## రాబిన్ హుడ్

రాబిన్ హుడ్ కథ చాలా బాగుంది. పత్రిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తూ ఉంటాను. మా కోటి చిన్న పిల్లలకుకూడా అర్థము అయ్యేటట్లు వ్రాసినందుకు అభినందనములు. త్వరలో ఇటువంటి సీరియల్ మరల ఏది అయినా మొదలుపెట్టెదరని ఆశిస్తున్నాను.

ఎమ్. ఎస్. మూర్తి (రవితరంగిణి—బాపట్ల).

## కథలు ఇంపుగాలేవు

ప్రతి శనివారం "ఆంధ్ర సచిత్ర వారపత్రిక" కొరకు ఎంతగా ఎదురు చూస్తానో అందులో కథలు చదివేటప్పటికి అంత నిరుత్సాహ పడుతుంటాను. ఈ మధ్య కథలు మరీ రెండు లేక మూడో ప్రచురించడమే గాక చదువుటకు ఇంపుగాలేవు. కాన తమరు కథల సంఖ్య అధికముచేసి, మంచి కథలు ఎన్నుకొని ప్రచురించవలెనని నా మనవి.

పరచూరి వెంకటశ్రీరాములు (రామనగర్)

## జీవనగంగకు మరికొన్ని పేజీలు

జీవనగంగ సీరియల్ శ్రీ పురాణం సూర్యప్రకాశరావుగారు చాలా అనుభవముతో వ్రాస్తున్నారు. ఎప్పుడు పత్రిక వస్తుంది? ఎప్పుడు జీవనగంగ తరువాయి చదువుదాము అని ఉవ్విళ్ళూరుతూ వారం అల్లా ఓపికపట్టి పట్టి తీరా పత్రిక వచ్చిన తర్వాత జీవనగంగ చదవడం మొదలు పెట్టితే పొత్తిగా ఒకటి, రెండు ఘట్టాలకన్న ఎక్కువ ఉండదు. 5 నిమిషాలుకూడా పట్టడంలేదు. గాన మహాశయా, ఈ సీరియల్ కు మరి మూడు పేజీ లయినా కేటాయించినచో తృప్తి పడతాము.

అవసరాల లక్ష్మీబాయి (ఢిల్లీ)

* * *

మీరు 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' సీరియల్ గా ప్రచురిస్తున్న 'జీవనగంగ' చాలా బాగుంది. 'జీవనగంగ' చదువుతున్న కొద్దీ ఇంకా చదవాలని కుతూహలంగా ఉంది.

వర్షం జోరుగా కురుస్తున్నా లెక్కచెయ్యకుండా మీ ఏజెంటు వద్దకెళ్ళి పత్రిక కొన్నాను. దానికి ఫలితంగా మీ 'జీవనగంగ' రసానుభూతి నందించింది. అందుకు నా కృతజ్ఞతలు.

రచయిత ఆంధ్రప్రదేశ్ లో మధ్యతరగతి కుటుంబంలో అడుగడుగునా కొరవడిన జీవిత సత్యాలను నిర్మలంగా కనబడేటట్లు తను నవలా దర్పణంలో ప్రతిబింబింప చేస్తున్నట్లు చిత్రించారు. ప్రముఖ బెంగాలీరచయిత 'శరత్'ను జ్ఞప్తికి తెస్తున్నారు. అంతటి చక్కటి సులభశైలిలో వ్రాసి పాఠకలోకానికి మీ 'ఆంధ్ర సచిత్రవారపత్రిక' ద్వారా అందజేస్తున్నందుకు నేను మిమ్ములను అభినందించక తప్పదు.

తా. వెంకటరత్నం (కలకత్తా).

* * *

మీరు ప్రచురించే 'జీవనగంగ' చదువుతుంటే అందులో ఒక్కొక్క మనిషి మా ఇంట్లో ఒక్కొక్కళ్లను గుర్తుకు తెస్తున్నారు. జీవనగంగలోని లక్ష్మణరావును చూసి రోజూ 5,6 సార్లు కాఫీతాగే నేను రెండుసార్లకు తగ్గించుకొన్నాను. మాలాంటి మధ్యతరగతి కుటుంబాలకు పనికివచ్చే విషయాలు లక్ష్మణరావుద్వారా చెప్తున్న రచయితకు ధన్యవాదాలు. మనుమరాలు పుట్టిన రోజుకు అన్నీ వండి పారబోసిన లక్ష్మమ్మ గారిమీద సానుభూతి కలుగుతుంది. అలాగే ఈవారం మల్లి బాబును చూసి చాలా జాలి వేసింది. ఈ రచయితను త్వరలో మాకు పరిచయం చేస్తారుగదూ?

సరస్వతీ బాబూరావ్ (గూడూరు).

## కథ కాని కథ

ధూర్జటి సర్వమంగళ వ్రాసిన పోచ్ఛ అబ్దుల్ రహమాన్ చాలా బాగున్నది. మేము అందరము చదివి బాగా నవ్వినాము. దీనికి ఫస్టు ప్రయిజ్ ఇవ్వవలసినది. కాని అన్ని అవకాశాలకే ఇచ్చినారు. అది ఏమి నాకు

## అంజిగాడుగారూ!

నేను వేసంగి సెలవులకు మా చుట్టాలనందరినీ ఒకమారు చూచివద్దామని ముహూర్తం పెట్టుకుని కృష్ణాజిల్లాలో అడుగు పెట్టాను. పెట్టీపెట్టగానే పెద ప్రోలు చేరాను. అక్కడ పిల్లలతోటీ, స్నేహితులతోటీ సరదాగానే కాలం గడిచిపోతోంది. ఇంతలోనే ఏరువాక పౌర్ణమి వచ్చింది. ఈ ప్రాంతంలో ఈ రోజునే కమతగాళ్ళను మార్చుకుంటారు (పాలేర్లను). అలాగే మా ఇంట్లో కూడా కమతగాడిని మార్చి ఇంకొకడిని పెట్టారు. వాడికి పాలేరు పని చేయడము ఇదే మొదలు. అందులోనూ కుర్రాడు.

మా చుట్టాల పిల్లాడి కొకడికి "అంజి" అని పేరుంది. వాడిని ఊళ్లో వాళ్లుసహితం "అంజిగాడూ" అని పిలుస్తారు. ఇది కొత్తగా వచ్చిన పాలేరుకు తెలుసు. వాడు ఒకరోజున ఇంట్లో అందరినీ బహువచన ప్రయోగంచేసి పిలుస్తూ ఉంటే మావాళ్లు కేకలేసి "ఏమండీ" అనాలని చెప్పారు. ఆ రోజు రాత్రే మా "అంజిగాడి' తో పని వచ్చింది వాడికి. కాని మావాడు దూరంగా ఉండటంచేత పాలేరు "ఏమండీ అంజిగాడుగారూ!" అని కేకవేశాడు. అది విన్న మావాడు తారామండలానికి లేచిపోయి వాణ్ణి నానాతిట్లూతిట్టి ఆరోజు రాత్రి అన్నం తినకుండా పడుకున్నాడు. మా పాలేరు చేర్చిన "గారూ!" చేసింది అంత పని. ఇక అప్పటినుంచి "గారూ!" చేర్చాలంటే కూడా తెలిసి ఉండాలని నాకు తెలిసింది.

ప్రసాద్ (భీమవరం.)

నచ్చలేదు. మీరు ఇటువంటి వాటిలో కూడా పొరపడుతున్నారు.

ఎమ్. సరస్వతి (ఖమ్మంమెట్టు).

## బాలలసంఘం సభ్యులకు శుభవార్త

బాలల సంఘంసభ్యులకు మీరు ప్రకటించినశుభవార్త ఆ సభ్యులకేగాక యావత్తు ఆంధ్రులకు ఎంతయో సంతోషమును కలిగించిన దనుటలో అతిశయోక్తిలేదు. ఆంధ్ర సచిత్రవారపత్రిక విజ్ఞానమును అందివ్వడము మాత్రమేగాక విద్యార్థులకుకూడ ఇటువంటి పారితోషకములను ఇచ్చుట ఎంతయో అభినందించవలసిన విషయము. ఎవరు ఎటువంటి పారితోషకములను ప్రకటించినా మొదటి స్థానము పొందినవారికేగాని రెండుమూడు స్థానములు పొందినవారికికూడా ఎక్కడా ఇచ్చుట ఎరిగి ఉండము. అట్లుగాకుండా బాలలసంఘు సభ్యులకు మూడు స్థానము లవరకు బహుమతులు లభించుటలో వారి అదృష్టమునికూడ కొంత చెప్పవచ్చును. ఇటువంటి ప్రకటనచేసిన ఆంధ్రసచిత్రవారపత్రిక పాలకవర్గమువారికి నా కృతజ్ఞత. బాలల సంఘంసభ్యులకు నా ఆశీస్సులు.

కె. వెంకటేశ్వరరావు (కాకినాడ).

## గళ్ళనుడికట్టు

గళ్ళనుడికట్టులో ప్రతివారం ఏదో ఒక పొరపాటువస్తూనేఉంది. 6-7-60 సంచికలో అడ్డములో 9 వ ఆధారానికి నాలుగు నిలువుకు లంకెపెట్టారు. మళ్ళీ నిలువులో 4 నిలువు ఆధారానికి 19 అడ్డం ఆధారానికి లంకెపెట్టారు. 19 అడ్డం ఆధారంకాని, గళ్ళుకాని లేవు. ఇలాంటి పొరపాట్లులేకుండా పాఠకులకు ఉత్సాహం కలిగించ ప్రార్థన.

డా॥ ఎమ్. రామమూర్తి (విజయవాడ)

*** అది 19 కాదు, 17 అని చదువుకోవాలి. ఈ పొరపాటు దొర్లినందుకు చింతిస్తున్నాము.**

## ఎప్పుడూ ఇంతే

శంకర్ గారు వ్రాసే "ఎప్పుడూ ఇంతే" ప్రతివారికి చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. వచ్చే సంచికకోసం ఎదురుచూస్తూఉంటాను ఏమివ్రాస్తారోఅని. శంకర్ గార్కి నా(మా) అభినందనలు ఈ సంచికద్వారా అందించ నాప్రార్థన.

కుమారి సామవేదంలక్ష్మి (నరసాపురం.)

## సినిమా బొమ్మలు

మీరు 29-6-60 వారపత్రిక సినిమాబొమ్మలలో నాట్యభారతీవారితొలిచిత్రం 'దేవుడు చేసిన మేలు'లో అని ఒకబొమ్మ వేశారు. కాని 'దేవుడుచేసినమేలు' నాట్యభారతీ వారి తొలిచిత్రంకాదు. రెండవచిత్రం. వారి తొలిచిత్రం 'పుట్టిల్లు'. అందులో నేనేటి ప్రఖ్యాతతార జమున ప్రథమంగా నటించింది.

వి. వి. రావు. (రాజమండ్రి).

## చదరంగం

22-6-60 తేదీ పత్రికనుండి తిరిగి పాఠకుల కోరికపై "చదరంగం" గురించి వ్యాసము ప్రచురించినందుకు చాలా సంతోషము కలిగినది. ప్రతివారం విడువకుండా, ప్రచురించెదరని తలుస్తాను. తరచు, ఇదివరలోలాగ, సమస్యలుకూడా ప్రచురించవలెను.

ఎ. ఎస్. రామమూర్తి (యూర్కాలా.)

* * *

22-6-60 పత్రికలో పడిన "చదరంగం" లో దత్తాగారిఆట ఏమియుబాగులేదు. సరిగా ఆడినయెడల రంగారావుగారే నెగ్గవలసినవారు. రంగారావుగారు "షా" అన్నతరువాత "దత్తా" గారు రాజును మార్చుకొనుటకు వీలులేదు. కాని ఆయన దానికి విరుద్ధముగా ఆడినారు. దానివలన దత్తాగారికి బాగుగా లాభించినది.

రంగారావుగారు ఆటఅంతా బాగుగా ఆడినారుకాని 20 వ ఎత్తులో రంగారావుగారు శకటుచే "షా" ఎందుకన్నారో అర్థం కావడంలేదు. దానివలన రంగారావుగారు ఓడడం తటస్థించింది.

సి. ఎస్. రావు (నాగపూర్)

* * *

కొన్నివారాలుగా నిలిచిపోయిన "చదరంగం" మరల ప్రవేశపెట్టినందులకు నాధన్యవాదాలు. "సినిమా" శీర్షిక ఉంటున్నట్లుగా 'క్రీడారంగం' శీర్షిక ప్రతివారం 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'లో ప్రచురించవలసిందిగా నా మనవి.

నందిరాజు బలరామమూర్తి (పరుమూరు)



## "ఎవరికి వారే...."

### (మొదటి బహుమతి రు. 10 లు)

ఆరోజున మా స్కూలు వార్షికోత్సవం. డ్రామాలు, డాన్సులు మొదలగునవి పెద్ద ఎత్తున ఏర్పాటు చేయబడినవి. ఆ సంవత్సరము శతవార్షికోత్సవము కావడం వల్ల అందరు చాలా ఘనంగా జరుపుదామనే ఉత్సాహములో ఉన్నారు. కార్యక్రమము ప్రార్థనతో మొదలుపెడతారు. ఆ ప్రార్థనకు మా సంగీతం మాస్టారు స్కూలులో బాగుగా పాటలు పాడే నలుగురు అమ్మాయిలకు తర్ఫీదు ఇచ్చారు. మరికొంతమంది అమ్మాయిలకు వీణ, ఫిడేలు, మద్దెల మొదలగు వాయిద్యాలు బాగుగా నేర్పి వారినికూడా తయారు చేశారు. కార్యక్రమమునకు ముందు అందరూ బాగుగా రిహార్సల్సు వేసుకొన్నారు. ప్రోగ్రాములో మొట్టమొదట ప్రార్థన కనుక, సంగీతం మాస్టారు వీరినందరినీ స్టేజిమీదకు పంపుతూ ఏమీ భయపడవద్దని, జాగ్రత్తగా పాడమని, జాగ్రత్తగా వాయిద్యాలను వాయించమని చెప్పి, ఎవరికైనా (స్టేజి) భయమేస్తే, తక్కినవారితో పాటు పాడుతున్నట్లుగాని, వాయిద్యాలు వాయిస్తున్నట్లుగాని నటిస్తే చాలని ధైర్యము చెప్పారు. వీరు స్టేజిమీదకు వచ్చారు. తెర ఎత్తారు. వెనకనుండి మాస్టారు "ప్రార్థన" అని తెలియపర్చారు. స్టేజిమీదున్న వారందరి నోళ్ళు, చేతులు కదులుతున్నాయిగాని, శబ్దము మాత్రము రావడములేదు.

టి. సత్యవతిదేవి (రాజమండ్రి)

* * *

## 'మాటలు రావంటావేం ?'

### (రెండవ బహుమతి రు. 5 లు)

నా చిన్నప్పుడు మా అమ్మమ్మగారింటికి చుట్టపుచూపుకు వెళ్ళాము. సాయంకాలమయేసరికల్లా అంతా సినిమాకెళ్దాం అంటే వెళదాం అని బయలుదేరారు. మేమంతా చిన్నపిల్లలవడంచేత మా అమ్మమ్మగారే టిక్కెట్లు కొన్నారు. అందరూ హాలులోకి వెళ్తున్నాము. గేటుకాపలావాడు అందర్నీ లెక్కపెట్టి మా అమ్మమ్మగారి చంకలో ఉన్న మా బావకు (5 ఏళ్లు) టిక్కెట్టేదని అడిగాడు. ఏంసంజాయిషీ చెపుతారో అని మేమంతా బిక్కుబిక్కు మంటూంటే మా అమ్మమ్మగారు "ఆ చిన్నపిల్లాడికి మాట లేనారావు. వాడికి టిక్కెట్టెమిటోయ్" అని లోపలి కెళ్ళబోయారు. "నాకు మాటలు రావంటావేం మామ్మా" అని ఒక్క పేడుపు లంకించుకున్నాడు మా బావ. అప్పుడు గత్యంతరంలేక మరో టిక్కెట్టు కొనుక్కుని హాలులోకి వెళ్లి కూర్చున్నామంతా.

వి. వి. రావు (భిలాయ్.)

* * *

## 'ఓఖీ చలా జాయగా'

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఇటీవల మా బావగారింటికి, చుట్టపుచూపుకు, ఖరగ్‌పూరు వెళ్ళాను. ఆయన రైల్వేలో పని చేస్తున్నారు. ఆరోజు ప్రొద్దుట నాకు అనారోగ్యంగా ఉంటే, దగ్గరగాఉన్న రైల్వే డిస్పెన్సరీకి తీసుకెళ్ళారు. మా బావగారిని చూచి, డాక్టరు ఎదురుగాఉన్న కుర్చీ చూపించారు, కూర్చోమని, చిరునవ్వుతో పలకరిస్తూ. అక్కడ పేషంట్సు క్యూలో నిలబడి ఉన్నారు. ఒకళ్ళ తరువాత ఒకళ్ళు డాక్టరుగారి దగ్గరకు వెళ్ళి తమ అనారోగ్యం గురించి ఏకరువు పెడుతూ, ఆయన ఇచ్చిన చీటి పుచ్చుకొని వెళ్ళిపోతున్నారు. ఒక పేషెంటు దగ్గరగా వెళ్ళి "డాక్టర్ సాబ్! నాకు క్రిందటిరాత్రి నుంచి చాలా తలనొప్పిగా ఉందండి!" అంటూ మొదలు పెట్టాడు. డాక్టరుగారు అతన్ని ఉత్సాహపరచడానికి "డర్ నహీ, జల్దీ చెలాజాయగా" (భయంలేదు, వేగిరంగా పోతుందిలే) అన్నారు. "డాక్టరుగారు!!" మళ్ళీ మొదలుపెట్టాడు తన కడుపు చూపిస్తూ, "నా కడుపుకూడా నొప్పెడుతోంది అండి" అని. "ఓఖీ చెలాజాయగా" అన్నారు డాక్టరుగారు యదాలాపంగా చీటీ రాస్తూను. "డాక్టరుగారు!!! కొంచం జ్వరంకూడా వచ్చిందండి" తన అనారోగ్యం గురించి చెప్పడం పూర్తి కాలేదన్నట్లు మళ్ళీ మొదలు పెట్టాడు అతడు. "ఓఖీ చెలా జాయగా" అన్నారు డాక్టరుగారు; చీటీలోని పేరు వగైరా తన రిజిష్టరులో వ్రాసుకుంటూ. ఇంతలో ఒక మరక్షుంక, వెనకనుండి, తగ్గు స్వాయిలో "జాన్" (ప్రాణం) అన్నాడు. "ఓఖీ చెలాజాయగా" అన్నారు డాక్టరుగారు, తల ఎత్తకుండానే. క్యూలో ఉన్న అందరు ఒక్కసారి పొట్ట చెక్కలయేలాగ విరగబడి నవ్వడం మొదలుపెట్టారు. ఒక్క నిమిషంలో తేరుకొని, డాక్టరుగారు తను అన్నమాటకు కొంచం సిగ్గుపడ్డారు.

ఎస్. కామేశ్వరి (పాలిమార్).

* * *

## అనుభవం

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఇంటర్మీడియట్ పరీక్షకు మూడుసార్లు కూర్చున్నాను. కాని ప్యాసు కాలేదు. నాకిక చదువుమీద విరక్తి కలిగింది. వెధవ చదువు అనుకున్నాను. అర్ధరాత్రి ఇంట్లో ఎవరికీ చెప్పకుండా విశాఖపట్టణం వెళ్ళిపోయాను. మిలిటరీలో చేరిపోదామన్న ఉద్దేశ్యంతో...మర్నాడు ఉదయమే మిలిటరీ ఆఫీసర్ బంగళాకు వెళ్ళాను. అతను దొరం కుర్చీలో దర్జాగా కూర్చొని సిగరెట్ కాలుస్తున్నాడు. ఆ దొర అప్పుడే టిఫిన్ పూర్తి చేసినట్లున్నాడు. ఆ ప్రక్కనే ఒకడు పళ్లెలను సర్ది క్రింద పడిఉన్న సిగరెట్ పీకల్ని ఏరుతున్నాడు. అతడు మన ఆంధ్రుడే. ప్యూన్ అయిఉంటాడు. ఆ అభాగ్య జీవి మీద నాకు అపరిమితమైన జాలి కలిగింది. నాకు ఉద్యోగం వచ్చిన వెంటనే నా 'ఇన్ఫ్లుయన్సు' ఉపయోగించి మంచి ఉద్యోగం ఇప్పిద్దామనుకున్నాను.

ఇంతలో దొరగారు నన్ను పిలిచారు. నా వివరాలు తెలుసుకొని చివరికి ఉద్యోగం ఇచ్చానన్నారు. మర్నాడే ట్రయినింగ్‌కు మెడ్రాస్ పంపిస్తానని చెప్పి లోపలకు వెళ్ళిపోయారు. ఆయన ఇంగ్లీషు ఏసబట్టి ఏ ఉద్యోగం ఇచ్చారో తెలుసుకోలేకపోయాను. కానీ నా పర్సనాలిటి (నేను అజానుబాహుణ్ణిలెండి) అవీ చూసి పెద్ద ఉద్యోగమే ఇచ్చి ఉంటారనుకున్నాను. ఆ ప్యూన్ ఫీలో ఇంకా పళ్ళాలు సరుతున్నాడు. నా ఆత్రుతకొద్దీ "నాకు ఏ ఉద్యోగం ఇచ్చా"రని అడిగాను ఆతన్ని.

అతడు తన పనిలో నిమగ్నుడై "నీకు రెండు ప్రమోషన్లువస్తే నా హోదా వస్తుంది" అన్నాడు.

ఆశ్చర్యంతో తెరచుకొన్న నా నోరు కొన్ని సెకండ్లవరకు అలానే ఉండిపోయింది. వెంటనే ఇంటికి ప్రయాణం కట్టాను.

కె. రామానుజాచారి (ఏలూరు)



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## రాజకీయాలలో తిరిగి ఇత్తెహాద్ ప్రవేశం

సముద్రపుమట్టం ఏడాదికి ౧" అంగుళం చొప్పున పెరిగితే, ఎన్ని వేల సంవత్సరాల తర్వాత ఏ ఖండానికి, ఏ దేశానికి ముప్పు వాటిల్లగలదో చూచాయగా చెప్పగలిగినవాడు శాస్త్రజ్ఞుడు. ప్రభుత్వాల విధానాలు, సమాజాల ఆచారాలు కొన్ని శతాబ్దాల తర్వాత ఏ ఫలితాలకు దారి తీస్తాయో చెప్పగలిగిన పెద్దమనిషి రాజనీతిజ్ఞుడు. ప్రజాభిప్రాయం అనే గోడమీది పిల్లి రేపొద్దున్న ఇటు దూకుతుందో, అటు దూకుతుందో, అసలు దూకకుండా కూచునే ఉంటుందో చెప్పగలిగినవ్యక్తి రాజకీయ నాయకుడు.

శాస్త్రజ్ఞుడు ప్రకృతి పరిణామాలు తిలకించి, తల పంకిస్తాడు. జీవితాంతం పరిశోధనలు సల్పి, బృహత్తర గ్రంథరచనకు పూనుకుంటాడు. రాజనీతిజ్ఞుడు మాస పత్రికల్లో వ్యాసాలు రాస్తాడు; రేడియో ప్రసంగాలు చేస్తాడు. రాజకీయ నాయకుడు గోడమీది పిల్లి తలదువ్వడం ప్రారంభిస్తాడు; లేకుంటే-సామెతలో పనిలేనిమంగలి చేసే పని చెయ్యడం ప్రారంభిస్తాడు.

అంతేకాదు: ఆదివారం ఉదయం గోడమీది పిల్లి ఇటు దూకుతుందని ప్రకటించి, మధ్యాహ్నం అటు దూకుతుందని పత్రికా గోష్ఠిలో వివరించి, సాయంత్రం గోడమీదే ఉంటుందని ఉపన్యాసమిస్తాడు. సోమవారం ఏం జరిగినా, 'నేను ముందే చెప్పలేదా?' అని ప్రశ్నిస్తాడు.

హైదరాబాదు రాష్ట్రం సంకెళ్ళు త్రెంచుకొని పన్నెండు సంవత్సరాలు గడిచిన తర్వాత, 1960 లో నగరపాలక సంఘానికి జరిగిన ఎన్నికలు చూస్తుంటే, నగరంలో గోడమీదిపిల్లి ఎటు దూకనుందో గమనించగలిగిన రాజకీయ నాయకులే లేరా ఈ మహానగరంలో అనిపిస్తుంది.

1948 కి పూర్వం 1946 తర్వాత నిజాం ప్రభువరేణ్యుడు కలలు—పగటి కలలు!—కనడం ప్రారంభించాడు. మతపాక్షిక శక్తుల్ని ఉద్వేగంగా లేపిన ఖాసిం రజ్వీ అనే లీడరు నిజాం కలలు నిజంచేయగలనన్నాడు. మహాఘనత వహించిన ప్రభువరేణ్యుని పాదాలను బంగాళాఖాతపు కన్నీళ్ళచే కడిగిస్తానన్నాడు. రాష్ట్రంలో లక్షలాది ముస్లిమేతర ప్రజల కన్నీరుతో ప్రభువును అభిషేకం చేయించాడు. రాష్ట్రంలో— ముఖ్యంగా నగరంలో లక్షలకొలది ముసల్మానులున్నారు. వారందరూ రజ్వీ ధోరణితో అంగీకరించారనుకోడం పొరపాటు. అసమర్థులై చాలామంది వ్యతిరేకించడం చేతకానివారయ్యారు. వ్యతిరేకించిన షోయిబుల్లాఖాన్—'ఇమ్రోజ్' పత్రికా సంపాదకుడు—దారుణంగా హత్య చేయబడ్డాడు. అయినా మహమ్మదీయులందరూ ప్రభుత్వానికి వ్యతిరేకంగానే ఉండేవారని భావించడమూ పొరపాటే ఔతుంది.

1960 లో హైదరాబాదునగరంలోగల మహమ్మదీయుల్లో ఒక విధమైన అసంతృప్తి స్పష్టంగా కనిపిస్తోంది. ఒకటి: ఒకనాటి కలలు భగ్నం కావడంవల్ల వచ్చిన అసంతృప్తి. పేకముక్కలమేడ కుప్పకూలిపోవడంవల్ల వచ్చినది. థర్డ్ క్లాస్ రైల్వే కంపార్ట్‌మెంటుల్లో, ఇరానీ హోటళ్ళలో మహమ్మదీయులు మాత్రమే ఉన్నప్పుడు, పక్కనున్న ఇతరులకు వారిభాష అర్థం కాదనుకున్నప్పుడు ఈ సంభాషణలు వినబడతాయ్. ఎయిర్ కండిషన్డ్ గదుల్లో కూర్చొని, ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటుల్లో మాత్రమే ప్రయాణంచేసే రాజకీయ నాయకులకు ఈ సంభాషణలు వినబడవు.

'అంధారా అంధేరా హోగయా!' అని నిజమైన సంతృప్తిలో [illegible]లేని సంతృప్తి అనుభవించే ముసల్మాను వృద్ధుల నిట్టూర్పులివి. ఈ నిట్టూర్పుల వేడిగాలి గాంధీభవన్ గవాక్షాలలోనుంచి లోపలికి పోదు. గ్రీన్‌లాండ్ పొలిమేరలకే పోవు ఈ అభిప్రాయాలు.

రెండు: పన్నెండు సంవత్సరాల స్వాతంత్ర్యం తర్వాత నాలుగువేళ్ళు నోటిలోకి పోలేనిస్థితిలో పడిన ముసల్మాన కుటుంబాల అసంతృప్తి. 1948 కి పూర్వం చదువుకున్నవారు తక్కువ. ఉద్యోగావకాశాలు నగరంలో ఎక్కువ. మెట్రిక్యులేషన్ పరీక్ష పాసవకపోయినా అకౌంటెంట్ జనరల్ కార్యాలయంలో యుడిసి పదవి దొరికే రోజులవి. మెట్రిక్యులేషన్ పాసైనవాడికి నూరు రూపాయలుపైన జీతంవచ్చే మాస్టరీ ఉద్యోగం వచ్చేరోజులు. బి ఏ పాసైతే మొత్తం 199 రూల నెలజీతంలో మాస్టరు, హెడ్మాస్టరు, అనతికాలంలో గజెటెడ్ ఆఫీసర్ కాగలిగిన అవకాశం ఆ రోజుల్లో ముసల్మానులకు ఉండేది.

సమర్థులు నాడు పెద్ద అధికారులయ్యేవారు; అసమర్థులు ఉద్యోగులయ్యేవారు. 'చా — పాన్ - బాతాఖానీ' లతో తృప్తిపడేవారుకూడా సాధించలేని క్లిష్టమైన సమస్యలానాడు లేవు.

ఈనాడు ముసల్మానులలో పెక్కుమందికి ఉద్యోగావకాశాలులేవు. నిజం చెప్పాలంటే ఉద్యోగావకాశాలుఎవరికీ లేవు. కాని భూతకాలంతో పోల్చి చూసుకొని తామే నాశనమయినట్లు భావించుకుంటున్నారు ముసల్మానులు. మూసీ నదికి ఆవలఉన్న పాత పట్నంలో ఉంటారు ఎక్కువమంది. అది ఒకప్పుడు నగరంలో ప్రధానభాగం: ఇప్పుడు కాదు. కాక పోవడానికి ఒక కారణం నగరాభివృద్ధి. మరో కారణం: పాలకుల ఉదాసీనభావం. ఉదాసీనభావమే కారణమని భావించుకుంటున్నారు ముసల్మానులు.

ఈ అపోహను తొలగించడం ఎలా? మూడున్నర కోట్ల ఆంధ్రుల రాజధాని నగరంలో ప్రధానభాష తెలుగు కాక తప్పదని, లక్షలాది మహమ్మదీయుల మాతృభాష ఉర్దూ స్థానం ఎవరూ తప్పించలేరని మహమ్మదీయ సోదరులకు నచ్చచెప్పడానికి నాయకులకు పన్నెండు సంవత్సరాలు చాలలేదు. గత మూడున్నర సంవత్సరాలు అసలే సరిపోలేదు.

బ్రాహ్మణులకు బ్రాహ్మణేతరులకు హరిజనులకు మహమ్మదీయులకు జీవితంలో సుఖసంతోషం పెరగాలంటే ఒక బ్రాహ్మణానికి అరడజను బ్రాహ్మణేతరులను ఒక హరిజనునికి నలుగురైదుగురు మహమ్మదీయులకు మంత్రి పదవుల్లో ఉద్యోగాలో శాసనసభ్యత్వాలో అధికారాలో అప్పగిస్తే చాలుననే అభిప్రాయాలు నాయకులలో పోవాలి. ప్రజలందరికీ ప్రయోజనాలు సిద్ధిస్తేగాని లాభంలేదు.

1948 లో నిజామ్‌ను ఓడించి అతన్ని

ర్వాత రాజప్రముఖ్ చేశారు. ఎవర్ని ఉద్ధరించినట్టు? 1948 కి పూర్వపు విధానాల ఫలితాలను ఉచితంగా అనుభవించి తర్వాత రంగుమార్చి కాంగ్రెసు నాయకులయ్యారు కొందరు. కొందరు నిచ్చెనలెక్కి పైకిపోయారు. నిచ్చెన పైమెట్టుపై నిలబడి సిద్ధాంతాలను ఏకరువుపెడితే, కడుపుచేత పట్టుకొన్న సోదరుల మనసు కెక్కుతాయా అవి?

1957, 58, 59, 60 సంవత్సరములలోని నగర పోలీసుశాఖ రికార్డులను పరిశీలించమనండి. దొంగలు, దోపిడీదారులు, హంతకులు—వీరి జాబితాలు తీయిస్తే అందులో నూటికి 95 మంది మహమ్మదీయులు. చాలా మంది దాదాపు మూసీకి అవల నివసించేవారే. ఇది కేవలం అతిశయోక్తి కాదు. మహమ్మదీయ సోదరులందరూ శాసనోల్లంఘనం చేసేవారేనని కాదు. కాని ఈ 'గోడమీద వ్రాతల్ని' పాలకులెలా గమనించలేక పోయారు?

నగరంలో నిరుద్యోగ సమస్యా నిర్మూలనకు పదిలక్షల రూపాయలు కేటాయించామని, 2,800 కుటుంబాలు ఇప్పుడు అమలు జరుపనున్న పథకాలవల్ల ప్రయోజనంపొందగలుగుతాయని ప్రభుత్వం ప్రకటించింది. ఆలస్యమైనా ప్రణాళికలు సిద్ధపరచడం మంచిదే. కాని పథకాలన్నీ వెళ్ళేదారినే ఇదీ వెళ్ళి, కొందరిజేబులునింపడానికే సొమ్ము వినియోగపడితే ఈ నగరానికి మోక్షంలేదు. ఎంత ఖర్చుపెట్టారన్నది ప్రధాన సమస్య కాదు. ఎలా ఖర్చుపెట్టారన్నది; ఖర్చుపెట్టి ఏం ప్రయోజనం సాధించారన్నదీ ప్రధానమైనవి.

* * *

ఈవారం జరిగిన నపాలకసంఘపు ఎన్నికల ఫలితాలివి. హైదరాబాదు నగరపాలక సంఘంలో 66 స్థానాలున్నాయి. అభ్యర్థి ఒకడు మరణించడంవల్ల ఒక ద్విసభ్యనియోజకవర్గానికి ఎన్నికలు జరగలేదు. మిగిలిన 64 స్థానాలలో 33 కాంగ్రెసుకు లభించాయి. 18 ఇత్తెహాద్‌కు లభించాయి. 4 కమ్యూనిస్టులు బలపర్చిన యు. సి. సి. కి., మరి 9 స్వతంత్రులకు లభించాయి. ఈ తొమ్మిది మందిలో ఒకడు మజ్లిస్ బలంతో నెగ్గినవాడు.

సికిందరాబాదు ఎన్నికల్లో 28 స్థానాల్లో 15 కాంగ్రెసుకు లభించాయ్. స్వతంత్ర కాంగ్రెస్ ఫ్రంట్‌కు 4; సోషలిస్టులకు 2; పి. ఎ. స్పికి 1; కమ్యూనిస్టులకు 1; సి ఆర్సికి ఒకటి; నాలుగు స్వతంత్రులకు లభించాయి.

ఈ ఎన్నికలు రాష్ట్రనాయకులకు పాఠం చెప్పలేకపోతే—ప్రపంచంలో ఏదీ చెప్పలేదు.

(1) వెళ్ళిపోయిన హైదరాబాదు నపాలక సంఘంలో కాంగ్రెసుబలం 55. ఇప్పుడు నిలిచిపోయిన ఎన్నికల్లో రెండు స్థానాలు కాంగ్రెసు పక్షానికే లభిస్తాయని అనుకున్నా కాంగ్రెసుబలం 35 ఔతుంది. రాజధాని నగరంలో కాంగ్రెసు పక్షం ఈ విధంగా 20 స్థానాలు కోల్పోయింది. సికిందరాబాదులో పూర్వం ఉన్న 25 కు ఇప్పుడు పదిహేను వచ్చాయ్. పదిస్థానాలు పోయాయ్. ఓడిపోయిన కాంగ్రెసు వారిలో పాత నపాలక కాంగ్రెసు సంఘ 'మూలస్తంభాలు' ఉన్నారు.

హైదరాబాద్ నపాలక సంఘం నడుస్తున్న తీరును గురించి ఎన్నో వారాలు విమర్శలు ఈ 'కబుర్ల' లో వెలువడ్డాయ్. నియమాలను, నిబంధనలను అతిక్రమించి 'ప్రజాసౌకర్యమే'—అంటే ప్రజలకు సౌకర్యమే—పరమావధిగా పరిపాలన సాగిస్తే ప్రజలు పాఠం చెప్పరా? ఎప్పుడో ఒకప్పుడు?

నపాలకసంఘ ప్రక్షాళనానికి అడ్డదార్లు లేవు. ప్రభుత్వం ఎంత త్వరితంగా, ఎంత తీవ్రంగా చర్య తీసుకుంటే అంతమంచిది.

(2) బహిరంగంగా ఇత్తెహాద్ ఎన్నికలకు నిలబడి 18 స్థానాలు సంపాదించింది. రెండు సంవత్సరాల క్రితం రహస్యంగా ఇత్తెహాద్‌తో రాజీ సమాలోచనలు నడిపిన వర్గం వారు కాంగ్రెసు అధికారపక్షానికి ఇప్పుడు క్షమాపణ చెప్పుకోవల్సి ఉంటుంది. మసీదుల్లో ఉపన్యాసాల దశ గడిచిపోయింది; పోలీసులు రహస్యంగా సమాచారం సేకరించవలసిన సమయం గడిచిపోయింది. దూరదృష్టితో ప్రజల సమస్యల్ని సానుభూతితో పరిశీలించే సమయం వచ్చిందిప్పుడు. పాలకులెటువంటి చర్యలు ఏవిధంగా తీసుకుంటారో గమనించాలి ఇప్పుడు.

శాస్త్రజ్ఞుల సంగతి అటుంచినా, రాజనీతిజ్ఞులు నగరంలో లేరని పన్నెండు సంవత్సరాల నగర చరిత్ర ఘోషిస్తోంది. గోడమీది పిల్లి ఎటు దూకుతుందో గమనింపగల రాజకీయ నాయకులు కూడా లేరని ఈ ఎన్నికలు ఋజువు చేశాయ్.



# మధుమనోజ్ఞత

**ఆర్. శాంతిసాగర్**

తొలిచూపున నంకురమై
మలిచూపున పుష్పమాధురిమ వెలార్చెడు రా
గలతిక పెనవైచుకొనగ
పలికె రసాః హృదయ మొక ప్రణయపికమ్మై.

ఇదిమధువై తలపుల పూ
బొదల మదించిన భ్రమర సమూహము ఝుంఝుం
రొదల విపంచిక మీటెను,
ఎదచేర్చిన విరహగీత మీ విధి వెడలెగ.

నవమల్లికయును చూతము
పవనమునగ గూర్చి మధుర వాంఛాక్షతమా
యున హృదయోద్గమనమధువు
నవశత రుచిచూచె మారు డతికతినుండై.

జడములు చేతనమ్ములును సర్వము శాంతిపయోధిః దేలి, ఈ
యెడ ననురాగ భావమున హ్రీమతి తెల్లనిసిగ్గునవ్వులన్,
విడినసుమమ్ములై మధుర వీక్షణ భావన సుందరమ్ములై
ఎడదను గ్రుచ్చి హత్తినటు లేదో మనోజ్ఞత కల్గె దివ్యమై.



# నర్తకి

## శంకరమంచి సత్యం

ప్రేక్షకాగారం అతినిశ్శబ్దంగా గాలి కదలటం లేదన్నట్లున్న ఆ హాలు ఉన్నట్టుండి హోరుహోరున మోతలెత్తింది. నృత్య ప్రదర్శనం కరతాళధ్వనులతో ముగిసింది. రతి మెడనిండా దండలు నిండిపోతున్నాయి. అభినందనల వర్షం కురుస్తోంది. అద్భుతం, అమోఘం, ఆశ్చర్యం, ఓహో, ఆహా మొదలైన మాటలు మూకుమ్మడిగా దొర్లుతున్నాయి. రతికి మెళ్లో గులాబీలు గుచ్చుకుంటున్నాయి. గాలిచొరలేని అభిమానుల గుంపుమధ్య, ఆనందం పట్టలేని రతి. పూలదండల బరువుతో భారంగా వంగి గురువుగారికి పాదాభివందనం చేసింది. గురూజీ కళ్లలో ఆనందాశ్రువులు కదలాడగా, రతిని పైకి లేవనెత్తి శిరస్సు చుంబించాడు. గుంపులో ఇద్దరుముగ్గురు కుర్రకారు కొరకొర చూశారు.

జనం సద్దుమణిగారు. బయట సిద్ధంగా ఉన్న కారులో గురూజీ వెళ్ళికూర్చున్నారు. గజ్జెలు విప్పుకుని తనూ వెళ్ళాలి. రతి వంగి గజ్జెలు విప్పుకుంటోంది.

‘విలయం పుట్టించగల మీ కోమలమైన పాదాలమీద ఈ పువ్వులు పెట్టిపోదామని వచ్చాను.’

వంచిన తల ఎత్తిచూసింది. ఎదురుగా మొంగగొంతు–చిరునవ్వు కళ్లు–చురుక్కుమన్న చూపు.

‘మీ...ఈ...మీ...మీ...’

బయట కారుహారన్ మోగింది.

‘ఆ...వ...స్తున్నా’

ఒకకాలి గజ్జెలపట్టెడ గబగబా విప్పుకుని, తొందరపాటుగా రెండడుగులేసి ‘అబ్బా’ అని కూర్చుండిపోయింది. గజ్జెలపట్టెడలోని గజ్జె ఒకటి తెగి పాదానికి గుచ్చుకుంది.

‘మరి నా నివేదన తీసుకోకుండా పోతే ఎలా!’ అతడు తెగినగజ్జె చేతి కందించాడు. పువ్వులు పాదంమీదఉంచాడు. రతి చలించిపోయింది. అంతరాంతరాలో తంత్రులు తీవ్రమైన ప్రకంపనాన్ని పొందాయి.

‘మీ....ఈ...మీ....మీ...’ వణుకుతున్న పెదవులు–పెగలని మాటలు.

‘రాజు...’

బయటకారు హారన్ సన్నాయిలా మోగింది.

‘వ...వస్తా’ పువ్వులు, తెగినగజ్జె చేత్తో పట్టుకుని తొట్రుపాటుగా గేటువైపు పరుగెత్తింది.

‘బయటికి దయచెయ్యండి. మూసేస్తాం’ అన్న వాకిదారు పలకరింపుతో తేరుకున్నాడు రాజు.

రతి నృత్యంగురించి మర్నాడు పేపర్లో పడింది. రతితండ్రి పద్మనాభరావు పొంగిపోయాడు. ఆయనకు రతిలో ఏదో అలౌకికమైన శక్తిఉందని మొట్టమొదట్నుంచీ నమ్మకం. ఆయన భార్యపోయినప్పట్నుంచీ రతిని గారాబంగా పెంచాడు. మద్రాసులో ఉండగా తంజావూరునాట్యం నేర్పించాడు. అంతా బావుందన్నారు. ఆనందమైంది. అమ్మాయిని అంతా మెచ్చుకుంటుంటే ఆయనకు జన్మధన్యమైనట్లుండేది. ‘భలానా నాటి అమ్మాయి...ఓహో...’ అని అంతా పొగడాలి. జేజేలు పలకాలి. అదే తనజీవిత లక్ష్యం, అనుకున్నాడు.

కాని రతి మనస్సు నృత్యంపై పు ఆసక్తమై ఉందో లేదో తెలిసికోవటానికి ఆయ నెప్పుడూ ప్రయత్నించలేదు. తెల్లటి కాన్వాసుమీద తనకు చేతికందిన రంగు పూసేశాడు. అది అతుక్కుపోయింది. పద్మనాభరావుకు హైదరాబాద్ బదిలీ అవటంతో నృత్యానికి ఆటంకం ఏర్పడింది. రతి బి. ఏలో చేరింది. చదువు క్రమంగా సాగుతున్నా, పద్మనాభరావుకు రతి విద్యాఖాళీగా ఉన్నట్లు, కాలమంతా వృధా గాపోతున్నట్లు అనిపించేది. వెనకటి నాట్యపాఠాలు మర్చిపోకుండా సాధన చేస్తూ ఉండమని రోజుకు నాలుగుసార్లు హెచ్చరించేవాడు. రతికి నృత్యంమీద ప్రత్యేకమైన అభిమాన మేమీ ఉన్నట్లు కనిపించదు. అదొక వ్యాపకం. చదువు చూసుకుంటూ, మధ్యమధ్య నాట్యం సాధన చేస్తుంటే విశ్రాంతిగా ఉంటుంది. మనసుకు సుఖంగా వొంటికి ఆరోగ్యంగా ఉండేది. అప్పుడప్పుడు తన స్నేహితురాళ్లు పొగుడుతూఉంటే, కళ్లు గర్వంగా మిలమిల లాడేవి. తల ఠీవిగా పైకెత్తి ముందుకు వే కొన్న జాల్జడను అలవోకగా వెనక్కు విసిరికొట్టేది. ఆ విసురుకు జడగంటలు గునగున లాడేవి.

కొంతకాలానికి పద్మనాభరావుకు గురూజీ తటస్థపడ్డాడు. గురూజీ కూచిపూడి నాట్యంలో అందెవేసిన చెయ్యి. కాని ఆయన కూచిపూడి మనిషి కాదు. ఇంగ్లీషు చదువుకున్నవాడు. ఈనాటి సమాజం అభి

షయాలు తెలిసినవాడు. మిగతా భారతీయ నాట్య సంప్రదాయాలు కూడా కొద్దికొద్దిగా గ్రహించినవాడు. గీతానికి స్వయంగా నాట్య రచన చేయాలనే ఆసక్తి కలవాడు. మర్నాటి నుంచీ రతి గురూజీవద్ద నాట్యాభ్యాసం ప్రారంభించింది.

రతి ఎదిగివస్తున్న గున్నమామిడి చెట్టులా ఉంది. ఆమెలో తొంగిచూస్తున్న యౌవనం గీతానికి, గీతావలంబనమైన నాట్యానికి నిండుతనం కూరుస్తోంది. ఆమె నవ్వులో పూర్వపు పసితనపుఛాయ మాయమయి గుండెలు చివ్వటం నేర్చుకుంది. నడకలో తప్పటడుగులుపోయి సౌందర్యవిన్యాసం సమకూరింది. పాలబుగ్గల చెక్కిళ్ళు ఎరుపుదనం నించుకుని రాగరంజితాలవుతున్నాయి. చూపులు తూపులైనాయి. అధరం ఇప్పుడందరికీ అందరానిదయింది. తొలిసారిగా సిగ్గుపడి నేల చూడటం మొదలెట్టినరతి వసంతసేన అయింది.

రతి నృత్యప్రదర్శనానికి అంతా సిద్ధమైంది. మంత్రులకు, ఆఫీసర్లకు, న్యాయవాదులకు, వర్తకులకు, కళాకారులకు, అందరికీ ఆహ్వానాలు వెళ్ళాయి. నగరంలో దాదాపు అన్ని సాంస్కృతిక కార్యకలాపాలతో సంబంధం పెట్టుకున్న ఒక ప్రముఖ అధికారిని ఆశీర్వదించవలసిందిగా అభ్యర్థించారు. ఆయన పదినిమిషాలు ఉండటానికి ఒంటగా అంగీకరించాడు. దేశంలోని ప్రముఖులకు సందేశాలు పంపమని కోరుతూ పదిరోజులు ముందుగా జాబులు వ్రాశారు. వారు యథాశక్తి దీవిస్తూ ప్రదర్శనానికి రెండురోజులు ముందుగా జవాబులు వ్రాశారు. అవి చదవటానికి మరొక ప్రముఖుణ్ణి నియమించారు. పెద్దపెట్టున ఏర్పాట్లన్నీ జరిగాయి. హాలు ద్వారాలకు మామిడి తోరణాలు, దోవంట కొబ్బరి మట్టలు కట్టించారు. హాలు బయట వందమంది పోలీసుల బందోబస్తు పెట్టించారు. ప్రదర్శనం దిగ్విజయంగా ముగిసింది. మంత్రులు, ఆఫీసర్లు, వర్తకులు, న్యాయవాదులు, కళాకారుల్లో కొందరు పద్మనాభరావుని, గురూజీని పదే పదే అభినందించి ఆకాశానికెత్తేశారు.

* * *

రతికి ఆనాటిరాత్రి నిద్ర పట్టటంలేదు. ప్రదర్శన దిగ్విజయంగా పూర్తవటం, జనమంతా తనచుట్టూ మూగటం అవన్నీ విశేషంగా కన్పించలేదు. రాజా తనపాదం తాకినప్పుడు తను వణికిపోయింది. తనలో రక్తం ఉరకలు పెట్టి పొర్లింది. పురుషుడి స్పర్శలో ఇంత శక్తి ఉంటుందా అనుకుంది. కాని



# నర్తకి

గురూజీ తనకు భంగిమ కుదరనప్పుడు చాలా సార్లు తాకి చెప్పేవాడు. చేతులు విరిచేవాడు కాని తానెప్పుడూ కదిలిపోలేదు. తనకే భావనా కలగలేదు. తెగిన గజ్జె చేతికివ్వటం, తన పాదంమీద పువ్వు లుంచటం తలుచుకుని, సిగ్గుపడిపోయి, చేతులతో పాదాలు కప్పేసి తలవాల్చేసుకుంది.

టేబుల్ మీద తెగిన గజ్జె ఘల్లుఘల్లున మోగింది. రతిలేచి ఓరమోముచేసి చూసింది. పక్కనే రాజు ఇచ్చిన రెండు గులాబీలు రెపరెపలాడి కవ్వించి పిలిచాయి. లేచివెళ్లి గజ్జెను, గులాబీలను పరుపుమీదికి తెచ్చుకుంది. గజ్జెను మళ్ళీ మళ్లీ మోగించింది. అర్ధరాత్రి నిశ్శబ్దంలో ఆ ఘల్లుమన్న నాదం, గుండె తీగల్ని పట్టి బలంగా ఊపుతోంది. అది దేవ గానంలా ఉంది. ఆ గులాబీలను తదేకంగా చూస్తుంటే నందనవనంలా ఉంది. గట్టిగా వక్షానికి హత్తుకుంది. తెల్లవారినా ఒళ్ళు తెలియదు రతికి.

ఇప్పుడు నాట్యం అభ్యాసం చేస్తుంటే రతికి కొత్తఅనుభవం కలుగుతోంది. తన సౌందర్యం తనకు స్పష్టంగా దర్శనమిస్తున్నట్లుంది; ఒకటి రెండుసార్లు గురూజీ రతినితాకి భంగిమ సరిచేయపోతే, దూరంగా జరిగి తనే భంగిమ సరిగ్గాపట్టింది. గీతంలోని సాహిత్యం ఇప్పుడు సరిగ్గా బోధపడుతోంది. సాహిత్యానుగుణంగా అభినయం పట్టుతున్నప్పుడు తన్మయపడుతోంది. రాజు గీతంలో సాక్షాత్కరిస్తున్నాడు. తను వేస్తున్న ప్రతిఅడుగు అతని సామీప్యం కోసం వేస్తున్నట్లుంది. తన హస్తవిన్యాసం అతన్నే పిలుస్తోంది. తనకళ్లు అతన్నే చూస్తున్నాయి. తన మనసు అతనే లగ్నమైంది.

'మరులూ గొన్నానే! చెలియ! మరువాలేకున్నానే' అన్న జావళీ అభినయిస్తూ రతి విరహంపొందింది. 'రాజేమో ప్రియుడు, నీలమేఘశ్యాముడు' అని వియోగంలో కంటనీరు పెట్టింది. 'ఏడే చోరుడే! నందకిశోరుడే' అని శిరంమోపుతూ కృష్ణుడిబుగ్గలునొక్కబోయి, తన బుగ్గలు నొక్కుకుని, పమిట చాటుచేసుకొని నవ్వుకుంది. 'కొసరి కొసరి నాతో సరసములాడకు' అన్న పదం పడ్తూ, మరీ మరీ కొసరికొసరి సంతోష సంకోచాలను అభినయించింది. 'విడు విడు నా కొంగు' అంటూ సిగ్గు ముంచెత్తగా కుప్పకూలిపోయింది. మీరాభజన్ అభినయిస్తున్నప్పుడు అతడు ప్రభువైనాడు. జయదేవుని అష్టపదిలో తను రాధికైతే అతడు మురళీమోహనుడు. తను ఎంకి-అతడు నాయుడుబావ, బంగారు మావ. గీతం నృత్యమైంది. నృత్యం తానైంది. తనలోని ప్రత్యణువూ అతనికొరకు సిద్ధపరచబడిన పవిత్ర నైవేద్యమైంది.

పద్మనాభరావు కూతురుమీద చాలాఆశలు పెట్టుకున్నాడు. రతి ఆంధ్రదేశంలో ప్రఖ్యాతిగన్న నర్తకి కావాలి. తర్వాత మిగతా రాష్ట్రాల్లో పర్యటించాలి. కేంద్రప్రభుత్వ మన్ననలు పొందాలి. ఆ తర్వాత విదేశాల్లో ప్రదర్శించాలి. ప్రపంచ మంతా తన కూతుర్ని మెచ్చుకోవాలి. జనమంతా 'నాట్యానికి మారుపేరు రతి' అని వేనోళ్ళ పొగడాలి. ఆమె జీవితం కళకు అంకితం కావాలి - అని.

ఒకరోజున పద్మనాభరావు అక్కగారు పనిగట్టుకుని హైదరాబాదు వచ్చింది. కాఫీ ఫలహారా లయ్యాక 'విన్నావుటే అమ్మాయి పేరు ఎట్లా మోగిపోతోందో' అన్నాడు పద్మనాభరావు.

'ఆఁ విన్నాముగాని, ఈడొచ్చిన పిల్లకు ఇంకా ఆ ఆటలూ, డాన్సులూ ఏమిటి? పెళ్ళి చెయ్యవా ఏంరా?'

'హుష్! పెద్దగా అనకు. అమ్మాయి వింటుంది' అని వారించాడు పద్మనాభరావు.

'ఏం వింటే! ఆదేం ఆడపిల్ల కాదా?'

'నీకు తెలియదమ్మ! ఇప్పుడు పెళ్ళిసంగతెత్తితే దాని జీవితం పాడైపోతుంది!'

'మరీ సోద్యం! పెళ్ళిచేసికొంటే బతుకు పాడవుతుందా?'

'నువ్వు మరీ పాతకాలపుదానివి.'

'మరి ఈ కొత్తకాలంవా ళ్లెవరూ పెళ్లిళ్లు చేసికోవడంలేదుట్రా?'

'అదిగాదే. నీ కర్థంకావటంలేదు. రతికి పెళ్ళిచెయ్యగూడదు. రతిలో నీకు తెలియని మహావిశేషం ఉంది. దాని దృష్టి నాట్యం మీదతప్ప, మరి దేనిమీదికీ పోకూడదు. పెళ్ళిచేసికొంటే నాట్యం దెబ్బతింటుంది. అది కళకు అంకితమైపోవాలి.'

'ఏవిట్రా! ఇందాకట్నించి చూస్తున్నాను. కళంటావు. అంకితమంటావు. ఇంతకీ ఆడదానికి పెళ్ళి వద్దంటావుట్రా!'

'అబ్బబ్బ. రతి అందరి ఆడవాళ్ళలా కాదే. అది సంసారంలో పడితే కళకు ద్రోహంచేసినట్లవుతుంది.'

'ఒరేయ్! ఇంక నీ వాగుడుఆపరా. పెళ్లి చేసికొంటే ద్రోహం చేసినట్లా. వయసొచ్చినా గంతులేస్తుంటే బావుంటుందా!'

'నీకు చెప్పలేక ఛస్తున్నానే, ఇంక ఆవిషయం వదిలెయ్.'

'అబ్బాయ్! నేనొక్క మాట చెప్తా విను. ఆడదాన్ని అట్లా ఉంచటం మన ఇంటా వంటా లేదు. ఏ వయస్సు ముచ్చట ఆ వయస్సుది. అ వయస్సులో ఆకల్యాణం ముచ్చట తీరకపోతే ముద్దుగా ఉండవలసిన అమ్మాయి మొద్దై కూర్చుంటుంది. తర్వాత నీ ఇష్టం.'

తలుపుచాటునుంచి వింటున్న రతికి ఈ వాదన నచ్చటంలేదు. నాన్న వచ్చి 'అమ్మా నీకు పెళ్లి చేద్దామనుకుంటున్నాను' అంటే ఎప్పుడు ఊకొడదామా అని ఎదురుచూస్తున్న రతికి పద్మనాభరావు మాటలు అపశ్రుతులుగా తోచాయి.

ఆంధ్రాభ్యుదయోత్సవాల్లో రతినృత్యం ఏర్పాటైంది. రతి ఈమారు ప్రదర్శన పేరు చెప్తేనే పులకరించిపోతోంది. రెండింతలుగా అలంకరించుకుంది. అద్దం ముందు కూర్చుని తన్ను తను చూసికొంది. అద్దంలో అప్సరస పిలిచింది. తన్నుతను కొంటెగా వెక్కిరించుకుంది. తన్నుతను చూపుడు వేలుతో బెదిరించుకుంది. నాట్య శిక్షణలో ఏపుగా పెరిగిన తన అవయవాలను చూసికొని మురిసిపోయింది. తన్నుతను ముద్దు పెట్టుకుని సిగ్గుతో చరాలున ముఖం తిప్పేసుకుంది.

నృత్యం ఆరంభమైంది. రతి కళ్లు రాజు కోసమే వెతుకుతున్నాయి. ప్రేక్షకుల్లో ఎక్కడా కన్పించటం లేదు. విరహం, వియోగం, అధికమైనాయి. ఎలుగెత్తి పిలిచింది. నీరసంతో ముఖం వాడిపోయింది. అతడికోసం నిరీక్షణలో అభిసారికై ఆత్మానుగతమైన భావాన్ని అభినయించింది. జనం దిగ్భ్రమ పొందారు. కార్యక్రమంలో తర్వాతభాగం నారాయణతీర్థ తరంగం, ఆ తర్వాత దశావతారాలు. రతి ముఖంలో విషాదచ్ఛాయలు వీడిపోలేదు. ఆమె కళ్లు ఇంకా వెతుకుతూనే ఉన్నాయి. ఎన్నడూ లేంది, తరంగం సగంఅయ్యేప్పటికి తిరఅలిసిపోయింది. దశావతారఘట్టంలో ముఖంలో క్రౌర్యం రాలేదు. చకచక పడవలసిన అడుగులు మందంగా పడుతున్నాయి. ఆ తర్వాత నాట్యం రక్తికట్టలేదు.

ప్రదర్శన అయింతర్వాత మామూలుగా అంతా దండలువేశారు. ప్రశంసించారు. అతడు రాలేదు. అంతా వెళ్లిపోయారు. అతడు రాలేదు. బయట కారు హారన్ మోగుతోంది. తను సమాధానం చెప్పదు. విప్పిన కాలిగజ్జెలు తిరిగి కట్టుకుంది. మళ్లీ

(53 వ పేజీ చూడండి)

"మన దేవూరు బ్రదర్?"
"నీది ఈ వూరు. నాదింకో వూర్."

* * *

"సార్ ఈ సీట్లో ఎవరన్నా ఉన్నారాండీ?"
"కళ్ళు కనపట్టంలే?"

—రాజులపూడి నరసింహారావు, నర్సాపురం.



# తెలుగు వెలుగులు 42

సొంప్రాంతుడు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు. ఆయన రాజకీయజీవితంకూడా చాలా పాతదైనది. అది ఈనాటిది కాదు. నాలుగు దశాబ్దాలనాడు ప్రారంభమైనది; నేటికీ సాగుతున్నది. కాని దానికి తగినంతగా ఫలితము సిద్ధించలేదు

ఈనాడు మంత్రిపుంగవులుగా విహరిస్తున్న వారనేక మందికి ఆయన దేనిలోనూ ఏ విధంగానూ తీసిపోరు. విద్య, త్యాగం, సేవ అన్నీ ఉన్నాయి. కాని ఆయనకు ఇంత వరకు ఏ పదవీ రాలేదు. బ్రహ్మదేవునికి దేవాలయ ప్రాప్తి లేనట్లే బ్రహ్మయ్యగారికి ఇంతవరకు పదవీప్రాప్తి లేకపోయింది.

ఆయనను అందరూ మరచిపోయినారా అంటే అదీ లేదు. ఏ పదవి ప్రస వచ్చినా, ఖాళీ వచ్చినా ఆయన పేరు ముందు వినపడుతుంది. వినపడడమే కాదు. ప్రతిష్ఠ జరగడమే తరువాయిగా కనుపడుతుంది. అయితే వైకుంఠపాళిలో ఆఖరి మెట్టు దాకా వెళ్ళినట్టే వెళ్ళి వెళ్ళి తటాలున మళ్ళీ క్రిందికి చేరుకుంటారు.

ఇది విచిత్రమే కాదు విచారకరంగానూ ఉంటుంది. కాని ఈ విచిత్రాన్ని మించి అందరికంటే ఎక్కువగా బ్రహ్మయ్యగారే నవ్వుతారు. ఇది ఆయనలో ఉన్న పెద్ద సులక్షణం.

సాధారణంగా అందరికీ గురువు అనేవారు ఒకరే ఉంటారు. బ్రహ్మయ్యగారికి గురువులు ముగ్గురు: ముట్నూరి కృష్ణారావు గారు, పట్టాభి సీతారామయ్య గారు, చెరుకువాడ వెంకట నరసింహంగారు.

మతత్రయాచార్యులలాగా వారు విభిన్నమార్గ శోధకులు; తత్త్వజ్ఞాలు. ఆ ముగ్గురిని కొలిచి ముగ్గురిమధ్య నలిగి పోయారు బ్రహ్మయ్య గారు. వారి రాజకీయ స్థితికి చాలా వరకు అదే కారణం. గురువులను కాదని తనదారిను తాను పోయి ఉంటే ఆయన భిన్నంగానే ఉండేవారు. కృష్ణాజిల్లా రాజకీయ ప్రతిష్ఠ పరపతి, వేరుగా ఉండేవి. ఇలా అనడం సాహసం. కాని ఇది సత్యం.

1937వ సంవత్సరంలో మొట్టమొదటిసారిగా కాంగ్రెసు మంత్రి పదవీ స్వీకారం చేసినప్పుడు రాష్ట్ర కాంగ్రెసుకు పట్టాభిగారు అధ్యక్షులుగాను, బ్రహ్మయ్యగారు ప్రధాన కార్యదర్శిగాను ఉన్నారు. ఆ రోజులలో ఈ రెండు పదవులు అంటే మహా గౌరవం.

బ్రహ్మయ్యగారు ప్రధానకార్యదర్శి పదవిని బహుదక్షతతో నిర్వహించారు. వీరి హయాంలోనే రాష్ట్ర కాంగ్రెసు కార్యాలయం ఒక కార్యాలయంలాగా పనిచేయడం ఆరంభమైనది. అప్పుడు అతివాదులని పేరుపడ్డ అల్లూరి సత్యనారాయణ రాజుగారు మొదలైన వారిని కాంగ్రెసు నుండి తొలగిస్తూ చేసిన సాహసనిర్ణయం కూడా వీరి హయాంలోనే.

బ్రహ్మయ్యగారికి రాజకీయనాయకులకు కావలసిన దంభం, ఆవేశం, వ్యూహరచనా నైపుణ్యం తక్కువ. గుంపును కట్టలేరు. గుంపును మెప్పింపలేరు. చివరికి గుంపులో ఉండలేరు.

పదవి లేకపోయినా బ్రహ్మయ్యగారు కాంగ్రెసు కుల ప్రసిద్ధుడు; వశిష్ఠుడు. ★



శ్రీనగర్‌లో ఇటీవల రాష్ట్రాల న్యాయశాఖామంత్రుల సమావేశానికి కేంద్ర న్యాయశాఖమంత్రి శ్రీ ఎ. కె. సేన్ ప్రారంభోత్సవం జరిపారు.

<u>న్యూఢిల్లీ లేఖ</u> — శ్రీకృష్ణ

# ప్రభుత్వోద్యోగుల సమ్మె బెదరింపు ప్రజాస్వామ్యానికే అగ్నిపరీక్ష

భారత ప్రభుత్వం ఈనాడు గొప్ప సవాల్ ఎదుర్కొంటున్నది. ప్రభుత్వానికి సవాల్ చేసినవారు ఎవరో కాదు ప్రభుత్వోద్యోగులే. వారి సంఖ్య సుమారు 20 లక్షలు.

జూలై 11 వ తేది అర్ధరాత్రినుంచి నిరవధికంగా సమ్మె సాగించడానికి నిశ్చయించారు ప్రభుత్వోద్యోగులు. వారు ఏర్పాటు చేసుకొన్న సంయుక్త కార్యాచరణ సంఘం ఈ నిర్ణయాన్ని పునరుద్ఘాటించినది.

సమ్మె సాగించ సంకల్పించిన ప్రభుత్వోద్యోగుల ప్రధానమైన కోరికలు యివి:

మొదటి వేతన సంఘం సిఫార్సు చేసినట్లుగా కరవుభత్యాన్ని జీవనవ్యయసూచితో ముడిపెట్టాలనేది మొదటిది.

ఢిల్లీలో 1957 డిసెంబరులో జరిగిన 15 వ భారతీయ కార్మిక మహాసభ సిఫార్సులకు అనుగుణంగా కనీసవేతనాలు నిర్ణయించాలనేది రెండవది.

ప్రభుత్వోద్యోగులు ప్రస్తుతం అనుభవిస్తున్న హక్కులకు, సౌకర్యాలకు భంగం కలుగరాదనేది ఆఖరిది.

ప్రభుత్వోద్యోగుల సంయుక్త కార్యాచరణసంఘం ఏర్పరచిన స్థాయీసంఘంలో సభ్యులు శ్రీయుతులు పీటర్ ఆల్వారెజ్, ఎస్. ఎమ్. జోషీ, ఎస్. ఎమ్. బనర్జీ, నాథ్ పాయ్ (పార్లమెంటు సభ్యుడు), ఆంజనేయులు, రామమూర్తి, ఎస్. గురుస్వామి ఆర్. సి. చక్రవర్తి. ఈ స్థాయీసంఘమే సమ్మె నిర్వహిస్తుంది.

సంయుక్త కార్యాచరణసంఘం సమ్మెలో పాల్గొనమని డాక్ పనివారి సమాఖ్యను కూడా అభ్యర్థించినదని శ్రీ ఆల్వారెజ్ ప్రకటించారు. ఇది జరిగితే దేశ ఆర్థికవ్యవస్థ పూర్తిగా స్తంభిస్తుంది.

భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ప్రధానకార్యదర్శి శ్రీ ఎస్. ఆర్. వాసవాడా సమ్మె చేయడం అవివేకమని ప్రభుత్వ సిబ్బందిని హెచ్చరించారు.

కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు ప్రస్తుతం గిట్టుబాటు అవుతున్న కనీసవేతనం కరవుభత్యం కలుపుకొని నెలకు 80 రూపాయలు. సంయుక్త కార్యాచరణసంఘం కోరిన మేరకు కనీసవేతనం ఇవ్వాలంటే ప్రభుత్వానికి సాలుకు అదనంగా 70 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది.

* * *

ప్రభుత్వోద్యోగులు సమ్మె చేయ బెదరించడానికిగల ముఖ్యకారణం ఏమిటి? ప్రధాన

మంత్రి ఇటీవల పత్రికా విలేఖరులతో గోష్ఠిలో ఒకమాట అన్నారు. దానిని పరిశీలించితే సిబ్బంది బెదిరింపులకుగల కారణం విదితం అవుతుంది.

"బొంబాయి రాష్ట్ర విభజనానంతరం దేశంలో ఒక భావం ఏర్పడింది. ఏమైనా సరే ఆందోళన అంటూ కొనసాగించితే అంతిమంగా ప్రభుత్వం ఆ ఆందోళనకు కారణమైన కోరికను అంగీకరిస్తుందనే భావమే అది" అంటూ విలేఖరులువేసిన ప్రశ్నకు సమాధానమిస్తూ శ్రీ నెహ్రూ ఇలా చెప్పారు: "అవునవును. అలాంటి భావం ఉన్నది. అయితే అది నిరాధారమైనదని నేను అనను. ఇదిగత చరిత్ర."

* * *

ఏమైనా ప్రభుత్వోద్యోగులతో వ్యవహరించడంలో ప్రభుత్వము, ముఖ్యంగా కార్మికశాఖ నిర్వహించినపాత్ర పరిశీలించవలసిన సమయం వచ్చినది. ప్రభుత్వయంత్రాంగాన్నే స్తంభింపజేసే పరిస్థితి ఏలా ఏర్పడ గలిగినది? దీనిని అనుమతించినవారు ఎవరు? అన్న అంశాలు పరిశీలించడం అవశ్యకం.

ప్రభుత్వ కార్మికశాఖ నేటివరకు నిర్వహించిన పాత్ర మరీ అక్షేపణీయంగా ఉన్నది. భారత రాజధానిలో విదేశ రాయబారకార్యాలయాలలో ఉద్యోగులుగా ఉన్న భారతీయులు స్వదేశానికి సేవచేసే తోడివారికన్న అన్ని విధాలా అధికంగా శ్రమించి పనిచేస్తున్నారు. దానికి ఒకటే కారణం. అసమర్థులు కావచ్చు; క్రమశిక్షణకు భంగం కలుగజేయవచ్చు; ఏమైనా ఉద్యోగం పోతుందేమో అన్న భయం ప్రభుత్వ సిబ్బందికి లేకుండా చేసినది కార్మికశాఖ. ఉద్యోగులు అవసరమా కాదా అన్న విచక్షణ లేకుండా ఉద్యోగాలు అధికంగా కల్పించడమే పనిగా పెట్టుకొన్నది కార్మికశాఖ నేటివరకు.

ఇక ఉద్యోగులు చేసేపనికి సంబంధించి? వంతమట్టుకు దానిని నిర్ణయించడానికి తగు సూత్రాలు అయినా రూపొందించలేదు కార్మికశాఖ. అమెరికా ప్రభుత్వం ఖర్చుమీద పరిశీలకవర్గాలను విదేశాలకు పంపడంతో సంతృప్తి చెందుతూ వచ్చినది. 1947 ఆగస్టు 1వ తేదీని ఒక మూడవ డివిజన్ గుమాస్తా కాని, నాలుగవ డివిజన్ ఉద్యోగి కానిచేస్తూ వచ్చిన పని ఎంత? ఆయా తరగతుల ఉద్యోగులు నేడు చేస్తున్నది ఎంత? అన్నది పరిశీలించడానికి అయినా పూనుకొనలేదు. ఈలాంటి పరిశీలన నేడు అయినా సాగించితే సంయుక్త కార్యాచరణ సంఘం ఉద్యోగుల కోరికలను సమర్థించడానికి చాలా శ్రమపడవలసి వస్తుంది.

ఈ పరిశీలనకు 1947 ఆగస్టు 1వ తేదీ ఎన్నుకొనడానికి గల కారణం ఇది: **విదేశ ప్రభుత్వం పాలనలో భారతీయులు నేటి కన్న అధికంగా శ్రమించి పనిచేసేవారు.**

మరొక అంశంకూడా పరిశీలించడం కనువిప్పుగా ఉంటుంది. మూడవ డివిజన్ గుమాస్తాలు, నాలుగవ డివిజన్ ఉద్యోగులు రాకపోకలకు, కాఫీ టీలకు, టిఫిన్లకు, సినిమాలకు ఖర్చుచేసేది ఎంత? అన్నదే అది. ఉజ్జాయింపుగా లెక్కవేస్తే ప్రతి మూడవ డివిజన్ గుమాస్తా ఈలాంటి వాటికి నెలకు 80 రూపాయలు ఖర్చుపెట్టుతున్నాడు, స్వయంగా చూస్తేకాని నమ్మలేము దీనిని. ఏరోజు అయినా కేంద్రప్రభుత్వ సచివాలయం దర్శించండి. సచివాలయం పనిచేసే వేళల్లో ఎప్పుడూ కాఫీ హౌసులు, టిఫిన్ గదులు క్రిక్కిరిసి ఉంటవి.

* * *

ఈ సందర్భంలో పరిశీలనార్హమైన అంశాలు మరి రెండు ఉన్నవి. భారతీయ కార్మిక వర్గానికి తానే ప్రధానంగా ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు చెప్పుకొంటున్నది. బాంకుల ఉద్యోగులు ఈ సంస్థ నాయకత్వం క్రిందనే ఉన్నారని ఏనాడో విదితమైనది. ఇప్పుడు కేంద్ర ప్రభుత్వోద్యోగులు భా. జా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు నాయకత్వంక్రింద లేరని రుజువు చేయడానికి కాంగ్రెసేతర కార్మిక సంస్థలు అన్నీకలిసి నడుంకట్టినవి.

కార్మికసంఘాలు కార్మికవర్గానికి చెందని వారిమీద ఆధారపడి ఉన్నవని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పేర్కొనడం జరిగినది. ఈ దీనిని న్యూఢిల్లీ లేఖలో చాలా పర్యాయాలు ప్రస్తావించిన సంగతి పాఠకులకు విదితమే.

"పారిశ్రామిక కార్మికవర్గానికి చెందని వారిమీద కార్మిక సంఘాలు అమితంగా ఆధారపడడం మూలంగా కార్మికులు తమ వ్యవహారాలు తామే చక్కబెట్టుకొనగల శక్తి అవశ్యం కోల్పో గలరు. దీనిని కార్మిక సంఘాలు గుర్తించడం మంచి"దని కూడా రెండవ ప్రణాళికలో ఉన్నది.

అయితే కార్మిక వర్గానికి చెందనివారు అయినప్పటికీ ఎల్ల వేళలా కార్మికసంఘాల కార్యకర్తలుగా పనిచేసేవారికి, ఇతర వ్యాపృత్తులతోపాటుగా కార్మికసంఘాల వ్యవహారాలు చక్కబెట్టే వారికి భేదం ఉన్నదని కూడా ద్వితీయ ప్రణాళికలో స్పష్టంగా పేర్కొనడంజరిగినది.

కార్మికశాఖ తానుచేసిన సిఫార్సునే అమలుపరచక పోవడం కొంతమట్టుకు ఆందోళనకరమైన సంగతి. ప్రస్తుతం మన పరిశీలనలో ఉన్నవి కేంద్ర ప్రభుత్వోద్యోగులు ఏర్పాటు చేసుకొన్న కార్మిక సంఘాలు. ఈ ఉద్యోగులు విద్యావంతులు అయినప్పుడు ఆ సంఘాల స్థాపనకు నిర్వహణకు ఇతరులు అవసరమా? ఇంతకు ఈ సంఘాలు నిర్వహిస్తున్నవారు ఎవరు? ప్రతిపక్షాలకు చెందిన రాజకీయవాదులు! కమ్యూనిస్టులు, సోషలిస్టులూను.

* * *

15వ కార్మిక మహాసభ పేర్కొన్న ఖర్చులు అన్నీ లెక్కించితే 125 రూపాయలు కనీసవేతనం నిర్ణయించవలసి వస్తుందని వేతనసంఘం అంచనా వేసినది.

ఇతరవిషయాలు అటుఉంచి కనీస వేతనం నిర్ణయం విషయంలో ఉద్యోగుల కోరికను ప్రభుత్వం అంగీకరించితే ప్రభుత్వ సిబ్బందిలోనే అసంతృప్తి పెరుగుతుందని, విచక్షణ చూపినట్లు అవుతుందని చెప్పక తప్పదు. ఉదాహరణకు ఢిల్లీలో పనిచేసే కేంద్రప్రభుత్వోద్యోగికి కనీస వేతనం రు 125 లు లభిస్తే, ఢిల్లీ రాష్ట్ర ప్రభుత్వోద్యోగిగా ఉన్న అతని సోదరునికి నెలకు కేవలం రు 60 లు మాత్రమే లభిస్తుంది.

* * *

మంత్రివర్గం బలం మంత్రులు అందరిమీద ఆధారపడి ఉంటుంది. కేంద్ర మంత్రులు అందరిలో బలహీనుడు కార్మిక శాఖ నిర్వహిస్తున్న శ్రీ గుల్జారీలాల్ నందా. మూడేళ్ళనాడు ఆయన అనుసరించిన విధానం ఫలితంగానే రెండవవేతన సంఘం నియామకం జరిగినది. అప్పట్లో తంతితపాలాశాఖ సిబ్బంది సమ్మెచేస్తామని ప్రభుత్వాన్ని బెదిరించారు. ఈనాడు రైల్వే, తంతితపాల శాఖ, తదితర శాఖల ఉద్యోగులు అందరు సమ్మెచేస్తామని బెదిరించారు. ఇప్పుడు కూడా ఉద్యోగుల కోరికను ప్రభుత్వం అంగీకరించాలని, లొంగిపోవాలని ఆయనే సలహా ఇస్తున్నారు.

ప్రభుత్వంకాని ఇప్పుడు ఈ బెదిరింపులకు భయపడి లొంగిపోతే దానితో తృతీయ పంచవర్ష ప్రణాళిక దెబ్బతినడమేకాదు, దేశంలో ప్రజాస్వామ్యమే అంతరిస్తుంది.

ఈ నాడు ప్రభుత్వోద్యోగులు ఎవరి చెప్పుచేతల్లో ఉన్నారనేది తెల్పుకోడానికి కమ్యూనిస్టు, సోషలిస్టు నాయకులు ప్రభుత్వాన్ని సవాల్ చేశారు. రేపు ఈ ఆసరా చూచుకొని ఇప్పటి ప్రభుత్వాన్నే తొలగించాలని కోరగలరు. కనుక ఇది ప్రభుత్వానికే కాదు ప్రజాస్వామ్యం మనుగడకే అగ్నిపరీక్ష అని చెప్పవలసి వస్తున్నది. ★

# నేపాల్‌లో వింతలు, విశేషాలు

## ఆదిభట్ల దేవబాల

ఇటీవల నేపాలుదేశం రాజకీయంగా చాలా ప్రాముఖ్యములోకి వచ్చింది. పది సంవత్సరాలకు పూర్వం మనదేశం సహాయంతో రాజా త్రిభువన్ స్వేచ్ఛాపరిపాలన చేస్తున్న 'రాణాల' పీడనుంచి విముక్తి పొందినాడు. ఆతరువాత క్రమేణా రాజా మహేంద్ర ప్రజాపరిపాలనను అమలులో పెట్టారు. ఈ పది సంవత్సరాలుగా నేపాలుదేశపు వింతలు చూడడానికి వందలకొలదీ అమెరికనులూ, యూరోపియనులూ వస్తున్నారు. ఈ వచ్చే వారందరూ నేపాలు దేశపు ముఖ్యపట్టణమయిన ఖాట్మండుకు మాత్రమే వచ్చి ఇక్కడి పురాతన కట్టడాలూ, తాంత్రిక సంప్రదాయపు చోద్యాలూ, తనివి తీరా చూసి, విని వెళ్ళుతున్నారు.

రాజా గుణకామదేవుడు ఖాట్మండును స్థాపించాడు. "వంశావళి" అన్న పురాతన గ్రంథం అనుసరించి మంజుశ్రీ చీనాదేశం నుండి వచ్చి, స్వయంభూను దర్శించి తన ఆయుధంతో ఒక కొండనుకొట్టి (సన్నని గోర్జి) చోబహార్‌ను చేసి మంజుపాటన్ నగరాన్ని స్థాపించాడు. కామదేవుని తరువాత దీనినే కాంతిపురమని పిలుస్తూవచ్చారు. కాష్ఠ మంటపం ఉండడంవల్ల ఖాట్మాండు అని పిలువబడుతూ వచ్చింది ఇది.

ఖాట్మాండు, దీనిపరిసర ప్రాంతాలూ చూడవచ్చేవారికి అనువైన కాలాలు రెండు. మొదటిది చలికి ఓర్చుకొనే శక్తికలవారికి మంచి ఉన్ని బట్టలు తెచ్చుకొంటే నవంబరు నుంచి ఫిబ్రవరివరకూ. అప్పుడు అయితే మంచుకొండలు చూడడానికి అవకాశం ఉంటుంది. గణేశ్ హిమాల్, గౌరీశంకర్, మచ్ఛాపుచ్ఛారే, త్రిశూలి, గోసాయీటాంగ్ శిఖరాలు చక్కగా బైనాక్యులర్స్ ద్వారా కనుపిస్తాయి. ఎవరెస్టుశిఖరంమాత్రం పీక్ ఒకచోటునుండితప్ప అంతటా కనుపించదు. రెండవకాలం మనదేశంలో ఎండ తాకిడి ఓర్వలేనివారికి మార్చినుంచి జూలై వరకూ బాగుంటుంది. వీరు మంచుకొండలు తప్ప మిగతా ప్రదేశాలు చూడవచ్చు.

ఇక్కడికి వచ్చేముందు కలరా ఇంజక్షనులూ, ఇన్‌కమ్‌టాక్సు క్లియరన్సు సర్టిఫికేటు, పాస్‌పోర్టూ కావాలి. డబ్బున్నవారు పాట్నా వచ్చి అక్కడినుంచి విమానంలో ఒక్కగంటలో రావచ్చు. వీరు శీతాకాలంలో ఎవరెస్టు శిఖరం చక్కగా చూడవచ్చు. కొంచెం డబ్బులో రాదలుచుకొంటే భూమార్గంమీదుగా రావాలి. ప్రస్తుతం



పాటన్ కృష్ణమందిరం



పశుపతి ఆలయం



దక్షిణకాళి

మంచిరోడ్డు, మంచి బస్సులూ ఉన్నాయి. రక్సౌల్ స్టేషన్‌నుంచి రైలుబండిలో ఆమ్లేక్ గంజ్‌కి దాదాపు ముప్పైమైళ్ళ ప్రయాణం. ఆమ్లేక్‌గంజ్ నుంచి నిత్యం బస్సు సర్వీసు ఉన్నది. ఈ రోడ్డు పేరు త్రిభువన్ రాజపథ్. దీనిని మన భారతీయ సైనిక ఇంజనీర్లు నిర్మించారు. నేపాలులో చూడవలసిన దృశ్యములలో ఇది ఒకటి.

ఖాట్మాండులో చూడవలసిన ప్రదేశాల్లో ముఖ్యమయినది పశుపతి ఆలయం. ఈ ఆలయం గోడలకు వెండిరేకు, శిఖరాలకు బంగారు రేకు తాపించి ఉన్నాయి. ఒక్క పశుపతి ఆలయంలో తప్పించి మిగతా ఎక్కడైనా బలులు విపరీతంగా ఉన్నాయి. పశుపతి విగ్రహం పంచముఖి అయినా మనకు చతుర్ముఖిగా కనుపిస్తుంది. ఐదవది ఊర్ధ్వ ముఖం. మందిరానికి నాలుగు ద్వారాలున్నాయి. నాలుగువైపులా నలుగురు పూజారులున్నారు. శివరాత్రికి భారతదేశం నలువైపులనుంచి యాత్రికులు అసంఖ్యాకంగా వస్తారు. ఉండడానికి సదుపాయాలు ఉన్నాయి. ఇదికాక ప్రతి పౌర్ణమికి పంచామృతం అభిషేకం చేస్తారు. అనంతరం కుంభాభిషేకం చేస్తారు. అన్నంతోనే పశుపతి ఆకారం ఏర్పరచి పూజ ముగియగానే ఆ అన్నాన్ని బీదలకు పంచుతారు. ఇదికాక ప్రతి పౌర్ణమికి కొత్త బట్టలూ, బంగారంతో కళ్లు, ముక్కులూ సమర్పిస్తారు. ఇప్పటి ధరలుబట్టి దాదాపు పదమూడు వేలు ఉంటుందని అంచనా. ఏడాదికి పదమూడు పౌర్ణములు వస్తాయి. అన్నిమారులూ కూడా వొక్కలాగానే చేస్తారు. మనవైపులాగా హారతి ఇవ్వడం శఠగోపం పెట్టడంలాంటి ఆచారాలులేవు. ఆలయం బయట పువ్వులు వెదురు పళ్ళాలలో అమ్ముతారు. అవి పట్టుకొనివెళ్లి పూజారికి ఇస్తే విగ్రహంమీద ఉంచి, అవే పువ్వులు కొంచెం గంధం మనకు ప్రసాదం అని ఇస్తారు. మనకు తోచిన మట్టుకు డబ్బులు విగ్రహంమీద వేసి దండంపెట్టి రావాలి.

పశుపతి ఆలయానికి సమీపంలో గుహేశ్వర ఆలయం ఉన్నది. ఈ మందిరానికి వెళ్ళే దారిలో లోలెకు చిన్న చిన్న మందిరాలున్నాయి. కానీ అక్కడ ఎవ్వరూ ఉండరు. తాళాలువేసి బూజుపట్టి ఉన్నాయి. గుహేశ్వరి ఆలయంలో బలులు విపరీతంగా ఉంటాయి. నైవేద్యం పట్టుకెళ్ళేవారు కోడిగుడ్లు పట్టుకొని వెళతారు. ఇక్కడ చిన్న రంధ్రం మాదిరి ఉంటుంది. దీని లోతు ఎవ్వరికీ తెలియదు. పూర్వంవొక రాజాకొన్ని వందల గుడ్లు వేశాడుటలోతు కనుక్కొనాలని. ఈ రంధ్రంలో కోడిగుడ్లు చితక్కొట్టి పోస్తారు. అందులో నీరు ఉంటుంది. కోడిగుడ్డు రసం, నీరూ కలిసిన మిశ్రమమే మనకు ప్రసాదంగా ఇస్తారు. ఇక్కడ కూడా మనకు తోచినన్ని డబ్బులు విసరడమే. పశుపతి ఆలయం వెనుకభాగం నుంచి గుహేశ్వరీదాకా భాగమతీ నది పారుతున్నది. గుహేశ్వరీ ముఖద్వారం దగ్గర మంచి మర్రిచెట్లున్నాయి. వీటి ఊడలు నీటి ప్రతిబింబములో అతిసుందరంగా కనుపిస్తాయి.

నేపాలు మ్యూజియం: ఇక్కడ పూర్వం



బూఢా నీలకంఠ్

## సభా పర్వము - 2

ఇంత గలవాడు కేశియు నితడు వోయి
వానిచే గూలు తరువాతివాడ నేను
ఇంప మరగినవాడేల సైమ నన్ను
నుఱక నెవ్వైన వచ్చి పై బడునుగాక,

బొమలు ముడివడగ బిడికిలి
యమరిచి కోపంబుతోడ నవుడు గఱచుచున్
జమురాడ్పున హరి కడు ను
గ్రముగా పైబడుట నా మొగంబున వ్రేలన్.

— హరివంశము,

ఆ రాత్రి. రాత్రే నిద్రపోతున్నట్లు నిశ్శబ్దంగా, మూగగావుంది. సుప్తసర్వప్రాణిజాతంగా వుంది. నిశ్శబ్ద సకలదిక్తటంగా వుంది. ఆ రాత్రివేళ కంసుడు సకల భోజాంధక వృష్ణికులజులైన యాదవ ప్రవరులకు కబురు పెట్టాడు. వారికి ఆశ్చర్యమైపోయింది. ఈ రాత్రివేళ రాచకార్యం ఏమిటా అని వారు విస్తుపోయినారు. అది కంసుని ఆజ్ఞ. మధురేశ్వరుని యాజ్ఞ. కాదనడం ఎట్లా! అంతా కంసుని పనుపును అనుసరించి రాజమందిరాలకు పయనమై వచ్చారు. కంసుడు అభ్యంతర సభామండపంలో ఒక్కడు ఆసీనుడై వున్నాడు. ఆ రాత్రినిబోలి నిద్రపోతున్నట్లు, సుప్తసర్వేంద్రియుడైనట్లు, నిశ్శబ్ద సకల సంజ్ఞుడైనట్లు కూర్చున్నాడు. ఆ కాలంలో ఈ సభను గూర్చిన విషయమే వారికి ఆశ్చర్యము కాగా, కంసుకి ఆ కూర్చున్న వైఖరి మరీ ఆశ్చర్యాన్ని కల్గించింది. అంధకుడు యదువులందరిలో వృద్ధుడు, అతడు బభ్రువంశీయుడు, దానపతి, అయిన అక్రూరునితో కలిసి సభకు వచ్చాడు. అప్పటికే తక్కిన యాదవ ప్రవరులువచ్చి వారి వారి స్థానాలలో ఆసీనులై వున్నారు. అంధకుడు అందరిని చూచి నవ్వుతూ తన ఆసనంలో కూర్చున్నాడు. ఆ నవ్వు విన్నాడో కంసుడు! ఆ నవ్వులో వున్న అవహేళనను విన్నాడో కంసుడు! నిద్రమేల్కొన్నట్లు లేచాడు. అప్పుడు అతని చూపులు ముందు వసుదేవునిమీదకు పోయినాయి. ఆతర్వాత అంధకునిమీద ప్రసరించాయి. అంధకుడు ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ గల్లున నవ్వాడు. ఆ నవ్వు తరంగాలు తరంగాలుగా సభ అంతటా వ్యాపించింది. కంసుని కన్నులు ఎఱ్ఱనైనాయి. ఆ కన్నులతో అతడు అక్రూరుణ్ణి చూచాడు. అతణ్ణి చూడగా, కంసునికోపం శాంతించింది. ఆ కన్నులలో ఏదో ఆలోచన తోచింది. తోచినంతలో కంసుడు చిరునవ్వులుగా కన్నులలో నవ్వులుగా సభ అంతా కలయ తిలకించాడు. సభలో తన జ్ఞాతులంతా వున్నారు. బాంధవులంతా వున్నారు. ఆ అందరిని తాను పరికించాడు. తండ్రి ఉగ్రసేనుడు, బావగారు వసుదేవుడు వున్నారు. వసుదేవుణ్ణి చూడగా, ఆయన దేవతలనుబోలి తనకు కన్పిస్తున్నాడు. కన్పించినంతలో కంసుని ఎడదలోని రాక్షసత్వం కన్నులలో కొట్టవచ్చింది. ఆ కన్నులను చూచి సభలో అంతా చలించారు. చంచలించనివారు ముగ్గురు: ఒక్కడు వసుదేవుడు, రెండవవాడు అక్రూరుడు మూడవవాడు అంధకుడు. అంధకుడు ఆ కన్నులనుచూచి తిరిగి గల్లున నవ్వాడు. కంసుడు తన కన్నులను అతనిమీదనుండి త్రిప్పి, ప్రక్కకు మళ్ళించుకున్నాడు. అప్పుడు అతనికి సత్యకుడు కన్పించాడు. ఆ ప్రక్కన దారుకుడు. ఆ ప్రక్కన కంకుడు. ఆ ప్రక్కన అతని తమ్ములు. వీరు కంసునికి సోదరులు. వారి ప్రక్కన భోజుడు. అతని ప్రక్కను వికద్రువు. వికద్రువు ప్రక్క భయశంఖుడు. అతని పజ్జ విపృథుడు. అక్రూరుడు వీరి మధ్య కూర్చున్నాడు. అతని ప్రక్క కృతవర్మ. అతని ప్రక్కను అక్షోభ్యుడు, భూరితేజసుడు అయిన భూరిశ్రవసుడు. వీరు కాక ఇంకా బహుమంది యాదవ ప్రముఖులు సభలో ఆసీనులై వున్నారు. ఆ అందరిని చూడగా, కంసునికి ఒక ధైర్యంవచ్చినట్లు వుంది. అతని ముఖంలో మహారాజ కళ తళుక్కొత్తింది.

కంసుడు ఆ అందరిని పేరు పేరు వరుసగాను సంబోధించాడు. సంబోధించి ఇట్లా అన్నాడు. "మీరు సర్వకార్యజ్ఞులు, సర్వవేదాలలోను పారగులు. న్యాయవృత్తాంత కుశలులు. త్రివర్గ ప్రవర్తకులు. లోకవిక్రాంతి వివేకనిష్ఠులు. సమరోత్సాహులు. అవిరతోద్యోగధన్యులు. అభిగుప్తమంత్రులు. అర్థములయందు పరాఙ్ముఖులు. ఆర్యభావానుగతులు. దర్పితారాతిమర్దన శౌండులు. ఆర్తజనత్రాణ తత్పరులు. నయసమగ్రులు. మీరు అందరు అగ్నితో, చంద్రునితో, వాయువుతో, రుద్రునితో పోల్చదగిన గుణములు కలవాళ్ళు, దొరలు. మగటిమిలో దేవతలే మీ ముందు నిల్వలేరు అంటే, ఇంకా ఒకరిని చెప్పడం దేనికి? మీ కీర్తికాంతులు సర్వలోకాలను వెలిగిస్తున్నవి. సర్వరాజన్యలోకము మీ ప్రతాపాన్ని రుచిచూచి భయపడుతున్నది. మీరు అకుంఠ చరిత్రులు. మీ చరిత్రలు నాలుగు దిక్కులలోను కథలుగా గానం చేయబడుతున్నవి. పర్వతాలు సర్వ పృథ్వీమండలాన్ని ధరిస్తున్నవిధంగా, మీచరిత్రవలన సర్వమైన యదుకులమున్నూ భద్రంగా భరింపబడుతున్నది. ఇట్టి మీరు నాకు ఎల్లప్పుడు హితవునే తలస్తూ, నా చిత్తానువర్తులగై, మధురా రాజ్యం విధురత్వం పాలుకాకుండా రక్షించుకుంటూ వస్తున్నవాళ్లు. ఇప్పుడు, ఈ రాజ్యానికి, ఈ రాజ్యానికి అధీశ్వరుణ్ణైన నాకు ఒక్క అనర్థం వాటిల్లగా, ఉపేక్షించి చూస్తూఊరుకుంటున్నారు. మీ మతం ఏమిటో నాకు అర్థంకాకుండా వుంది."

ఇంతవరకు మాట్లాడి కంసుడు ఒక్కసారి ఆ అందరిని కలయ తిలకించాడు. సభలో ఒక్కరూ అతని వంక చూడటంలేదు. తాను చెబుతున్న మాటలు వారు వింటున్నారో! లేదో! కంసునికి అనుమానమైపోయింది. అయినా కంసుడు వారిని వదిలిపెట్టలేదు. తిరిగి ఇట్లా అన్నాడు: "ఇప్పుడు ఈ అనర్థం ఎక్కడనుండి వస్తున్నదో



చెబుతాను. నందగోపుడన్న ఆభీరుడు మన వ్రజాలలో వున్నాడు. తెలుసుగదా! అతనికి పుత్రుడుగా కృష్ణుడనే బాలకుడు పెరుగుతున్నాడు. వాడు నాకు అపకారం చేయడానికి పుట్టినాడు గాని మరో అందుకు పుట్టినట్లు కన్పించడంలేదు. ఆ దురాత్ముడు ఉపేక్షితమైన రోగాన్ని పోలి, అనుకూలవాత ప్రేరితమైన మేఘాల్ని పోలి, అంకురితమైన విషవృక్షాన్ని పోలి, వర్ధిల్లుతున్నాడు. వీడు ఎవడా అని నేను అతి నిపుణంగా విచారించాను. కాని వాని పుట్టువు, పొడవు నాకు అందలేదు. ఉన్న రూపు ఏమిటో కూడా నిశ్చయింప రాకుండా వుంది. వాడు చేసేపనులు బాలకులు చేసే పనులులాగాలేవు. కరము ఆశ్చర్యాన్ని కూర్చేవిగా వున్నాయి. అతిమానుషంగాను, అతిదైవతంగా వున్నాయి. వీటినిబట్టిచూడగా వీడు కారణంచేత పుట్టిన ఏ దేవతాపత్యమో కావలయునన్న శంక పొడముతున్నది".

అప్పటికి సభలో ఒక ఔత్సుక్యం, ఒక సంచలనం కల్గింది. ఒక్క వసుదేవుడు వినా తక్కిన యాదవ ప్రముఖులు అందరు అతని వంక కన్నులుగా సావధానులైనారు. భయం అంటూ ఎరుగని మధురేశ్వరునిలో భయం ప్రవేశించడం వారు ఇప్పుడు ప్రత్యక్షంగా తిలకించారు, వారిలో తోస్తున్న ఈ భావపరిణామాన్ని గమనిస్తూ మళ్ళీ కంసుడు ఇట్లా అన్నాడు. "ఈ శంక నాకు ఎందుకు కల్గిందో ఇప్పుడు చెబుతాను. పూతనను మీరంతా ఎరుగుదురు, అది నన్ను పెంచినదాది. ఈ కృష్ణుడనేవాడు మువ్వంటల దినములయుండే చన్నుపాలతో దాని ప్రాణాలను గ్రోలివేశాడు. ఇది ఒక్కటి. రెండు; ఇంకా సరిగ్గా బోరగిలి ఆడుకునే ఈడురాకముందే శకటుణ్ణి నును లేతపాదంయొక్క తాడనంచేత తుత్తుమురుచేశాడు. మూడు; తప్పటడుగులు పెట్టే ఈడువచ్చిందో లేదో, ఈ దుండగీడు జమిలి మద్దులు పెల్లగిల్లగా రోటితో ఈడ్చివేశాడు. అయిందా. నాల్గు; ఇంచుకించుకయొడయొతిగడి కొలదిన కాళియనాగంయొక్క గండు చెండుచేశాడు. ఐదు, ఆరు; ప్రలంబధేనుకులను బలభద్రుడనే వైరి రుద్రుణ్ణి ప్రయోగించి ఉగ్రరేఖగా చంపించాడు. ఎనిమిది; ఈ మధ్యనే అధికుణ్ణి, అరిష్టుణ్ణి సంహారించాడు. ఇక మిగిలిన వాడు కేశి. వాణ్ణిగూడా ఎప్పుడో చంపివేస్తాడు. ఆ తర్వాత మిగిలిన వాణ్ణి నేను. నన్నుగూడా ఎప్పుడో చంపివేస్తాడు."

సభలో అంతా దిగ్భ్రాంతి చెందారు. కంసుడు ఆ మాటలు కోపంతో ద్వేషంతో అంటున్నట్లు లేవు. విషయం తెలిసి అంటున్నట్లు వున్నాయి. వస్తునిష్ఠమైన ఆలోచనకలిగి చెబుతున్నట్లు వున్నాయి. ఆ మాటలు వినగా సభ నిస్తబ్ధమై పోయింది. కంసుడు విచిత్రమైన హాసం చేస్తూ, మళ్లీ ఇట్లా అన్నాడు. "ఇప్పుడు నేను చెప్పిన పనులు ప్రౌఢు లయిన వాళ్లే చేయడం కష్టం. కాని బాలుడైన ఈ కృష్ణుడనేవాడు చేశాడు. అంతేనా! వ్రజంమీద అలిగి ఇంద్రుడు ఏడు దినములుగా, ఏడు రాత్రులుగా బృందావనంమీద వర్షాన్ని కురిపాడు. పశువులకు కీడుగా వర్షాలు కురిపాడు. అప్పుడు ఈ కృష్ణుడనేవాడు, ఆ పశువులను కాచేదీక్షతో గోవర్ధనపర్వతాన్ని అవలీలగా కొనగోటితో ఎత్తినట్లు ఎత్తి గొడుగుపాల్కి ఆ ఏడుపగళ్లు, ఆ ఏడు రాత్రులు పట్టుకున్నాడు. ఇవన్నీ అద్భుతకర్మలు. స్పృహణీయంగా

వున్నాయి. అయితే అశుభమైన ఈ గోపత్వం ఎక్కడ? లోకాద్భుతకారి పౌరుషం ఇది ఎక్కడ? మృత్యుదుర్బలమైన ఈ మానుష్యం ఎక్కడ? అతి దైవతమైన ఈ అద్భుత విడంబనం ఎక్కడ? అబాలుడొకడు, బాల్యాన్ని ఆశ్రయించి, చేస్తున్న ఈ అద్భుతకర్మలను గురించి ఏమనాలి? వీడు ఎవడో దేవుడు. దైవీప్రభావంతో నా యొక్క మందల్లో నాకు అపకారం తలపెట్టిసంచరిస్తున్నాడు? అతీంద్రియమైన అద్భుతవపువును నీచమైన గోప వేషంతో మరుగుపెట్టి, వీడు ఎవడో దేవుడు, శ్మశానంలో అగ్నివిపోలి నా సుస్థితికి, నా రాజ్యంయొక్క భద్రతకు నిప్పును ముట్టిస్తున్నాడు! ఇది అంతా వాడికి ఆటగావుంది. వీడు ఎవ్వడు? ఎందుకు పుట్టాడు? ఎక్కడ పుట్టాడు? ఎవరికి పుట్టాడు?"

ఈ ప్రశ్నలు వేస్తూ, కంసుడు వసుదేవునివంక తీక్ష్ణదృక్కై చూచాడు. వసుదేవుడు తొణకలేదు. బెణకలేదు. నివాత స్తిమితమైన దీపాల్ని పోని, ఆ సభలో వసుదేవుడు స్థితప్రజ్ఞుడై స్థిరవహించి ఉన్నాడు. కంసునికి తనమాపు వ్యర్థం అయినదని తెలిసినంతలో క్రోధం సంబాధం అయిపోయింది. ఆ కోపంతో అతడు సభను తిలకించాడు. తిలకిస్తూ అంధకునిదిక్కై చూపును నిలిపాడు. అంధకుడు గలగలా నవ్వాడు. సభ అంతా అతనివంక చూచింది. ఆచూపులతో తనచూపులను కలుపుతూ, కన్నులు నిప్పులుగా, కంసుడు ఇట్లా అన్నాడు: ముసలివాడివి. ఎందుకు నవ్వుతావు? నేను చస్తే సంతోషిద్దామనివుంది నీకు. అంధకవృద్ధా! ఒక్కమాట చెబుతున్నాను విను. ప్రపంచంలో ఎవ్వరూ శాశ్వతులుకారు. మృత్యువు అన్నది అందరికీ భూతపూర్వము; పూర్వదైహికము. అందుకు నేను విచారించడంలేదు. ఇప్పుడు నా కళ్ళముందు, యుద్ధకాంక్షియైన కృష్ణుడు మృత్యువునుపోలి కన్పిస్తున్నాడు యముణ్ణిపోలి ఉగ్రంగా ఆ కృష్ణుడు నాపై పడటం నా ముఖాన వ్రేలాడుతున్నది. అది అట్లా ఉంచు. ఇప్పుడు మరో విషయం చెప్పదల్చుకున్నాను. తర్వాత ఈ కృష్ణునివిషయం చెబుతాను.

"మీరు వినేవుంటారు. పూర్వం విష్ణువు అనేవాడు చేసిన పనులు. వాడు ఒకప్పుడు వామనుడై ఈ సర్వభూమండలాన్ని ఏక పాదంతో ఆక్రమించుకున్నాడు. నృసింహరూపం ధరించి హిరణ్యకశిపుణ్ణి వధించాడు. అచింత్యమైన రూపాన్ని పొంది, శ్వేతశైల శిఖరంమీద నివసిస్తూ, శివుడై, రాక్షసులకు అక్షయశక్తిని తెచ్చిపెట్టాడు. త్రిపురాలను దహించాడు. కచునికథ తెలిసిందే. అతణ్ణి శుక్రునివద్దకుపంపి, మృతసంజీవినీవిద్యను, ఆ శుక్రునివద్దనుంచి దొంగిలించి, దేవతకు మేలు చేకూర్చాడు. ఈ విష్ణువు అనంతుడు. శాశ్వతుడు. అవ్యయుడు. సహస్రశిరస్కుడైనదేవుడు. వాడు వరాహవపువై మహార్ణవంలోఒరిగినిమగ్నమైపోయినధరిత్రినిఉద్ధతకొమ్మునను రక్షించాడు. ఆ విష్ణువుకు ఈరూపం ధరించవచ్చు, ఈరూపం ధరించరాదు అని లేదు. క్షీరసముద్ర మథనం జరిగినప్పుడు ఈ విష్ణువు మోహినియై సురలకు ఉపకారాన్ని, అసురులకు అపకారాన్ని పొనర్చాడు. కూర్మమై మందరాన్ని ధరించాడు. మత్స్యమై వేదాలను రక్షించాడు. పరశురాముడై ఇరువది ఒక్కమారు భూమిని నిఃక్షత్రియం చేసి, సర్వ ధరిత్రిని కశ్యపునకు యజ్ఞ దక్షిణగా ప్రతిపాదించాడు. దశరథుని గృహంలో నాల్గయిన రూపాలుగా ప్రభవిల్లి, పౌలస్త్యుడయిన రావణుణ్ని హతమార్చాడు. దేవతలకోసం ఈ విష్ణువు ఏ పని చేయమంటే అది చేస్తాడు. ఇప్పుడు వాడు, ఆ విష్ణువు, తిరిగి దేవతలను సంతర్పితులను చేయడంకోసం ఇట్లా మాయామానుష వపువై కృష్ణుడుగా ఉద్భవించాడా అనిపిస్తున్నది."

అని కంసుడు వసుదేవుని దిక్కై "ఏమి! వసుదేవా! ఏమి అంటావు?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నను విని సభలో అంతా అప్రతిభులయి పోయారు. వసుదేవుడు ఒక్కడే ఏమీ కాలేదు. ఆయన కంసునికి ప్రత్యుత్తరమే చెప్పలేదు. స్తిమితము లయిన తన నేత్రాలను కంసునిపై పరపి, అతనికన్నులలో కన్నులుగా చూచాడు. "నీవు చెప్పవు. నేనే చెప్పివేస్తాను. వసుదేవా! ఈ కృష్ణుడు నీ పుత్రుడు. వీడు దేవకి అష్టమగర్భం. కాదంటావా? వసుదేవా? వీడు నాపాలిట మృత్యువు. కాదంటావా? నాకు తెలుసు. నారదుడు

# ఇప్పుడు!
## పియర్స్ టాల్కమ్
కుటుంబముకోసం
పెద్దసైజులోకూడా దొరుకుచున్నది!







పియర్స్ టాల్కమ్ — అంటే అన్ని భాగాల్లో సొగసైన వనితలకు శ్రేష్ఠమైన పౌడర్ — ఇప్పుడు మీకు కుటుంబముకోసం పొదుపైన పెద్ద సైజులో కూడా లభించు చున్నది!

ఈ వెన్నెల వంటి మెత్తని పౌడర్ చాలా దివ్యమైన పరిమళం గలది ... మిమ్ములను రోజల్లా హాయిగాను సొగసుగాను వుంచుతుంది!

మీ సౌందర్యమును భాగ్యాద్రంగా వుంచునట్టి పియర్స్ సబ్బు, అసలైన గ్లిసరీన్‌గల సౌందర్యము నిచ్చే సబ్బును తయారుచేసిన వారిచేత ఇది మీకోసం తయారు చేయబడినది!

**పియర్స్** సొగసైన వనితా సాంప్రదాయమైనది!

PTP.2-X52 TL లండన్‌లోని ఎ. అండ్ ఎఫ్. పియర్స్ లి., తరఫున హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి కార్ఖానాలో తయారు చేయబడినది.

నాకు చెప్పాడు. కంసుడా! దేవకి అష్టమగర్భం నీకు మృత్యువు. నీవు జాగ్రత్తపడు — అని హెచ్చరించాడు. వసుదేవా! నువ్వు నా కన్ను కప్పావు! నన్ను కించపరించి వేశావు! నన్ను అవమానితుణ్ణి, శూన్యుణ్ణి, చారచక్షు వివర్జితుణ్ణి చేసివేశావు. వసుదేవా! నీవు ఏమి చేసి ఏమి చేయలేదు? దేవకి మగబిడ్డను కనగా, ఆ బిడ్డను తీసుకొని పోయి యశోద ప్రక్కలో దాచి, దాని ఆడకూతురును తెచ్చి నాకు చూపించావు. ఆ ఆడకూతురు ఏమి ఆడకూతురు! అది నీ నా కళ్ళ ముందు దేవదేవియై, వింధ్యవాసినియై పోయింది. దేవతలచేత పూజలు పొందుతోంది. ఇక వాసుదేవుడైన కృష్ణుడు మందలలో బాలుడై, బలభద్రునితో కూడా పెరుగుతున్నాడు. వీళ్లను నువ్వు మద్వధార్థం కన్నావు. వసుదేవా! నిన్ను ఏమనాలి? మిత్రవ్యపదేశం చేత పెంపు వహించిన శత్రుడవు నువ్వు! నిన్ను చూస్తూవుంటే కాకికథ జ్ఞాపకం వస్తున్నది. ఒక కాకి ఒకడి తలమీద వాలిందట; సరే! వాలిందిగదా అని వూరుకుంటే, అది మాంసగృధ్నియై, ముక్కుతోను, గోళ్ళతోను కన్నులను పొడవడం మొదలుపెట్టిందట; అట్లాగే నువ్వు నా నెత్తిమీద చుట్టానివై, సపుత్ర జ్ఞాతి బాధవంగా నా వంశాన్ని నాశనము చెయ్యడానికి తలపెట్టావు" అంటూ సభ దిక్కు ముఖమై, "అయ్యా! సభలో మీరందరున్నారు. ఇది తేల్చండి. నేను ఈ వసుదేవునికి ఏమి కీడుచేశాను. ఈగి, మన్నన పొదలగ, ఈయనను మర్యాదచేశాను, మంచివాడుగదా అని మా చెల్లెల్ని ఇచ్చికూడా పెండ్లిచేశాను. అందుకు ఈయన నాకు చేసిన ప్రత్యుపకారం ఏమిటో చూస్తున్నారు గదా! నా దెస ఈయన అంతకతుల్య విచారుడై నాడు. అకల్మషుడనైన నాయందు కల్మషాన్ని పెంచుకొని పైకి బంధువు, లోపల శత్రువు అయిపోయినాడు. ఇంతకంటే పాపం ఏమన్నా ఉన్నదేమో మీరు విచారించండి! భ్రూణ హత్య మొదలైన పాతకములకు అవధిఅంటూ వున్నది గాని, కృతఘ్నుని కలుషమునకు నిష్కృతి అంటూ ఎక్కడాలేదు. ఆ కృతఘ్నుడైన నరునికి తీవ్రమైన నరకపీడనం సంప్రాప్త మౌతుందని ధర్మవిదులు అననే అన్నారు." అంటూ ముఖం కండలు చించుకుంటున్నట్లు, ఉగ్ర ప్రలాపాలు పోయినాడు.

సభలో అంతా ఆశ్చర్యపోయినారు. అద్భుతం పడ్డారు. భయపడ్డారు. వసుదేవునిగురించి కంసుడు చేస్తున్న నిందను విని మనస్సులో కించగూడా పడ్డారు. కంసుడు వారి ఆలోచనలను అట్టే దూరం సాగనీయలేదు. తిరిగి వసుదేవుని దిక్కు ముఖమై, తిరిగి ఆయన్ను ఉపాలంభించడం మొదలు పెట్టాడు: "కులానికి ఇంతపీడ అంటూ కల్గకుండా రక్షించుకొంటూ వస్తున్నానే! అట్టి నాయందు నీవు ఇట్టి పాపాన్ని ఆచరించి తులువవు అయినావు. ద్రోహి వైనావు. అసలు నీకు ఈ ముసలితనం అన్నది ఎట్లా వచ్చింది? నువ్వు ఎట్లా ముదిసినావు? ఏమిగా పెద్ద వైనావు? నీవున్న ఊళ్లోగూడా జ్ఞానంఅన్నది లేకుండా పారిపోతున్నది. నీవు, వసుదేవా! మిథ్యాశీలుడివి. మృషాశ్రయుడివి. అనర్థ సంయముడివి. నీ ఆలోచన ఏమిటో నాకు తెలియదనుకున్నావా? నీ కొడుకుచేత నన్ను చంపించి, ఆ కొడుకుచేత మధురను యేలిద్దామని చూస్తున్నావు! ఓరి బాల్యుడా! నీ ఆలోచన ఎంత ఆలోచనరా! ఎదిటిబలాన్ని, ప్రాభవాన్ని ఎరుగక చేశావు అంటానా! నా బలం, నా ప్రాభవం నీకు తెలియనివి కావే! నా ముందు ఇంద్రుడు నిల్వలేడు గద! పరమశివుడు ఆగలేడు గద! రణోత్సేకంలో నాకు సాటికాగలవాడు ఈ ఏడు లోకాలలోను లేడు గద! అది తెలిసిగూడా నువ్వు ఈ బాలుణ్ణితెచ్చి నాకు ఎదురు నిల్పుతున్నావంటే నిన్ను ఏమనాలి? ఏ శ్రీకి ఆశించి నువ్వు ఇట్లా చేస్తున్నావు? ఇట్లాచేసి నువ్వు ఏమి శ్రీకి పాత్రమవై వెలగుతావు? ఏనుగులు పోరాటం ఆడుతూవున్నా అడవికే నష్టం. పోరాటం మాని చరిస్తున్నా అడవికే నష్టం; ఇప్పుడు ఈ కృష్ణునికి, నాకు, పోరాటం అంటూ సాగితే, మాకు ఇద్దరికే కాదు నష్టం; సకల యాదవులకు నష్టం వాటిల్లుతుంది. ఇంత మాత్రం తెలుసుకోలేని మూఢుడవు నువ్వు. చక్రవర్తి వంశంలో పుట్టి, బాల్యం ఆదిగా మాతండ్రి పెంచగా పెరిగి, పిదప ఇప్పుడు ఈ వయస్సులో ఈనీచ రక్షకు ఒడిగట్టావు? వృథావృద్ధుడా! పరిణతిలేని వృద్ధాప్యంగూడా ఒక వృద్ధాప్యమేనా! అది పలితకేశమాత్రమైన వృద్ధాప్యం. ఆమాత్రపు వృద్ధత్వంతో నీవు యాదవులకు గురుస్థానమువు గూడా అయినావు. అది ఈ యాదవుల దౌర్భాగ్యం! నీవు ఎట్టివాడవైతే నాకేమి? నేను నిన్ను వధియింపను. ఇంతకుముందు ఎప్పుడు బంధు వృద్ధద్విజ వధములు చేయలేదు. ఇక ముందు చేయగలవాడనుకాను. నీవు చేసిన దుర్నయంవల్ల మేలు వచ్చినా, కీడు కల్గినా, అది దైవకృతం అనుకుంటాను. అంతే. కాని నీ దుర్మార్గం మాత్రం యదుకులం అంతకీ తలవంపులు తెచ్చింది. ఇప్పుడు నీవు నాకు, కృష్ణునకు పెట్టిన రాయిడివలన, మా యిద్దరిలో ఎవరో ఒకరు హరించకుండా, శాంతి అంటూ ఏర్పడదు. ఇది అంతా నువ్వు తెచ్చి పెట్టావు. అందుకు నిన్ను రాజ్యంలోంచి వెడలనంపవలసిన పని. అట్లా చేశానా, నేను తుచ్ఛుణ్ణి అవుతాను. నీ చుట్టరికం నీ దగ్గరే వుంచుకో. సభలో వుంటే వుండు, లేకపోతేపో, పలుపలుకులతో పనిలేదు."











# అపోహ

**ఎం. వి. నారాయణాచార్య**

ట్రెయిన్ వచ్చి ప్లాట్ ఫారం మీద ఆగి— 'తన బాధ్యత తీరిపోయిందంటూ' 'ఉస్సు'రని నిట్టూర్చి "దిగేవాళ్లు దిగండోయ్!" అని గావుకేక పెట్టింది.

ప్రసాదరావు ఒక్కసారి ఉలికిపడ్డాడు. కిటికీలోంచి తొంగిచూశాడు.

"అరె! తను దిగవలసిన స్టేషను వచ్చేసింది!" తోలుసంచీ పట్టుకుని పాదాలు యథాలాపంగా బూట్లలో కూరేసి, ఒక్క గెంతులో ప్లాట్ ఫారంమీద పడ్డాడు.

అతనికళ్లెవరినో అన్వేషిస్తున్నాయి. ఎవరినో చూడాలనే ఆతృతతో తొందర తొందరగా అటూ ఇటూ చూస్తూ తిరుగుతున్నాడు.

'శాంత' గాని-కనీసం మోహన్ గాని వచ్చి తన్ను రిసీవ్ చేసుకుంటారని ఎంతగానో ఆశించాడు.

"మనుషుల కెంత నిర్లక్ష్యం?..."

ప్రసాదరావు ఆశాభంగం పొందాడు తనవాళ్లని గురించి తను తప్పుగా అంచనా వేసుకున్నాడు. ప్రసాదరావుకు తల కొట్టేసినట్లయింది. ఎన్నాళ్లగానో స్వదేశాన్ని, స్వజనాన్ని చూడాలని తెగ ఆతృతగా వుంటే, కనీసం స్టేషన్‌కి వచ్చికూడా రిసీవ్ చేసుకునే దిక్కు లేకపోయింది.

ప్రసాదరావు జేబులో చెయ్యిపెట్టి సిగరెట్ పెట్టె తీశాడు. ఏదో బరువుగా క్రింద పడింది. 'ఫలానా ట్రెయిన్‌లో నేను వస్తున్నాను. స్టేషన్‌కి వచ్చి కలుసుకోమని...' తను శాంతకు రాసిన ఉత్తరం అది.

'ఏం పరాకురా! ప్రసాదం భాయీ!' అనుకున్నాడు. మరి మొన్న మద్రాసులో ఓడ దిగగానే తను స్వయంగా పోస్టు చేసిన ఉత్తరం మాటేమిటి?

వెయిటింగ్ రూంలో టేబిల్ మీద లెదర్ కేసు విప్పి సవరించి చూశాడు.

'హే భగవాన్!' అక్కడ తను తీసిన ఫోటోల తాలూకు నెగెటివ్‌లూ, ప్రింట్లూ కాలీ కవర్‌లో పెట్టాడు. అవి ఇప్పుడు కనిపించడం లేదు. ఈ పరాకుమాత్రం తను విదేశాలు వెళ్లినా, డాక్టరేటు సంపాదించినా తనకు ప్రాణస్నేహితుల్లా వెంటాడుతూనే వుంది.

ప్రసాదరావు వాచీ చూసుకున్నాడు.

రాత్రి తొమ్మిదిన్నర అయింది.

టౌనంతా పట్టపగల్లా వుంది. ఎంతగానో మారిపోయింది. ప్రసాదరావుకు తన మాతృభూమిని, అందులో తన స్వగ్రామాన్ని, అందులోనూ...ఎంతో నాగరికత పొందిన దాన్ని చూస్తూంటే బ్రహ్మానందంగా వుంది. ఈ సమయంలో బయలుదేరి తన స్నేహితులు ఎవరెవరు ఎక్కడెక్కడ వున్నారో వాళ్లందర్నీ లేపేసి—పలకరించి ఎన్నెన్నో విషయాలు మాట్లాడేసుకోవాలన్నంత ఉబలాటంగా వుంది.

స్టేషన్ బయట ఉన్నతంగా నిలబడి రంగుదీపాల వెలుగుల్లో తన్ని నవ్వుతో, పలకరిస్తున్న 'రెస్టారెంటూ' దానికి ఓ పక్కగా 'మెడికల్ హాలూ' ఓ విగాగు ఫ్యాన్సీ దుకాణాలు; స్వీట్ల దుకాణాలు, సైకిల్ రిక్షా జట్కాల కోలాహలము; పందెపు గుర్రాల్లా దూసుకుపోతూన్న టాక్సీల హారన్ మోతలు ప్రసాదరావును ఓ పావుగంటసేపు 'ఏం

చెయ్యాలి?' అనే ఆలోచననించి మరిపించాయి.

అతనిపాదాలతనికి తెలియకుండానే అతన్ని రెస్టారెంటులోని ఒక టేబుల్ దగ్గర నిలబెట్టాయి.

'ఒహో; నేనిప్పుడు కాఫీ త్రాగబోతున్నాను కదూ!' అనుకుని తనలో తను నవ్వుకుంటూ ఆపని కుపక్రమించాడు.

రెండు గుక్కలు కాఫీ త్రాగి తర్వాత సిగరెట్ ఘాటుగా పీల్చాడు.

'రాత్రి హోటల్ గదిలో పడుకుని ఉదయాన్నే యింటికెడితే?' అనుకున్నాడు.

దానితో ప్రసాదరావుకు బ్రహ్మాండమైన ఊహ వచ్చింది.

'తెల్లవారేసరికి ఇంట్లో తను తన పక్కమీద దుప్పటీ ముసుగులో ఉంటే, ఎలావుంటుంది!...శాంత ఆశ్చర్యంతో ఎంత ఉక్కిరిబిక్కిరయి తికమకపోతుందీ? ఇలా తను వస్తాడని కల్లో కూడా అనుకోని శాంత......

'అవును శాంత...శాంత'...ఆలోచనలకు 'బ్రేక్' పడింది. మళ్ళీ మరో గుక్కెడు కాఫీ తాగి సిగరెట్ పీల్చాడు.

శాంతంటే ప్రసాదరావు సర్వస్వమూను. అంతకంటే శాంతే ప్రసాదరావు - ప్రసాదే శాంత. లేకపోతే ప్రసాదరావులో మొదటి అక్షరం పక్కని శాంతని చేర్చినా సార్థక నామంక్రింద చాలా బాగా వుంటుందని ప్రసాదరావు అభిప్రాయం.

ప్రసాద్ శాంతని ప్రేమించి పెళ్ళాడాడా?...కాలేజీలో సైన్సు రికార్డుల మార్పిడితో—(తద్వారా లేఖలబట్వాడా చేసి-) ప్రారంభమైన ప్రేమా?

లేకపోతే పక్కింటివాటాలో శాంతను ప్రసాద్ ప్రేమించి, నాన్నను; 'నా' అన్న ప్రతీవాణ్ణీ-సంఘంతోసహా ఎదిరించి ఘాటుగా సంఘాన్ని తిట్టి, లేకపోతే స్టయిలిష్‌గా ఏడ్చి పెళ్ళాడాడా? లేకపోతే కమ్మటి కాఫీ త్రాక్క ఏమిటీ దూలాలికేవి చూసి ఈ ఆలోచనలు?...

వాస్తవానికి పెళ్ళయి మూడుముళ్ళూ పడినదాకా ప్రసాద్ శాంతముఖంకూడా ఎరుగడు.

కాని...శాంతదీ తనదీ ఏదో జన్మాంతర సంబంధమని; తను శాంత వాడు కావడమే తనకు మిగతా ప్రపంచంకంటే ఉన్న ప్రత్యేకత; లేక ఆధిక్యత అని విశ్వసిస్తాడు.

చిన్ననాడే తల్లికి దూరమై అనురాగాన్ని వాత్సల్యాన్ని ఎరుగని ప్రసాదరావు పసిపిల్లవాడిలా శాంతఒళ్ళో ఆడుకుంటాడు. తండ్రికూడా దూరమవడంతో ప్రసాద్ మరీ శాంతమీద ఆధారపడి జీవించడం మొదలెట్టాడు. శాంత తన జీవితాన్ని చూసి ఆనందిస్తుంది. అర్థంలేని ఆవేశాన్ని సహిస్తుంది.

భార్యగా, స్నేహితురాలుగా, అధికారిగా అన్నిరకాల అనుభూతుల్నీ తన కందిస్తూ తనింతవాడు కావడానికి తోడ్పడింది.

శాంతను వదలి ఉండలేక 'నేను ఫారిన్ పోనన్నాడు'—ప్రసాద్.

'నాలుగేళ్ళనగా ఎంతసేపండి-నేను మా 'మోహన్'ని సాయం తెచ్చుకుంటాను—అవకాశం పాడుచేసుకోకండి' అని బలవంతంగా ఒప్పించింది.

ఎలావుందో శాంత? ఇప్పుడేం చేస్తూంటుంది? చెప్పిందిగా "మీరు వచ్చేంతవరకూ మీ ఫోటోముందే కూర్చుని తపస్సు చేస్తూఉంటాన"ని ఈ నాలుగేళ్ళలో వేళ్ళమీద లెక్కపెట్టగలిగినన్ని సార్లు మాత్రం ప్రసాద్ శాంతగురించి ఆలోచించి ఉంటాడు.

'ఆ' వాతావరణమే అంత! యాంత్రికంగా మరలో చక్రాల్లాగా సక్రమంగా తిరగడంతప్ప 'హృదయాలు' విప్పి చెప్పుకునేపాటి తీరుబడి అవకాశం ఎవరికీఉండేవి కావు.

'తను' దిగాలుపడి కూర్చుంటే.

'ఏం మిస్టర్?' అని పలకరించేపాటి తీరుబడి ఉండేదికాదు అతని మిత్రులకు.

'ఈఅర్థంలేని బందిఖానా నాకెందుక'నుకునేవాడు.

ఇలా గడబిడలతో ప్రాణాలు తీసుకుని తామంతా సాధిస్తున్న దేమిటో తనకర్థమయ్యేదికాదు. 'డిసిప్లిన్', పేరుతో అర్థంలేని కట్టుళ్ళతో స్వేచ్ఛను, ఆనందాన్నీ వదులుకుని ఆఖరికి గట్టిగా గాలి పీల్చుకోడానిక్కూడా నోచుకోని దౌర్భాగ్యపుగతి పట్టిందేమో' అని బాధపడేవాడు. అక్కడి వాళ్ళంతా నిత్యం ఇలా బాధపడుతో వుండవలసిందేనా? అని వారిపై సానుభూతి చూపేవాడు. తనెంత పాషాణహృదయుడు? కనీసం తాను లేనన్నాళ్ళూ పుట్టింటి కెళ్ళమని చెప్పాలనికూడా తోచలేదు తనకు. తనది ఒకే పరధ్యాన్నం బ్ర స్నేహితులతో చెప్పాడు, 'అప్పుడప్పుడు శాంత క్షేమ సమాచారాల్ని చూస్తూ ఉండమ'ని.

కాఫీ త్రాగి బరువుగా నిలబడి సిగరెట్ పారేసి యాంత్రికంగా రోడ్డుమీద పడ్డాడు.

ఇదివరలో- అంటే ప్రసాదరావు ఉండే రోజుల్లో- సవినయంగా భూమిలోకి క్రుంగి వుండే ఇళ్ళు నేడు కొన్ని మేడలుగా రూపాంతరంచెంది దర్పంగా నిలబడి చూస్తున్నాయి. పల్లెటూరివాడు చూసినట్టు వింతగాచూస్తూ తనలో తను నవ్వుకుంటూ గొణుక్కుంటూ మధ్యమధ్య ఒళ్ళు తెలియకుండా 'విజిల్' చేస్తూ ఉదాసీనంగా



'ఈ మైకు అరుపుల్లో మన అరుపులు వినేవారెవరు?'

చిత్రకారుడు: శ్రీ చెన్నగిరి రామారావు (హైదరాబాదు)

లయగా బూట్లతో రోడ్డుమీద తాళంవేసుకుంటూ నడుచుకుంటూ పోతున్నాడు.

ఎదురుగా ఉన్న సినిమాహాలుకు వేళ్ళాడకట్టిన 'బేనర్'లోని హీరోయిన్ ప్రసాద్ చేష్టల్ని చూసి విరగబడి నవ్వుతోంది. మిస్టర్ ప్రసాద్ సీరియస్‌గా విలన్ పోజులో సిగరెట్ వెలిగించి తిన్నగా దాని కళ్ళల్లోకి మొహంమీదికి ఉక్కిరిబిక్కిరయేలాగ పొగవదిలాడు. ఆతార అమాంతంగా సిగ్గుపడిపోయి పొగమబ్బు చాటున తన మొహాన్ని దాచుకుంది.

ప్రసాదరావు తీరుబడిగా ఆ సినిమా తాలూకు వివరాలు చదివేడు.

"పోనీ సినిమా చూసి ఇంటికిపోతే?" ఆలోచనవస్తే ఆపని చేసినతర్వాత ఆలోచించడం మిస్టర్ ప్రసాద్‌లోఉన్న విశేషం.

అంచేత ప్రసాద్ సినిమాహాల్లో కూచుని తోలుసంచి జాగ్రత్తగా ఒళ్ళో పెట్టుకుని.

"సినిమాకు వెళ్ళడమా? మానడమా?" అనే సమస్యమీద సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తో తెగ ఆలోచిస్తున్నాడని వేరే చెప్పక్కర్లేదు.

భూమి తనచుట్టూ తను రోజుకొక్కసారి తిరుగుతే, ఒక్కొక్క థియేటరులో ఒక్కొక్క ఫిలిం రోజుకు కనీసం రెండుసార్లు తిరుగుతుంది. ఆదివారాలూ పండగలూ వస్తే మూడుసార్లూ వీలైతే వీలైనన్ని సార్లు తిరుగుతుంది.

తెలుగు మనుషులను తెలుగు డైలాగులను తెలుగు ప్రేమకలాపాల్ని, తెలుగు విలన్నూ-నాలుగేళ్ళతర్వాత ప్రసాదరావు మొదటిసారిగా వివరంగా ససంభ్రమంగా తిలకించి

(37-వ పేజీచూడండి)



# జీవనగంగ

పురాణం సూర్యప్రకాశరావు

(గతసంచిక తరువాయి)

భర్త బ్రతికిఉన్ననాటి వైభవంతో ఈనాడు ఈ బ్రతుకుని పోల్చుకుంటే కొన్ని నగ్నసత్యాలు ఆమెకి అర్థమయాయి. ఈ ఒంటి నిట్టాటపాకలో (ఇంట్లో పాచిపని చేసేవాళ్ళు యిలాంటి పాకల్లోనే ఉంటారు) మనుష్యుల ముఖాలకి వాచిపోయి, ఊరి వెలుపల బ్రతకవలసివస్తుందనీ, గంజి త్రాగి బ్రతికే ఈ అలగాజాతి ముసలితాత తమ పాలిట భగవంతుడవుతాడనీ అంతకుముందు అనుకోని విధంగా ఆమె గుర్తించాల్సి రావటంతో ఆమెలో అంతా తల్లకిందు లవుతున్నట్టుగా అనుభూతి చెందసాగింది. ఇదివరలో ఏ పనిమనుష్యుల్ని, కూలివాళ్ళనీ అలగాజాతివాళ్ళని దూరదూరంగా ఉంచేదో వారంతా ఆమె మనసులో కొద్దికొద్దిగా దగ్గరికి రాసాగారు. కొడుకుగాని, కూతురుగాని 'అమ్మా ఇలా చెయ్యనా' అని ఎంత చిన్న విషయంలో అయినాసరే సలహా అడుగుతే 'నాకు తెలియదు నాయనా. మీకెలాతోస్తే అలా చెయ్యండి' అని తప్పుకొంటూంది యిప్పుడు. ఏ విషయంలోనూ తానుగా చొరవ తీసుకుని సాధికారంగా శాసించటానికి యిప్పుడామె వెనకాడుతోంది.

'మామ్మా మళ్ళీ మనవూరు ఎప్పుడు పోతామే' అని పిల్లలు అడుగుతూంటారు.

సుగుణమ్మ పాలిపోయిన ముఖం ఎత్తుకొంటూ 'ఇది మన వూరే' అంటుంది.

"అయితే మరి యిక్కడ ఇళ్లు లేవేం! మనుష్యులు లేరేం? ఎప్పుడూ యింత నిశ్శబ్దంగా ఉంటుందేం? అబ్బ! ఆగాలి మూలుగు వింటుంటే భయంగా ఉంటుంది మామ్మా' అని అంటారు వాళ్ళు.

వాళ్ళ ప్రశ్నలు ఒకొక్కప్పుడు చాలా బాధాకరంగావుంటాయి.

'అమ్మా ఇదివరలా అందంగా తల దువ్వుకొని పూలు పెట్టుకోవేం? అలా దుప్పలా వదిలేసుకుంటావేం? అలా చుట్టచుట్టుకుంటే బాగుంటుందమ్మా" అని ఒకరంటే. "అసలు యిక్కడికి పూలు అమ్మడానికి రావుగా' అని యింకోరు సమాధానం చెబుతారు.

లక్ష్మమ్మగారు శోక్యంచేసుకుని "అబ్బ! మీరు అవతలికిపోయి ఆడుకోండి" అని కసురుకునేవరకూ వాళ్ళు యిలానే పిచ్చి ప్రశ్నలు వేస్తూ పెద్దవాళ్ళ ముందే తిరుగుతూంటారు. బయటికిపోతే వాళ్ళకి తోచదు. భయంగాకూడా ఉంటుంది.

ముసలితాత ఒకొక్కరోజు ఇంట్లోనే ఉండిపోతాడు. అతను యింట్లో ఉన్నంతసేపూ పిల్లలు అతనిచుట్టూ చేరి ఆడుకుంటారు. అతను లేకపోతే వాళ్ళు గుమ్మంవిడిచి బయటికి రారు. బయటికివచ్చినా ఉండీ ఉడిగీ దూరంగా వినవచ్చే బస్సు రొదలూ, జాంయ్‌మంటూ మూలిగే చెట్లూ, దూరంగా పచ్చపచ్చగా కనిపించే పంటపొలాలూ, ముళ్ళ పొదలూ, కీచురాళ్ళ రొదలూ బిక్కుబిక్కుమనిపిస్తాయి. ప్రతిరోజూ ఉదయం గొర్రెలమందని తోలుకుంటూ గొల్లవాళ్ళు అటునించి యింకా పైకిపోతూంటారు. సాయంత్రం కనుచీకటి పడేవేళకి మందని తోలుకుంటూ ఇళ్లకు తిరిగిపోతూంటారు. వాళ్ళు పిల్లల్ని పలుకరించిపోతూంటారు. ఆ గొల్లలు వినసొంపుగా మురళీ వాయించుకుంటూ పోతూంటారు. సుగుణమ్మ, లక్ష్మమ్మగారు పిల్లల్ని దగ్గరగా తీసుకొని ఆ పాటవింటూ కన్నీరు పెట్టుకుంటారు.

ముసలితాత పిల్లల్ని ఎదురుగా కూర్చోపెట్టుకుని తన చరిత్రనంతా కథలు కథలుగా వినిపిస్తూంటాడు.

తన చెప్పుచేతల్లో ఇద్దరుపనివాళ్ళు కామేషాగా పిల్లల్ని చూడటానికంటూ ఉండే రోజుల్లో తనఎదుట వాళ్ళు పిల్లల్ని ముద్దు పెట్టుకుంటే లక్ష్మమ్మగారు ఎడాపెడా నాలుగువాయించి 'మూతిమీద వాతలేస్తా' అని విరుచుకుపడిపోయేవారు. ఇప్పుడు తాత ఆ పిల్లల్ని ఎత్తి హృదయానికి హత్తుకుని ముద్దుపెట్టుకుంటుంటే ఆవిడచూసినా ఏమీ అనలేక మనసులోనే బాధపడి సర్దుకుంటున్నారు. అతను పిల్లలకోసం అప్పుడప్పుడు పళ్ళూ, బిళ్ళలూ తెస్తూంటాడు. దగ్గర కూచుని వాళ్ళచేత తినిపిస్తూంటాడు.

'అమ్మాయీ వాళ్ళని ఇటు పిలవ్వే. ఎంత చెడ్డా ఇలాంటివి చూడలేనే. ఆ పిల్లల్ని ఇలా రమ్మను. మంచివాడే అనుకో. ఐనా అలగా జాతివాడిదగ్గర వాడి ఒళ్ళో వెళ్ళి కూర్చుని వాడు పెట్టిందంతా తింటుంటే పాపంకదుటే. రామ! రామ! నే చూడలేనే తల్లీ' అంటూ కూతురు దగ్గర గొణుగుతూంటుంది.

'అలా అనకమ్మా. అతనే లేకపోతే మనకిక్కడ దిక్కెవరు చెప్పు. అతను అంత ఆప్యాయంగా తెచ్చిపెడుతుంటే కాదంటే పాపంకదూ?" అంటుంది సుగుణమ్మ.

లక్ష్మమ్మగారు మారుమాట్లాడకుండా ఊరుకుంటారు.

ముసలి తాతలేనిదే పిల్లలకి సందడిలేదు. అతను వాళ్ళను కూడా వేసుకుని ఆ చుట్టుపక్కలకి షికారుగా తీసుకుపోతూంటాడు. రోజూ విడిచి రోజూ లక్ష్మమ్మగారు చేసుకున్న పచ్చడో కూరో అతనికి పెడుతూంటారు. బజారునించి కూరానారా అతనే తెచ్చిపెడుతూంటాడు. మధుసూధనం సుభద్రమ్మగారు వారానికి ఓ మారువచ్చి చూసిపోతూంటారు.

మొత్తంమీద తనమడీ, ఆచారం దృష్ట్యా ఇక్కడ లక్ష్మమ్మగారికి చాలా ఇబ్బందిగానే ఉంది. సుగుణమ్మ ఈ స్థితిలో పదిమంది మధ్యా ఉండాల్సిన మనిషి. అలా జరిగిఉంటే ఆమె కొంతలో కొంత కోలుకొని ఉండేది. యిప్పుడు ఈ ఏకాంతవాసంలో ఆమె మరింతగా కృంగిపోయింది. పాలిపోయి ఒంటి ఊపిరితో నీరసంగా ఉంటూంది. పిల్లల్ని గుండెలకి హత్తుకు ఏవేవో జ్ఞాపకాలతో రోజుకోమారైనా ముఖమంతా చెరువుచేసుకుని వాతావరణాన్ని అత్యంత విషాదపూరితంగా మారుస్తూంటుంది. అలాంటప్పుడు లక్ష్మమ్మగారు పడే బాధ అంతా యింతా కాదు. దిగులుతో ఆమె మనసంతా బరువెక్కిపోతుంది.

'అమ్మా నువ్వు మనసు రాయిచేసుకోవాలే. లేకపోతే ఇక్కడ జీవితం నరకంలాఅయిపోతుంది. కాస్త ఓర్పుపట్టు. నా మాట విను' అంటూ లక్ష్మమ్మగారు అనునయిస్తే సుగుణ దుఃఖాన్నంతా దిగమింగి అలాగే ఒరిగిపోతుంది. ఆ పడిపోవటం ఒక్కొక్కప్పుడు గంటలతరబడి స్పృహలోకి రాకుండాఉండిపోవటం జరుగుతూ ఉంటుంది. లక్ష్మమ్మగారికి కాళ్ళూ చేతులూ ఆడక కంగారుపడిపోతారు. పిల్లలు బావురుమంటారు. ఒక్కొక్కప్పుడు తాత ఉంటాడు. ఒక్కొక్కప్పుడు ఉండడు. ఇక ఆ పరిస్థితిలో లక్ష్మమ్మగారికి పిచ్చెక్కినట్టయి లోకాన్నంతా దుమ్మెత్తిపోసేస్తుంది.

"పాడు మనుష్యులు. పచ్చగా ఉంటే మీదపడి పొట్ట పగిలేట్టు తింటారు.



ఆది నిర్ధారణ చేసుకుందుకు చూసీ చూడనట్టుగా ఆ పాతపుస్తకం పరీక్షచేశాడు. తను పొరబాటుపడలేదని నిర్ధారణ చేసుకుని ఒళ్లంతా జలదరించినట్టయి పక్కకి జరగబోతుంటే ఆ వ్యక్తి బాధగా చూశాడు.

బాబూరావు కాఫీ మెల్ల మెల్లగా చప్పరిస్తున్నాడు. హోటల్లో జనం పల్చపల్చగా ఉన్నారు. హోటలు యజమానికుర్చీలో బద్ధకంగా కూచుని ఆవులిస్తున్నాడు.

మల్లిబాబు ఎంత త్వరగా ఈ కుష్ఠురోగిబారినుండి తప్పుకుపోదామా అన్న ఆతృతతో బాబూరావుని తొందరచెయ్య సాగాడు.

"ఈ సర్వర్ల మీద పాపం వీళ్లంత జులుంచలాయిస్తారు సార్. దారుణం" అంటున్నాడు కుష్ఠురోగి ఒక చెంప కసితో పళ్లుకొరుక్కుంటూనే.

మల్లిబాబు బాబూరావు ప్రక్కకి

కష్టంవస్తే ఒక్కగాడిద కొడుకు ఆదుకోడు. నా బిడ్డనీ నన్నూ ఇంతబాధలు పెడతార్రా. మీ వంశాలు నాశనంగాను. మీకు ఆడబిడ్డలు లేరూ" అంటూ తిట్టిపోస్తారు. పిలుస్తేపలికే దిక్కులేదు చెట్టూ చేమా తప్పించి.

ఆదివారం నగరం ప్రశాంతంగా ఉంది. ఆరోజు ఆఫీసులకి వెళ్లేవాళ్ళూ, వ్యవహారాలూ, వ్యాపారాలనిమిత్తం తిరిగేవారికీ విశ్రాంతిదినం కనుక వీధులన్నీ జనసందడి ఎక్కువగా లేకుండా నిశ్శబ్దంగావున్నాయి. అక్కడక్కడ హోటళ్ళలోనుంచి వినవస్తున్న సినిమా సంగీతం ఆ నిశ్శబ్దాన్ని మరింత ప్రస్ఫుటం చేస్తున్నది.

హోటల్లో బల్లముందు కూర్చుని 'ఓ కప్పు కాఫీ' అని పురమాయించి సర్వరు వినిపించుకోకపోతే చిర్రాగ్గా మరోమారు అరిచాడు బాబూరావు.

ఆ అరుపుకి ప్రొప్రయిటర్ అదిరి వెనక్కి చూసి బాబూరావు తీవ్రమయిన దృష్టి సర్వర్ మీద లగ్నం అయివుండటం గమనించి 'ఏరా రాస్కల్. కొవ్వు బలిసిందా. చెబితే వినిపించలా?" అంటూ అరిచాడు.

సర్వర్ ఎన్నడూ అలవాటులేనికోపంతో జీవితంలో మొదటిసారిగా కౄరంగా చూస్తూ ఏదో నసిగేసరికి హోటలుయజమాని కుర్చీలోంచి చర్రుమనిలేచి సర్వరుమీదికి రాబోతుంటే మల్లిబాబు చప్పున అడ్డుపడి సర్వర్ని లోపలికి పంపించేసి "కాస్త ఆగండి. అభిమానం చచ్చిపోయింది కాబట్టే వాడు పడుతున్నాడు గాని ఊదితే ఎగిరిపోయేట్టుగా ఉన్న మీరు ఆ పర్వతాకారుడి మీదకు లేస్తే వాడు తిరగబడితే ఈ హోటల్లో వున్న మీరంతా కలిసినా వాడి కబంధ హస్తాలనుంచి మిమ్మల్ని వేరుచెయ్యలేరు. మన జాగ్రత్తలో మనం ఉండటం మంచిది" అని అంటుంటే ప్రొప్రయిటరు "నల్లిని రాసినట్టు నలిపేస్తాను సార్" అని ఓ చూపు రూక్షంగా సర్వరువైపు విసిరి వెళ్లి కుర్చీలో కూర్చుని వోరగా మల్లిబాబువైపు చూడసాగాడు.

"మంచి ఘాటయిన సమాధానం చెప్పారండి. బలే సంతోషం అయింది" అంటూ రెండుబల్లల అవతల కూచున్నాయన మల్లిబాబు పక్కగావచ్చి కూర్చున్నాడు.

మల్లిబాబు అతని పొంగినట్టుగా ఉన్న ముఖాన్ని పరిశీలించి విషయం గ్రహించి ఇరుక్కుంటూ "అవునండి" అంటూ మర్యాదకోసం ఓ చిరునవ్వు నవ్వాడు.

అవతలవ్యక్తి రోగిష్టి అయినా కొద్దిగా మంచి దుస్తులే వేసుకున్నాడు. చేతులకి తొడుగులున్నాయి. కాళ్లకి బూట్లు తొడుక్కున్నాడు.

"ఈ ఊళ్లో మంచిసినిమా లేమయినా ఉన్నాయా సార్?" అన్నాడతను.

బాబూరావు తాగుతూన్న కాఫీ ఆపి "లేకేమండీ. ఉన్నవన్నీ మంచి సినిమాలే. టిక్కెట్టు కొనుక్కుని కళ్ళు మూసుకుని లోపలికి జొరబడొచ్చు. బాధపడక్కర్లేదు. మన డబ్బులు మనకి గిట్టుబాటవుతాయి" అన్నాడు.

కుష్ఠురోగి ముఖం వికసించింది. అతను మల్లిబాబుతో మాట్లాడదల్చుకోలేదు. మామూలుగా మాట్లాడే ఈమనిషితో అతను మాటలు ప్రారంభించాడు.

"మనవాళ్ళు సినిమాలు ఇంకా బాగా తియ్యాలండీ. హిందీవాళ్ళు చూడండి మన కంటె ఎంత ముందుకుపోయారో."

మల్లిబాబుకు చిర్రాగ్గావుంది. కుష్ఠురోగి

# జీవనగంగ

ఓ కంటితో కసిగా ఈసంగతి గమనిస్తూనే వున్నాడు.

"అలా అంటే ఒప్పుకోను. బాళ్లు విదేశాల వాళ్ళని చాలా చవకబారుగా అనుకరిస్తున్నారు" అన్నాడు బాబూరావు.

ఇలా సమానస్థాయిలో వెయిటరుతోనంతా మాట్లాడితే చాలన్నట్టుగా ముఖం వాచిపోయివున్న కుష్టురోగి "అదీ నిజమే లెండి" అన్నాడు ఏదో పెద్దతప్పు దిద్దుకుంటున్నట్టుగా.

సర్వరు వచ్చి కుష్టురోగిని ఏదో అడుగుతున్నాడు.

బాబూరావు కాఫీ ముగించి సిగరెట్ పాకెట్ తీసి కుష్టురోగిముందు వుంచి "తీసుకోండి ఫర్వాలేదు" అన్నాడు.

కుష్టురోగి ముఖంలో వెయ్యిదీపాలు వెలిగాయి.

సర్వరు అపాదమస్తకం యీ మనిషిని పరిశీలించి మెల్లగా ప్రొప్రయిటరు చెవులో ఏదో చెప్పాడు.

"ప్రొప్రయిటరువచ్చి "సార్. మీరుకాస్త లేచి ఇల్లారండి" అన్నాడు కుష్టురోగితో.

కుష్టురోగి ముఖం పాలిపోయింది. అతడు వేదనతో ఖాళీఅయిన కుర్చీని భయంగా చూస్తూ 'ఇకలే మిత్రమా పోదాం' అన్నాడు మల్లిబాబు.

బాబూరావు లేచి నడవబోతుంటే మల్లిబాబు అతన్ని పక్కకి నెట్టుతూ 'నా మాట విని ఆపక్కనుంచి పోదాం. పద' అన్నాడు.

ప్రొప్రయిటరు కుష్టురోగినిమందలిస్తున్నాడు. కుష్టురోగి తలవంచుకుని మెట్లుదిగుతూ వెనక్కిచూసి తన అడుగుజాడలలో కూడా నడవటానికి భయపడుతూన్న మల్లిబాబుని, అమర్యాదగా బయటికిపొమ్మన్న హోటలు యజమానిని కసిగాచూస్తూ ఓ మారు తలవంకించి హోటలుపక్కగావెళ్లి నిలబడ్డాడు.

బాబూరావు ఆశ్చర్యంగా ఏదో అడగబోతుంటే హోటలు సర్వరు రెండు ఇడ్లీలు పొట్లం కట్టి దూరంగా నిలబడి ఆ కుష్టురోగి రెండుచేతుల్లోనూ పైకిపట్టుకున్న తువ్వాలులోకి విసిరాడు.

మల్లిబాబు దుర్భరమూ, హృదయవిదారకమూ అయిన ఈ దృశ్యాన్ని చూడలేక గబగబా ముందుకుపోతుంటే బాబూరావుతో హోటలు ప్రొప్రయిటరు అన్న మాటలు వినిపించాయి.

"కుష్టురోగి బాబూ. ఘరానాగా లోపలికి చొరబడ్డాడు. ఇంకా నయం. ఎవరూ చూడలేదు" అంటున్నాడు ప్రొప్రైటరు.

బాబూరావు ఆవిరిపడి ఒళ్ళంతా జలదరించినట్టయి "అరి బాప్రే" అంటూ హోటలులోకి జొరపడ్డాడు చేతులు రుద్దుకుంటూ.

కుష్టురోగి ఆకలిగా వుండి కాబోలు ఆతృతగా కుక్కుకుంటున్నాడు.

మరో పది నిముషాల్లో బాబూరావు ఇవతలకి వచ్చాడు తిట్టుకుంటూను.

దారిలో 'పుస్తకం పుచ్చుకుని పదిహేను రోజులయింది భాయీ. పరీక్షలు పెద్దపులిలా వచ్చేస్తున్నాయి" అన్నాడు బాబూరావు.

మల్లిబాబు ఒక విధమైన జాలితో కూడిన అసహ్యం నించి కోలుకుంటూ "నీకు పరీక్షలంటే ఓ లక్ష్యం కూడానా" అన్నాడు.

బాబూరావు చప్పరించేసి ఇలాంటి పరీక్షలు అనేకం చూసాను. మనకు భయమేమిటి భాయీ" అన్నాడు.

బాబూరావు జేబులోంచి ఒక ఉత్తరం తీసి మల్లిబాబు కిస్తూ 'చదువు' అన్నాడు.

మల్లిబాబు చదివి 'ఏమీ బాగులేదు' అన్నాడు.

బాబురావు దెబ్బతిన్న స్వరంతో 'ఏం?' అన్నాడు.

"పంపించిన డబ్బంతా పదిరోజుల్లో ఖాళీ చేసి మళ్ళీ కావాలంటే ఎక్కడ్నించి వస్తుంది? అయినా ఆ విషయంకూడా సున్నితంగా రాయాలిగాని ఇంత మోటుగానా రాయటం?" అన్నాడు మల్లిబాబు.

"నీ తెలివి మండినట్టే వుంది. పట్నంలో చదువంటే తెలియనట్టే మాట్లాడుతున్నావే. నీ పద్ధతి వేరు. నేను జీవితాన్ని అనుభవించాలనే ఆశయం కలవాడ్ని."

"నా ఆశయంకూడా అదే. నీకు తెలియకుండానే నువ్వు ఆ ఆశయానికి దూరంగా పోతున్నావు. ఆవిషయం నీకు తెలియటంలా."



పచ్చని ఎండ బంగారు పూతలా మెరుస్తూ పాకిపోతూంది. బద్ధకస్తులు అప్పుడు లేచి ముఖాలు కడుక్కుంటున్నారు. హోటలు సంగీతం దూరంగా వినిపిస్తోంది. ఇళ్ళ ముందు ఆడవాళ్ళు అందంగా ముగ్గులు వేసుకుంటున్నారు.

బాబూరావు ఈలపాట ఎత్తుకునేసరికి మల్లిబాబు తీవ్రంగా "ఇదిగో. ఇలాంటి పిచ్చివేషాలు వేశావంటే నేను వెనక్కి వెళ్లిపోతాను" అంటూ మందలించాడు.

బాబూరావు 'క్షమించు' అని ఆపేసి కేవలం చూపులతో తృప్తిపడుతూ మెల్లమెల్లగా అడుగులు వెయ్యసాగాడు.

బాబూరావు "నువ్వలాగంటావుగాని ఏ ఖర్చు తప్పుతుంది భాయీ. కాఫీ తప్పుతుందా? సిగరెట్టు తప్పుతుందా? టిఫిన్ తప్పుతుందా, కాస్త వినోదానికి సినిమాలు తప్పుతాయా? ఏం తప్పించుకోను" అన్నాడు.

"వాటినే పరిమితం చేసుకో. మీ నాన్న హఠాత్తుగా వచ్చిపడ్డాడంటే నీ బ్రతుకంతా బయటపడుతుంది."

"మాఅయ్య కీవూళ్ళో తూర్పేదో పడమరేదో తెలుస్తేగా?"

కొంతదూరం పోయింతర్వాత "ఆయనెవ్వరోయ్? అలా చూస్తారు నీకేసి ఆడదానికేసి చూసినట్టు" అన్నాడు బాబూరావు మల్లిబాబు బుజం గుంజుతూను.

మల్లిబాబు వెనక్కి చూసి "లక్ష్మణరావుగారూ" అని పించాడు.

లక్ష్మణరావు ఆగి, మల్లిబాబు సమీపించగానే "ఏదో పనిమీద వెళ్తున్నట్టున్నావు. అందుకనే ఆపలేదు" అన్నాడు.

"ఒక స్నేహితుడి దగ్గరికి వెళ్తున్నాం"

"ఈమధ్య మా తోడల్లుడు పోయాడు. సుగుణమ్మ భర్త. నీకు తెలుసనుకుంటాను."

జ్ఞాపకం చేసుకుంటూ 'విన్నట్టే జ్ఞాపకం. అయితే అంతా వెళ్లిపోయారా?' అన్నాడు మల్లిబాబు.

విలాసంగా సిగరెట్టు కాలుస్తూ బాబూరావు దూరంగా నిలబడి పోజుపెట్టి చూస్తున్నాడు.

మల్లిబాబు బాధగానే అటు చూసి "అయితే పాపం మధుసూధనంగారి పరిస్థితి మళ్లీ మొదటికివచ్చిందన్నమాట" అన్నాడు.

"పెద్ద దెబ్బతిన్నాడు. అవన్నీ తర్వాత తీరిగ్గా మాట్లాడుకుందాంగాని నీ చదువు బాగా సాగుతోందా? పరీక్షలు దగ్గరికి వస్తున్నట్టున్నాయి."

"ఫర్వాలేదు. ఆ భయం నాకు లేదు."

ఇద్దరి మనసుల్లోనూ ఒక విషయం మెదులుతున్నా అది తెలియనట్టే మసలాలని ఇద్దరూ ప్రయత్నిస్తున్నారు. అందుకనే లక్ష్మణరావు అతన్ని పలుకరించలేదుకూడాను.

విడిపోతుంటే మల్లిబాబు ఉండబట్టలేక

"సాయంత్రం ఇంటికి వస్తాను ఉంటారా!"
అన్నాడు.

"వుంటాను" అని సమాధానం మటుకు వచ్చింది.

*　　*　　*

సాయంత్రం మల్లిబాబు వచ్చేసరికి లక్ష్మణరావు ముందు వరండాలో కూర్చుని ఈ తరం చదువుతున్నాడు. రాధ పక్కనే కూర్చుని వుంది.

ఈ తరం సగంలో ఆపి గేటు తెరుచుకుని వస్తూన్న మల్లిబాబుని చూసి 'రావోయ్! రా' అంటూ ఆహ్వానించాడు.

రాధ కుర్చీలోంచి లేవబోతుంటే "మీరు లేవకండి" అని వారిస్తూ లోపలి నుంచి ఒక కుర్చీ తెచ్చుకుని లక్ష్మణరావుకి అభిముఖంగా వేసుకుని కూర్చుంటూ "మీరలాగున్నారేం?" అన్నాడు రాధ నుద్దేశించి మల్లిబాబు.

"ఆమెకి జ్వరం. నీకు చెప్పటం మరిచాను" అన్నాడు లక్ష్మణరావు.

"ఫర్వాలేదు. ఇప్పుడు తగ్గిందిలెండి" అంది రాధ.

జానకమ్మ ఇవతలికి వచ్చి మల్లిబాబుని పలకరించి వెళ్ళిపోయింది.

ఇంతలో బయటనించి ఒకాయన 'మాస్టారూ' అంటూ లోపలికి వచ్చారు. లక్ష్మణరావు లేచి ఆయన్ని కూర్చోమని "ఏమిటి ఇలా దయచేశారు" అన్నాడు.

"మీమాట కాదనలేక అబ్బాయిని మల్లిబాబుగారిదగ్గర కుదిర్చాను గాని చాలా ఇబ్బందిగా వుందిసార్. చాలా దూరం అయిపోయింది" అన్నాడాయన కుర్చీలో కూర్చుంటూను.

లక్ష్మణరావు వెంటనే "ఆయన పెద్ద పరీక్షలకు వెళ్తున్నారు. ఇంకో విద్యార్థితో కలిసి అక్కడే చదువుకుంటున్నారు. పరీక్ష అయిపోగానే ఈ ప్రాంతాలకు వచ్చేస్తారు. కాస్త ఈ పదిరోజులూ సర్దుకుంటే ఆ తర్వాత ఇబ్బంది వుండదు. తొందరపడకండి". అన్నాడు.

"ఓహో అలాగా! ఆవిషయం నాకు తెలియదుగా మరి. అలాగేలెండి" అని ఆయన మల్లిబాబువైపు తిరిగి "మీ జీతం రేపు పంపుతాను" అన్నాడు.

ఆయనే "మీ గులాబీచెట్టు వాడిపోయిందండీ. వీధిలోంచి చూస్తే పువ్వులు అందంగా కనిపిస్తూండేవి" అన్నాడు.

గులాబిచెట్టు ఆయన చెప్పినట్టుగానే ఆకు రాలి మోడయి వుంది.

మల్లిబాబు రాధవైపు చూశాడు. "రోజూ నీళ్ళు పోస్తూనే వున్నాను" అంది రాధ.

మల్లిబాబు ఫక్కుమని నవ్వేశాడు.

లక్ష్మణరావు "ఏమిటోయ్! అలా నవ్వుతున్నావు" అన్నాడు అర్థంకాక.

ఆ వచ్చినాయన ఎందుకో తనజేబువైపు చూసుకున్నాడు. ఆయన వాక్కాజేబు

# జీవనగంగ

కిందిభాగం చిరిగి అందులోంచి ఆయన పొడుంకాయ అడుగుభాగం కొద్దిగా తొంగిచూస్తోంది. ఆయన సర్దుకుని సిగ్గుపడుతూ "చాకల్ది చింపేసిందండీ" అన్నాడు.

మల్లిబాబు పొరబాటు గ్రహించి 'అయ్యయ్యో! క్షమించండి, మిమ్మల్ని చూసి నేను నవ్వలేదు' అన్నాడు చేతులు జోడించి నమస్కారం చేస్తూను.

లక్ష్మణరావు విషయం గ్రహించి 'లక్ష్మణస్వామి నవ్వులా ఉందే' అన్నాడు. రాధ నవ్వుఅణచుకుంది.

ఆ వచ్చినాయన నవ్వుకుంటూనే వెళ్ళిపోయాడు.

"నవ్వు నాలుగువిధాల చేటు. అసలు మీరు నవ్వటానికి కారణం?" అంది రాధ.

"ఎందుకో వచ్చింది."

"ఆయన్ని చూసే మీరు నవ్వారు కదూ?" అన్నాడు లక్ష్మణరావు.

"తప్పకదండీ. అందుకు కాదు నేను నవ్వింది. నేను రాధ సమాధానానికి నవ్వాను" అన్నాడు మల్లిబాబు.

లక్ష్మణరావు పాతఅనుభవం ఒకటి చెప్ప సాగాడు. "నేను చదువుకునే రోజుల్లో ఓ లెక్చరర్ ఉండేవాడు. ఆయన జ్ఞాపకం వస్తున్నాడు. ఇంటిదగ్గర చమత్కారాలు బట్టీపట్టి క్లాసులో వినిపిస్తూండేవాడు. పిల్లలు విషయం గ్రహించారు. నవ్వటం మానేశారు. ఆయన విట్టు విసిరి అంతా నిశ్శబ్దంగా ఊరుకునేసరికి ఆయనే పెద్దగా నవ్వుతుని 'మీరు పసివాళ్ళు అర్థంకాలేదు' అనుకునేవాడు. లోపల్లోపల బాధపడే వాడు."

"హృదయపూర్వకంగా నవ్వడం ఆరోగ్యకరమేగాని అదేపనిగా నవ్వితే అనర్థాలు వస్తాయి" అంది రాధ.

"తగాదా లేవిటి. కొంపలు మునుగుతాయి. ఒకసారి ఒక ఆఫీసులో ఇలాగే జరిగింది. జోగినాథం అనే గుమాస్తా ఉండేవాడు. ఆయనకి నవ్వు జాస్తి. ఆఫీసులో కూర్చుని ఏవేవిటో జ్ఞాపకంవచ్చి తనలో తాను నవ్వుకుంటూండేవాడు. కొత్తలో మేం అలవాటు లేక ఇబ్బందిపడ్డాం. రానురాను అలవాటయి పోయింది, ఆ అలవాటు ఆయన మానుకో లేక పోయాడు. ఆ నవ్వుకి ఓ వేళాపాళా, చోటూ సందర్భం, సమయం ఉండేవికావు. ఓనాడు పెద్దాఫీసరు పక్కన్నే కొచ్చి కూర్చుని ఏమో పేపర్లు చూసుకుంటున్నాడు. జోగినాథం ఆయన వచ్చినసంగతీ, ఆయన తనకి చాలా దగ్గరలో ఉన్న సంగతీ గమనించలేదు పాపం. అతనిగొడవలో అతను ఉండి పోయాడు. ఉన్నట్టుండి ఫక్కుమని నవ్వే శాడు. ఆఫీసరుగారికి జారుడుముడి

చినకాల తలపాగాలోంచి మెడమీదవ వేలాడుతూంటుంది. అప్పుడే ఆయన తలపాగా తీసి ముడి జారిపోతుంటే ఓసారి జుట్టు విప్పుకుని మళ్ళీ ముడివేసుకుని తలపాగా పెట్టుకుంటున్నాడు. జోగినాథం నవ్వటంతో ఆయన భగ్గున మండిపోయాడు. పని బాగుండలేదని వంకపెట్టి ఛార్జికు పెట్టి ఉద్యోగంలో పైకిపోయే అవకాశాలు లేకుండా చేశాడు. పాపం ప్రమోషను ఆగిపోయింది. ఈమధ్య రాజువలు ప్రమోషను వచ్చింది. అతనితోటివాళ్ళంతా అతనిమీద ఆఫీసర్లుగా వచ్చారు. అసలు నవ్వటానికి కారణం ఏమిటంటే జోగినాథం చెప్పిందిది. ఆ ఉదయమే వాళ్ళింటికి ఓ స్థూలకాయురాలు చుట్టంచూపుగా వచ్చిందట. ఆవిడ అరటిపండు తిని ఆ తొక్క గుమ్మంలో పడేసి ఎక్కడో ఉన్న కోడల్ని తిట్టుకుంటూ దానిమీదే అడుగేసి జర్రుమని జారి భావిదగ్గరకువెళ్ళి పడిందిట. ఆదెబ్బతో ఆ పూట పోదాం అనుకున్న మనిషి నడుం అంతా వాచిపోయి మంచానపడి మూలుగుతూందిట. ఆ దృశ్యం అతని కళ్ళముందు మెదిలిందిట. అందుకు నవ్వేశాట్ట. ఏమయితేనేం ఆనవ్వు అతనికొంప ముంచింది."

మల్లిబాబు ముందుకు లేచి "అయితే నేనొకపొరబాటు చేసానన్నమాట" అన్నాడు.

ఉత్తరంలో విశేషాలు చెప్పలేదు అంది రాధ.

లక్ష్మణరావు జేబులోంచి ఉత్తరంతీసి రాధచేతికిస్తూ డబ్బు మంచినీళ్ళలా ఖర్చయిపోతూంది అంటూ రాసాడు. ఏంచేస్తాం. కలిసిఉంటే ఇంత ఖర్చు ఉండదు. సంఘం కలిసి ఉండటానికి ఒప్పుకోదు. భర్తపోయి ఆవిడే గుండెబాదుకుంటుంటే ఆ పుండు మీద కారం చల్లుతుంది. ఊరికి దూరంగా పెట్టేసింది. మూడుమాసాలు పాప పరిహారం చెల్లించుకోమంది. పోనీ శలవు పెట్టమని రాసాను. శలవు లేదుట ఇదీ పరిస్థితి."

మల్లెబాబుకి ఒక ఆవేశంలాంటిది తోసుకొచ్చింది. "ఈ నమ్మకాలమీద ఈ ప్రజకి ఉన్న గాఢాభిమానం, వారు వాటికి ఇస్తున్న అత్యున్నతస్థానం ఇవన్నీ నన్ను ఆశ్చర్యపరుస్తూంటాయి. ఈ ఆధునిక యుగంలో ఈ దేశాలు ఇన్ని సౌకర్యాలతో ఒక రకమైన వ్యవస్థని స్థాపించాలని పెద్దపెద్ద ప్రయత్నాలు చేస్తూ ఎన్ని ఇక్కట్లపాలు కావలసి వస్తోందో, ఎటువంటి పరాజయాల్ని ఎదుర్కోవలసి వస్తోందో మనం చూస్తున్నాం. కాని ఆయుగంలో అంటే ఏవిధమైన ఆధునిక సౌకర్యాలు లేని కాలంలో ఏ ప్రజ్ఞ అంతటి బలమయిన పునాదులు సృష్టించి ఈ నమ్మకాలపట్ల, ఈ ఆచారాలపట్ల ఇంతటి గాఢమయిన నమ్మకం కుదర్చగలిగిందో కాదు ఆశ్చర్యంగా ఉంటుంది. చావటం

అన్నది అంత తీవ్రమయిన విషయంకాదు. కాని కర్మవాదాన్ని కాదంటేమటుకు అది ప్రాణాంతకమైన సమస్యగా భావించేవారు. ఒకనాడు ఏ సంఘబలాన్నయితే ప్రధానంగా భావించేవారో, ఏ పద్ధతుల్ని, ఆచారాలని ప్రాణతుల్యంగా చూసుకునేవారో

## జీవనగంగ

ఇంకా ఇప్పటికీ అంతతీవ్రంగా కాకపోయినా చాలావరకు పాటించబడుతూనే

వున్నాయి. ప్రజల జీవితవిధానం మారినా మనం కొత్తకి వెనకాడుతూనే ఉంటాం. ఒకనాటి ఈ నమ్మకాలని ఆధారం చేసుకుని ప్రజలందరినీ ఒకత్రాటిమీద నడిపించి, మతం అధికారంకింద అపూర్వమయిన రాజకీయ, సాంఘిక, సాహిత్యాది అభివృద్ధిని

ఆనాడు దేశం సాధించింది. అసంతృప్తులూ అన్యాయాలు వుండవచ్చు. అవి సర్వకాలాల లోనూ ఉన్నాయి. మహత్తరమైన విజ్ఞానం మహత్తరమైన కళాసృష్టి, మహత్తరమైన శిల్పనైపుణ్యము ఆనాటి విజయాలు. అయితేకోట వెలుపలి ప్రజలలో ఉన్న నిజాయితీ కోటలోపల రాచరికంలో లుప్తమయిపోయింది. బలహీనతలు ఎక్కువయాయి. పరాయిపాలన, పరాయి భావాలు, పరాయి మతాలు, అన్ని రంగాలలోనూ చొరబడ్డాయి. జాతీయాభిమానం సన్నగిలసాగింది వ్యవస్థా స్వరూపం మారిపోయింది. జరుగుతున్న అన్యాయం గ్రహించారు మేధావులు. ప్రజల్ని రాజకీయాల్లోకి ఈడ్వక తప్పలేదు. తిరిగి స్వాతంత్ర్యం పొందాం. కాని ప్రజల్ని ఏకోన్ముఖుల్ని చెయ్యటం సాధ్యపడడం లేదు. మేధావులు కృషి చేస్తున్నారు. రాజకీయ నాయకులు సిద్ధాంతాలకి అంటిపెట్టుకుని పైపై చూపుల చూస్తున్నారు. కాని ప్రజలు ఏది నమ్మాలో ఏది నమ్మకూడదో తెలియక ఎవరో చెప్పింది నమ్మి, ఎవరి అభిప్రాయాన్నో మన్నించి ప్రజాప్రభుత్వంలో అమాయకంగా బాధ్యత నెత్తిమీద వేసుకుంటున్నారు. ఒకరిమతం ఒకరికి సరిపడదు. అందర్నీ ఏకంచేసే వస్తువు ఏదన్నా ఉందంటే ఆశక్తిదేవుడు. అంతకు తప్పించి మరేమీ కనిపించటంలేదు. ఈవిభిన్న భావాలని సంఘటిత పరిచేశక్తి ఏది?" మల్లిబాబు ఉపన్యాసం పూర్తికాగానే లక్ష్మణరావు చప్పట్లుచరిచి 'బాగుబాగు' అన్నాడు.

రాధ చెమట తుడుచుకుంటుంటే 'మల్లిబాబు ధోరణికి చెమటపట్టిందా?' అన్నాడు లక్ష్మణరావు చమత్కారంగా.

బయట వరండాలో నవ్వులతో జానకమ్మ చేతిలో విసనకర్రతోనే ఇతవలికి వచ్చి 'ఏవిటండీ అంతగా నవ్వుతున్నారు' అంది.

"అయితే మీరు ఇక్కడ సుగుణమ్మపట్ల సంఘం చూపుతున్న నిర్దయని సమర్థించటం లేదుగా?" అంది రాధ.

"నేను వ్యష్టిగా ఆలోచించలేదు. అదీ కాకుండా ఒకనాటి పరిస్థితి చెప్పాను. ఈకాలానికి సరిపడని చర్యలమూలకంగా జరిగే అనర్థాలని నేను ఖండించి తీరతాను" అన్నాడు మల్లిబాబు.

చీకటి పడబోతూంది. రాధ దీపంవేస్తానంటూ లేవబోయింది.

నేను వస్తానంటూ మల్లిబాబు లేచాడు. లక్ష్మణరావు వీధివరకూ సాగనంపి లోపలికి వచ్చేసాడు.

మల్లిబాబు రోడ్డువార నడుస్తూనే 'ఏ విషయం చెబుదామనుకున్నానో ఆ విషయం చెప్పలేకపోయాను' అనుకుని బాధపడ్డాడు.




"ఫోటోఅవగానే మనపెట్టెలోకి వచ్చేయండిస్మీ"

చిత్రకారుడు—శ్రీ వై. సాయిబాబు (చిలకలపూడి)

'ఏ విమర్శతో తను నేను బలహీనుడ్ని కాను' అని ఋజువుచేసుకో గలిగాడో అందుకు కృతజ్ఞతలు చెప్పుకోందా మనుకున్నాడు. కాని నోరుమెదిపి ఆవిషయం చెప్పలేకపోయాడు. ఆ వ్యక్తిప్రభావం తనమీద పని చేస్తోందనే అభిప్రాయం ఇతరులకి కలుగుతుందేమో అని అతను శంకించాడు. లక్ష్మమ్మగారు ఒకనాడు వేసిన అపవాదుకి ఈ అభిప్రాయం మరింత బలం ఇస్తుందేమో అని కూడా అతను సంశయించాడు. ఆమె ప్రభావమయితే తనమీద పనిచేసినమాట నిజం, అనుకుని అతను తృప్తిగా ఆలోచించుకుంటూ హోటల్లో ప్రవేశించాడు.

హోటలుదీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. సినిమాజనం ఎక్కువయారు. సాయంత్రం వీధులన్నీ సందడిగానే ఉన్నాయి.

లోపలికి వెళ్ళబోతుంటే బాబురావు ఎదురువచ్చి 'నీకోసమే చూస్తున్నాను మిత్రమా! అర్జంటుగా ఓపాతికరూపాయలు కావల్సివచ్చాయి. నీదగ్గరవుంటేసద్దుభాయీ, నేను మళ్ళీ ఇచ్చేస్తాను. నువ్వు కాదంటే వీల్లేదు. అంటూ రొక్కించసాగాడు.

"నాదగ్గర చిల్లిదమ్మిడీలేదు" అని ఖచ్చితంగా చెప్పేశాడు మల్లిబాబు.

"అలా అంటే పనికిరాదు. పోనీ ఎంత ఉంటే అంత ఇవ్వు."

"కావలిస్తే రేపుఇస్తాను. ఇవ్వాళమటుకు వీలుపడదు."

"ఇవాళే కావాలి బ్రదర్. నామాట ఆలకించు. ఇవి చేతులు కావనుకో" అంటూ బాబూరావు ప్రాధేయపడుతుంటే మల్లిబాబు అనుమానంగా "విషయం ఏవిటో చెప్పు" అన్నాడు.

"తర్వాత చెబుతానుగా"— బాబూరావు భూమ్మీద నిలవటంలేదు.

ఎంత ప్రాధేయపడినా మల్లిబాబు వద్దనుంచి ఒక్క కానీ రాబట్టలేక చివరికి బుర్ర గోక్కుంటూ, "నువ్విలా నిరాశ చేస్తావని అనుకోలేదురా" అని ముఖంమీద చెమట వత్తుకుంటూ జనంలో కలిసిపోయాడు. మల్లిబాబు అలా చూస్తూ నిలబడి పోయాడు.

హోటలు ప్రొప్రయిటరు "నన్ను అడిగాడు సార్. నేనెలా ఇస్తను. ఈ మనిషి సంగతి నాకు తెలియదా?" అన్నాడు.

ఎన్నడూ బాబురావుని చూడని ఒక విచిత్రస్థితిలో ఈనాడు మల్లిబాబు చూశాడు. అతనిముఖం పాలిపోయి వుంది. బట్టలు మాసి ఉన్నాయి. జుట్టు రేగివుంది. మనిషి ఆందోళగా వున్నాడు. దేనికో త్వరపడుతున్నాడు. భయపడుతున్నట్టుగా కనిపిస్తున్నాడు.

మల్లిబాబు వి.స్తరిముందు కూర్చుని 'జీవితం అనుభవించటమంటే ఇదే కాబోలు' అనుకున్నాడు.

(62-వ పేజీ చూడండి)



# మెరీనా తీరాన

**తూలికా భూషణ్**

మహానగరాలలో అనేక తరహాలవాళ్ళు ఉంటారు. మద్రాసులోనూ అంతే.

ఇప్పుడు మనకథకు సంబంధించిన తరహా అన్నిటిలోకీ విశిష్టమైనది. ఈ తరహావారు నారద గోత్రికులు. నారద కుటుంబంవారు. స్థూలంగా 'నారదులు' అనే వ్యవహరిస్తాను.

నారదుడు లోకసంచారి. సంచారమే ఆయన జీవితం. ప్రధానకర్తవ్యమున్నూ. భక్తిఅనేది సంచారానికి హంగు. మద్రాసు నారదులూ సంచారులే. అయితే లోక సంచారులుమాత్రం కారు. కాలేరు. కేవల సాయంకాల సముద్ర తీర సంచారులు. దానిని విహారమన్నా చెల్లును. ఈ తీర ప్రాంతమే 'మెరీనా' పేరుతో విలసిల్లుతున్నది.

ఈ నారదులుకూడా భక్తులే. వారి పరమ దైవం సముద్రుడు. సముద్రనామ స్మరణం తక్క అన్యమెరుగని పుణ్యజీవులు వారు. ఎల్లప్పుడూ సముద్రుని భజిస్తూ, సముద్రుని గాథలు ఆలకిస్తూ పఠిస్తూ విన్పిస్తూ ఇహలోక యాత్ర సాగించే ధన్యజీవులు వారు.

ప్రతిరోజూ సాయంకాలం కాగానే సముద్రతీరప్రాంతం చేరుకొంటారు. ప్రకృతిలో ప్రశాంతత అధికమై సముద్రునిఘోష చెవిని పడబోయేసమయానికి తిరిగి తమ తమ ఆవాసాలు చేరుకొంటారు. ఇది భక్తితో దీక్షతో వారు పాలించేవ్రతం.

* * *

ఆవేళ ఇద్దరు నారదులు సముద్ర తీర ప్రాంతంలో నియమిత ప్రదేశం చేరుకొనే సరికి మరొక నారదుడు గృహోన్ముఖుడైన వాడు వారికి తారసిల్లాడు.

ఒక నారదుని సంబోధించి ఇలా అన్నాడు: "వెంకటీ, నీకోసం ఇంటికి వద్దామనుకొన్నాను. దేవుడులా కనుపించావు. రేపు మా ఇంటికి భోజనానికి రావాలోయ్!"

వెంకటిముఖం వికసించినది. వెంకటి భోజనానికి ఇచ్చేటంత ప్రాధాన్యం సముద్ర భజన తరువాత మరి దేనికీ ఇవ్వడు. అయినా వెంకటి అనుభవజ్ఞుడు. భోజనశాస్త్ర ప్రవీణుడు. ముందు వెనుక చూడకుండా ఏదీ చేయని తలపెట్టని ఆలోచనాపరుడు. పైగా అప్రయత్నలబ్ధమైన భోజనం అనుమాన హేతువేకాని ఆనందకారణం కాదుకదా!

కనుకనే వెంకటి ఆనందాతిరేకాన్ని



రవంతసేపు అణచుకొన్నాడు. "ఏమిటి విశేషం" అని ప్రశ్నించాడు.

"రేపు మా నాన్నగారి తద్దినమోయ్, వెంకటీ. మిత్రులందరినీ ఆహ్వానిస్తున్నాను" అన్నాడు గృహోన్ముఖ నారదుడు.

వెంకటి జీవితనాటకరంగంలో పేరు మోసినవాడు. విచారం అభినయించాడు. తోడి నారదుని నిర్దేశించి చూపుతూ గృహోన్ముఖ నారదునితో ఇలా అన్నాడు: "భోజనం పేరు చెప్పితే నన్ను వదిలించుకోవడం ఎవరికీ సాధ్యం కాదని నీకు తెలుసుకదా! కాని వేణూ, రేపు నా సహచరుడు ప్రసాద్ కుమారుని బారసాల. ఆయన ఇంటికి భోజనానికి వెడుతున్నాను. అందుచేత మన్నించాలోయ్. మరెప్పుడైనా అయితే ఒక్క అంగలో మీ ఇంట్లో వాలి ఉండేవాడిని. నాకు చాలా విచారంగా ఉంది."

మద్రాసు నగరవాసులు ద్వంద్వాతీతులు. వేణు సరిపెట్టుకొన్నాడు. సముద్ర తీర విహార నారదులవద్ద సెలవు తీసుకొని సముద్ర భజన చేస్తూ వెళ్ళిపోయాడు.

అతడు కనుచూపుమేర దూరం దాటిన వెనుక ప్రసాద్ ఉగ్రరూపం ధరించాడు. వెంకటిమీద విరుచుకొనిపడ్డాడు.

"ఒరేయి వెంకటీ. అబద్ధాలాడతావని తెలుసు. నాకు ఆక్షేపణకూడా లేదు. అబద్ధాన్ని సమర్థించేది అవసరం. ఇప్పుడు ఏమి అవసరం వచ్చిందని ఈ అబద్ధం ఆడావో నాకు తెలియడంలేదు. అది విడమరిచి చెప్పు. ఎప్పటికైనా నిన్ను మన్నించగలనేమో చూస్తాను. ఏమైనా గొడ్డు బ్రహ్మచారిని కదా నేను. నాకు ఒక భార్యను సృష్టించావు. ఊరకుండక పిల్లవాడిని కల్పించావు.

# మెరీనాతీరే

వాడికి భోరసాల ఏర్పాటుచేశావు. చాల మట్టు భోజనానికి ఆహ్వానించుకొన్నావు. ఆ భోజనంమాత్రం అసంభవం. ఇది ఖండితంగా చెప్తున్నాను. ఊఁ ఇంక నీ వాదం వినిపించు. న్యాయమూర్తి సిద్ధంగా ఉన్నాడు."

నారదులు ఇద్దరు కూర్చున్నారు. ఆ క్షణంలో ఇసుకలోనుంచి ఉద్భవించినట్లుగా ప్రత్యక్షమైన బ్రాహ్మణ బాలకునివద్ద వేరుగడలుకొని సేవించడం సాగించారు. "ఓ కోన్" ఈపిరితిత్తులు నింపుతున్నది శరీరాలు సైకతంలో లీనమై వ్యక్తిత్వం కోల్పోయినవి. నారదుల సంభాషణఘోష సముద్ర ఘోషను ముంచెత్తుతున్న అమృతఘడియలు అవి.

"తద్దినం భోజనం సర్వత్ర వర్జయేత్ అని నా అనుభవం చెబుతున్నది: పైగా నాకు మూర్ఛ రావచ్చు" అన్నాడు వెంకటి.

"తద్దినం భోజనానికి, మూర్ఛకు సంబంధమేమిటి? ఏమా అనుభవం" అని ప్రశ్నించాడు ప్రసాద్.

వెంకటి చెప్పినది ఇది:

నాకో మేనత్తకూతురు ఉంది. దాని పేరుతో మనకు నిమిత్తం లేకపోయినా చెబుతున్నాను. సుబ్బులు. ముద్దుకు సుబ్బిఅని చిన్నప్పుడు పిలిచేవాళ్ళం.

సుబ్బుల్ని నాకుఇచ్చి పెళ్ళి చేద్దామని మొదట్లో అనుకొన్నారు. నా దురదృష్టం అలాంటిది. సుబ్బులు నాపెళ్ళాంకాలేదు. దురదృష్టం ఏమిటో చెబుతాను. సుబ్బులు జాతకంలో భర్త లక్షాధికారి అవుతాడని ఉంది. ఇప్పుడు ఆ అదృష్టంఅంతా సుబ్బులు మొగుడు శేషారావును వరించింది. సుబ్బుల్ని పెళ్ళిచేసుకొంటే నాజీవితం బాగాఉండేది. లక్షాధికారిని అయినా కాకపోయినా భోజనానికి ఢోకా ఉండేదికాదు. నా బ్రతుకు నిరాఘాటంగా సాఫీగా సాగి ఉండేది. బ్రతుక్కు భోజనమేకదాఆధారం?

సుబ్బులు, మొగుడు చాలాకాలమై మద్రాసు వచ్చేశారు. ఎగ్మూర్‌లో ఉండేవారు.

నాకో ఉద్యోగం దొరికింది మద్రాసులో. వచ్చాను. ఆశ్రయమివ్వడానికి మేనత్తకుమార్తెకన్న అర్హులు ఎవరుఉంటారు. సరాసరి సుబ్బులు ఇంటికి వెళ్ళాను. సుబ్బులు మొగుడు నన్నుచూచి ఆనందించలేదు. నేను ఇంట్లో కాలుపెట్టగానే నన్ను పలకరించనైనా పలకరించకుండా బయటికి వెళ్ళిపోయాడు. అప్పుడు అర్థంకాకపోయినా తరువాత అర్థం అయింది. మద్రాసులో మనుషుల పద్ధతేఅంత. ఇంటికివచ్చిన బంధువులను పలకరించరు, ఉండమనరు. కొన్ని సందర్భాలలో వెళ్ళమంటారుకూడా.




చిత్రకారుడు — శ్రీ జె. సత్యనారాయణ (జగదల్‌పూర్)

సుబ్బులు మొగుడు ఏలాంటి వాడయితే మనకేమి? సుబ్బులు మనదేకదా అనుకొన్నాను. కాని సుబ్బులుకూడా నన్నుచూచి ఆనందబాష్పాలు రాల్చలేదు. నెలవంకలాంటి ముఖం మేఘావృతమయింది. "ఏమిటిపని, ఎన్నాళ్లు ఉంటావు" అని ప్రశ్నించింది నీరసంగా.

పరిస్థితి చూచాను. కోపగించి వెళ్ళిపోర ఉండడానికి ఆస్కారం ఉండదు. నా దగ్గ డబ్బులేదు. మద్రాసులో వసతి ముఖ్యం. వసతి అంటూ ఉంటే ఆ యోగ్యత ఆధారం చేసుకొని భోజనం సంపాదించవచ్చు.

అంతా ఆలోచించినమీదట అలవాటే కనుక అబద్ధమాడాను.

ఏదో కంపెనీలో పెద్దఉద్యోగం వచ్చిందన్నాను. ఉజ్జాయింపుగా జీతం చెప్పాను. అదృష్టవశాత్తు అది సుబ్బులు మొగుడు జీతంకన్న హెచ్చు. సుబ్బులు ముఖంలో అప్పుడు రవంత వికాసం చూచాను. నీరసమూతగ్గింది.

"ఉద్యోగంలోచేరి ఇల్లు చూచుకొనేదాకా మా ఇంట్లో ఉండరా బావా. మరి భోజనానికిమాత్రం హోటల్లో ఏర్పాటు చేసుకో. దగ్గర్లో మంచి హోటల్ ఉందిలే. అక్కడ భోజనం బాగానే ఉంటుంది" అన్నది సుబ్బులు.

బహుశా భోజనం పెట్టకపోయినా ఉండనిచ్చినదికాదని తనవాళ్లు నావాళ్లు ఆడిపోస్తారని భయపడిందేమో సుబ్బులు అనుకొన్నాను.

ఏమైతేనేం నాఎత్తు ఫలించింది. ఉండడానికి ఆస్కారం లభించింది.

జీతంసంగతివిన్నాడేమో ఆతరువాత శేషారావుకూడా ముఖంచాటుచేసుకోవడం మానివేసి నాతోమాట్లాడేవాడు.

ఉద్యోగంలో చేరాను. నెలాళ్ళకే ఏమొచ్చిందో ఏమో అదికాస్తా ఊడింది.

అది మద్రాసులో ఒకసుగుణం. ప్రయత్నించితే ఏదోఒకఉద్యోగం లభించకపోదు. కాని చిరకాలం ఉండదు. ముసాఫిర్ జీవితానికి తగిన తాత్కాలికమైన ఉద్యోగాలు. సృష్టికూడా అలాంటిదేకాదా? శాశ్వతత్వంలో అశాశ్వతత్వం మిళితమై ఉంటుంది. అసలు జీవితమే శాశ్వతంకానప్పుడు ఉద్యోగాలమాట ఎందుకు?

ఉద్యోగం ఆధారంగా ఉండడానికి ఆస్కారం లభించింది కనుక అదిపోతే ఆ ఆస్కారమూ పోతుంది. సుబ్బులుతో నా ఉద్యోగం పోయిన సంగతి చెప్పలేదు. ఆస్కారం దక్కించుకొన్నాను.

భోజనం కరవుఅయినకాలం వచ్చింది. ఏమైనాతిని వారంరోజులు అయింది. నిరుద్యోగానికి నేను తట్టుకోగలిగాను. కాని అకారణం అయినా సకారణమే అయినా ఈనిర్బంధ నిరుద్యోగానికి నాకడుపు తట్టుకోలేకపోయింది. మొదట్లో ఎదురుతిరిగింది. వ్యతిరేక నినాదాలుచేసింది, ఆక్రోశించింది, రోదించింది, కూలిగింది. ఎన్నయినాచేసింది. ఇంతనీరుపోసి ఆ క్రోధాగ్ని చల్లార్చడానికి పూనుకొన్నాను. అది సఫలమైంది. తరువాత

తరువాత కడుపుకు ఒకవిధమైన స్తబ్ధత్వం జడత్వం ఆవహించాయి. అదిదేనినీ కోరేది కాదు. ఆఖరికి తనఉనికి ప్రకటించుకోనడం సహితం మాని వేసినది.

అది ఒకవిధమైన యోగస్థితి. నిరాహారులు మాత్రమే తపస్సుచేసి సాధించగలిగేదిన్నీ. అలాంటిది అదృష్టవశాత్తు నాకు సాధ్యమైనది. పరిపూర్ణంగా అనుభవంలోనికి వచ్చింది.

అయితే మెదడుమాత్రం వేరొకమార్గం అనుసరించింది. పూర్వం రోజుకు కొలది పొర్లుమాత్రమే భోజనం గురించి ఆలోచించేవాడిని. అలాంటిది ఇప్పుడుసర్వకాలసర్వావస్థల్లోను ఆలోచనలు భోజనంచుట్టూ పరిభ్రమించ సాగాయి. భోజనంగురించే కేవలం రాత్రులుకాక జాగ్రదవస్థలో కూడా అనుక్షణమూ కలలుకనే వాడిని.

'ఎప్పటికైనా చేతిలో పుష్కలంగా డబ్బు ఉంటుంది. అప్పుడు వంటవాడిని పెట్టుకొంటాను. తెల్లవారి లేచేసరికి ఇడ్డెన్లు, ముళగపొడి, నెయ్యి, పెసరట్టు, ఉప్మా సిద్ధంగా ఉంచుతాడు. తింటాను. పదకొండు గంటలవేళ నాలుగు కూరలు, నాలుగుపచ్చళ్ళు, పులుసు, చారు, పెరుగు వేసుకొని భోజనం చేస్తాను. అపరాహ్ణం నేయితో వేసిన రవదోసె, వడలు, బజ్జీలు, పకోడీలు తింటాను. రాత్రి మళ్ళీ కూరలు పచ్చళ్ళు, తీపి సరకులు, పెరుగుతో కమ్మని భోజనం చేస్తాను. హోటల్‌కు వెళ్ళి, ఒక్కటే ఆర్డరు వేస్తాను. 'ఏయ్, పెద్దమనిషీ, మీ హోటల్‌లో ఈవేళ చేసిన ప్రతి పదార్థం ఒకొక్క ప్లేటు తీసుకొని రా' అంటాను. అన్నీ తినేస్తాను.

'ఇవికాక బిస్కట్లు చాకలెట్లు కేకులు పళ్ళు పుష్కలంగా తింటాను.

'తిన్న, విన్న, చూచిన, చదివిన, తెలుసుకొన్న ప్రతిపదార్థం తింటాను. అమితంగా తింటాను.

'ఇంక కడుపు మళ్ళీ బ్రతికిఉండగా ఎప్పుడూ తిరుగుబాటు చేయలేనంతగా తింటాను.

'తినడంలో అంతు చూస్తాను.'

ఇలా ప్రతినిమిషమూ ఎన్నో ప్రణాళికలు వేసే వాడిని.

ఇలా ఆలోచిస్తూ రోడ్లమీద తిరిగేటప్పుడు ఆవులు కనుపించేవి. నాకో ఆవు ఉంటే ఎంత బాగా ఉండును? ఎప్పుడు పడితే అప్పుడు పాలుపిండి తాగేవాడిని కదా అనుకొనే వాడిని.

మద్రాసులో ఆవులు ఒక విశిష్టమైన రకానికి చెందినవి. ఎప్పుడుపడితే అప్పుడు పాలు ఇవ్వగలవు. ఇస్తాయి. ఏదిపడితే అది తినగలవు. జీర్ణం చేసుకోగలవు. పాలు సృష్టించగలవు.

మద్రాసులో ఆవులకు ప్రధానంగా కాగితాలు, అట్టలు, సిగరెట్టు పీకలే ఆహారం. వాటిలో గడ్డి అదయినా ఎండురకం సంపాదించుకొంటాయి.

అలాంటి ఆహారంతో పొట్ట నింపుకొంటూ పాలు ఇచ్చి అవి యజమానులకు కొల్లలుగా డబ్బు ఆర్జించి పెట్టుతాయి. కనుకనే యజమానులకు వాటిమీద తగని ప్రేమ. అవి కోరిన ఆహారం పుష్కలంగా ఉచితంగా లభించే జన సంకీర్ణమైన ప్రదేశాలలో ఆ ఆవులను యథేచ్ఛగా తిరగనిస్తారు యజమానులు ఎల్ల వేళలా.

నాకో చిత్రమైన ఆలోచన కలిగేది. మద్రాసు ఆవును అయితే ఎంత బాగుండేది! కాగితాలు అట్టలు చుట్టపీకలు తినేవాడిని కదా. పస్తు అక్కర్లేదు కదా అనుకొంటూ నాదురదృష్టానికి నన్ను నిందించుకొనేవాడిని.

చివరికి ఒక రాత్రి ఏమైనా సరే తినాలని అనిపించింది. ఆరాత్రి భోజనాల వేళ సుబ్బులు ఇంటికి వెళ్ళాను. సమయం కాని సమయంలో తిరిగి వచ్చిన నన్ను చూచి భార్యాభర్తలు గతుక్కుమన్నారు.

కొలదిరోజులుగా నా ఆకారం వాలకం గమనిస్తున్నారు ఆదంపతులు. నా చూపులు ఎప్పుడూ అప్రయత్నంగా వంట ఇల్లుమీద కేంద్రీకృతమై ఉండేవి కాబోలు. ప్రతి రాత్రీ వంటగదికి తాళంవేసి మూడు సార్లు లాగిచూచిన తరువాత కాని నిద్రపోయేవారు కారు ఆపుణ్యదంపతులు.

ఆరాత్రి నేను తిరిగి వెళ్ళే సరికి శేషారావు భోజనం చేస్తున్నాడు. ప్రక్కనే పీట వేసుకొని కూర్చున్నాను, ముద్దలు లెక్క పెట్టుతున్నాను. శేషారావుకు అన్నం సహించలేదు. సుబ్బులుకు చేయి ఆడలేదు. కాళ్ళు తడబడసాగాయి.

"భోజనం చేశావా" అని ఎవరూ అడగలేదు. ఆదంపతులకు నోరు పెగలడం లేదు.

నేనే అన్నాను — "ఈవేళ భోజనం చెయ్యలే"దని.

"హోటల్ ఇంకా మూసెయ్యరు. త్వరగా వెళ్ళిరా" అంది సుబ్బులు.

నేను సుబ్బుల్ని మనస్సులో అభినందించకుండా ఉండలేకపోయాను. అలాంటి విపత్కరమైన స్థితిలోకూడా తీరా భోజనం ప్రసక్తి రాగానే సుబ్బులు నిలద్రొక్కుకొని ధైర్యంగా ఆ పరిస్థితి ఎదుర్కొంది.

"డబ్బులు లేవు" అన్నాను.

శేషారావు మజ్జిగ పోసుకోవలసిన సంగతి మరిచిపోయి చేతులు కడుగుకొన్నాడు. అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

సుబ్బులు నాటికి అభోజనం ఉండడానికి నిశ్చయించిందేమో అన్నం గిన్నె వంటగదిలో పెట్టివచ్చింది.

పైగా "బియ్యం అయిపోయాయిరా, అందుకని మీ అన్నయ్య కోసం మిగిలిన గిద్దెడు ఉడకబెట్టాను, ఇంక పిల్లికి నాలుగు













"మెతుకులు మిగిలాయి" అంది నాతో"

నేను జాగ్రత్తగా చూశాను. చిన్నదే అయినా గిన్నె నిండా అన్నం ఉంది.

ఎంత చెడ్డా సుబ్బులుకు నేను మేనమామ బిడ్డను. పెంపుడుపిల్లి పాటి చేయలేదే అనుకున్నాను.

## మెరినాతీరే!

అంతలో పిల్లి అక్కడికి వచ్చింది. అది కొరుకుతాడని అన్నా అకస్మాత్తుగా పట్టుకున్నాను. పిల్లి నాతో యుద్ధం ప్రారంభించింది.

"చూడు, దీనికి ఒంట్లో బాగాలేనట్లుందే. ఈ రాత్రికి అన్నం పెట్టకు" అన్నాను సుబ్బులుతో—పోనీ ఆ నాలుగు మెతుకులు అయినా నాకు పడవేస్తుందేమోనని.

సుబ్బులు ఆవేశంతో నాలుగు అంగలు వేసి నాచేతుల్లోంచి పిల్లిని ఊడలాక్కుని "నిన్నే

నంలాగుంది. దానికి లేనిపోని జబ్బులు అంటగట్టకు, పుణ్యం ఉంటుంది" అని కసిరి దాన్ని వంట గదిలోకి తీసుకొనిపోయి తలుపువేసేసుకొంది.

పిల్లికి పెట్టిందో లేక తనే తిన్నదో తెలియదు కాని పది నిమిషాలకల్లా బయటికి వచ్చి గిన్నెతోమి కడిగి బోర్లాపెట్టింది.

అప్పటికి కాని నేను అక్కడినుంచి తిరోగమించలేదు.

మొత్తంమీద ఆరాత్రి నాకు భోజనం దొరికిందికాదు.

ఆ రాత్రి అంతా నిద్రలేదు. మరునాటి ఉదయం రోడ్డుమీద పోతున్నాను. నెల్లూర్లి ఉద్యోగంలో సహచరుడు విఠల్ కనుపించాడు. సరిగా ఈవేళ నేను అన్నట్టే అన్నాడు — "మీకోసమే వస్తున్నానండీ. దేవుడిలా కనుపించారు. మా ఇంటికి భోజనానికి రావాలి" అని ఉన్నపళంగా తనతో కూడా రమన్నాడు. మాట్లాడకుండా వెళ్లాను.

తీరా ఇల్లుచేరాక "ఈవేళ మానాన్నగారి అబ్దికం. మీరు భోక్తగా ఉండి ఈ కార్యం సానుకూలం చేయాలి" అని కోరాడు విఠల్. దక్షిణ మిగల్చడానికి నన్ను అన్వేషించాడా ఉత్తముడు. అప్పటికి శరీరంలో ప్రాణంలేదు. భోజనంకోసం అలమటిస్తున్నాను. భోజనం లభించిందన్న ఆనందాతిరేకమో లేక మరి రెండు మూడు గంటలకాలం పరిశ్రమచేస్తే కాని భోజనం లభించదన్న నైరాశ్యమో తెలియదు కాని అకస్మాత్తుగా స్మృతి తప్పి పడిపోయాను.

పాపం నా మూలంగా ఆ ఏడాది విఠల్ పితృదేవతల స్వాగత సత్కార కార్యక్రమం మరొక గంటసేపు వాయిదాపడింది.

అదిగో అప్పటినుంచీ తద్దినం భోజనానికి వెళ్లితే మూర్ఛ వస్తుందేమోనని నాభయం!

* * *

సముద్రునిఘోష వినవస్తున్నది. నారదులు గృహోన్ముఖులైనారు. నాటికి వ్రతదీక్ష సమాప్తమైనది.

ప్రసాద్ లేచాడు. "లేరా వెంకటే ఈ రాత్రి సినిమాకు వెడదాం. రేపు నీకు విందు" అన్నాడు.

వెంకటి తూలిపడిపోయాడు. ★

# ఆహోహా

(23 - [illegible])

పరవశుడై ఆ ఉద్రేకంలో తోలుసంచి క్రింద పడేసుకుని వెతుక్కుని మళ్ళీ ఒళ్లో పెట్టుకుని సిగరెట్ వెలిగించగానే హాల్లో దీపాలు వెలిగాయి.

ప్రసాదరావు నిలబడి పరిశీలనగా హాలంతా చూస్తున్నాడు. తెరకు అటూ ఇటూ పెద్ద బ్రాకెట్లలాంటి డిజైన్లూ. గోడల్లోకి పైకి కనబడకుండా అమర్చిన [illegible] ఎక్కువ ఫాన్లు కలిగి హాలు చాలాబావుంది. జనాన్నందర్నీ అన్నిక్లాసుల్లోవాళ్ళను పరిశీలనగా చూస్తూ ప్రసాదరావు ఒక్కక్షణం నిర్ఘాంతపోయాడు.

ప్రసాదరావులో అకస్మాత్తుగా భయంకరమైన మార్పువచ్చేసింది. మనిషితోపాటు వ్రేళ్లమధ్య సిగరెట్ కూడా 'గతుకులరోడ్డు మీద నడిచే కారు రెంజరులైటు'లా వణికిపోతోంది. అప్పుడేలేచి ఒకరొన్నొకరు రాసుకుంటూ నవ్వుకుంటూ 'కేంటీన్' వైపు పోతోన్న జంటవేపే తీక్షణంగా చూస్తున్నాయి ప్రసాదరావు కళ్లు.

ప్రసాదరావు ఈలోకంలో పడి రేయని గట్టిగా సిగరెట్ దమ్ములాగి సంచితెరచి టోపీతీసి నుదురుముందుకు వచ్చేటట్టు పెట్టుకున్నాడు. నల్లద్దాల కళ్లజోడు పెట్టుకున్నాడు. రుమాలు తీసి కోట్ కాలర్ పైకెత్తి గడ్డం దాకా మూసుకుపోయేలా రుమాలు మెడవెనకనుంచి చుట్టాడు. ప్రసాదరావు కేంటిన్‌కు బయలుదేరాడు.

ఆ జంట కాఫీత్రాగుతూంటే ప్రసాదరావు ఎదురుగా సెటాయించాడు. సిగరెట్ చాలా సీరియస్‌గా పీలుస్తూ నల్లద్దాల్లోంచి ఆ పిల్లవేపే మింగేసేలా చూస్తున్నాడు. వాళ్లు కేరింతాలు కొట్టుకుంటూ వేళాకోళాలాడుకుంటూ కాఫీత్రాగి హాల్లోకి బయలుదేరారు.

ప్రసాదరావు-సర్వర్ "సార్! సార్!" అంటూ కాఫీకప్పుతో వెంటనా వినిపించుకోకుండా చాలా 'రాష్'గా రోడ్డుమీదకువచ్చి ఓరిక్షాలోకూర్చుని 'బకింగ్‌హాంపేట' పోనియ్ అన్నాడు.

బకింగ్‌హాంపేట నాలుగురోడ్ల జంక్షన్ రాగానే రిక్షావాడి కూలిఇచ్చి దిగిపోయి పెద్దపెద్ద అంగలేసుకుంటూ సందులు దాటుకుంటూ ఓ గుమ్మంముందు ఆగాడు. తలుపు తాళంవేసి వుంది.

ప్రసాదరావు ఒళ్లుతెలియని ఆవేశంలో తాళాన్ని ఒక్కసారి గుంజాడు. పరాజయ సూచకంగా తాళంకప్ప-కప్పలా నోరు తెరిచి, ప్రసాదరావుచేతిలోకి ఊడివచ్చింది.

ప్రసాదరావు చీకట్లోనడుస్తూంటే కాలికి కుర్చీతగిలి 'ఖంగ్' మంది మోకాలు. ప్రసాదరావు మస్తిష్కంలో ఆలోచనలు గిరగిరా తిరిగిపోతున్నాయి. నెత్తిమీదటోపీ ఒంటిమీదకోటు; కంటిజోడుఅప్రయత్నంగా జారిపోయాయి. ప్రసాదరావుకు ఆకలి దహించుకుపోతోంది. ఎప్పుడో పన్నెండు గంటలకు తిన్న తిండి. పైగా అతని హృదయం గాయపడి రక్తం ఓడుతోంది. ఇంతవరకూ గంతులో విజితేస్తో హుషారుగా వున్న ప్రసాదరావు కన్నీళ్లు చీకట్లో ఎవరికి కనపడతాయి? కన్నీరుకాదు...ప్రసాదరావు కళ్లల్లోంచి నిప్పులు రాలుస్తున్నాడు.

"ఎంత ద్రోహం?...ఎంతటి వంచన?...ఛీ"

"అబ్బా!"...చీకటిలో...చీకటిలాంటి జుట్టును పీక్కుంటున్నాడు. సిగరెట్ కోసం జేబులో చెయ్యిపెట్టాడు. జేబు ఖాళీగా వుంది.

ఇంతలో "అరే! తలుపులు బార్లా తీసివున్నారేమే" అనే మాటలు, టప్పుమని స్విచ్ వేసిన చప్పుడూ విని బుర్ర పైకెత్తాడు ప్రసాద్.

ప్రసాద్ పైకిలేచాడు. తాగినవాడిలా మతిపోయినవాడిలా — ఎన్నికల్లో నిలబడి ఓడినవాడిలా వున్నాడు.

ప్రసాద్ పరమ భయంకరంగా వున్నాడు. పళ్లు పటపటలాడిస్తున్నాడు. ఏం అఘాయిత్యం చెయ్యబోతాడో, యేమో?...

ప్రసాద్ ఎదురుగా కాంత భయాందోళనలతో నిలబడి వుంది.

కాంత 'కెవ్వు' మనేలోగా ప్రసాద్ "ద్రోహీ!" అంటూ విసురుగా లెంపకాయ వేశాడు. తిరిగి రెండోసారి చెయ్యెత్తేలోగా ఏదో బలమైన హస్తం ప్రసాద్ రెండు చేతుల్నీ విరిచి పట్టుకుంది "ఎవడవురా నువ్వు?" అంటూ.

ప్రసాద్ ఆ వ్యక్తివేపు చూశాడు. అదే మనిషి! కేంటిన్‌లో కాంతతో......అబ్బ!

"ఒరే ద్రోహీ! నీ రక్తం త్రాగుతా— ఇలా ఎంతమందిని నాశనం చేశావురా? అసలు నీ తప్పేముందిలే! భర్త విదేశాల్లో వున్నాడే? ఏమయ్యాడోనని బెంగ లేకుండా......ఛీ! వెధవ బ్రతుకు!" అని పట్టు వదలించుకొని కాంతమీదకు దూకుతున్నాడు ప్రసాద్.

"ఒరే మోహన్! మీ బావరా!" అంటూ ఆనందం, బాధ, దుఃఖం, అవమానం ఇవన్నీ కలిసిన కంఠంతో కాంత కెవ్వుమని కేకేసింది.

"మవ్వా! బావా!" అంటూ ఓ కేక వినిపించింది "ఆ సినిమాలో కాంత ప్రక్కకూచున్న" రీమనుష్య శరీరంలోంచి.

ప్రసాదరావు దిగ్భ్రమ చెందాడు. గుచ్చి గుచ్చి పరిశీలనగా ఆ చెయ్యెత్తు వస్తాదు కేసి గుడ్లప్పగించి చూశాడు.

ఓ క్షణం స్తబ్ధిపోయాడు. "మోహన్!" ఎంత మారిపోయాడు. ఎక్కడా గుర్తుపట్టడానికి వీల్లేనంతగా మారిపోయాడు.

మోహన్ ప్రసాద్ కేసి చాలా సీరియస్‌గా చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

ప్రసాద్ ఎంతగానో సిగ్గుపడిపోయాడు 'తన తొందరపాటు ఎంత విషమంగా పరిణమించింది?'

"కాంతా! నన్ను క్షమించవూ?" అంటూ మోకరించబోయాడు.

"ఛ! అదేం మాటలండీ! మీరొచ్చేశారు నాకదే పదివేలు."

ప్రసాదరావు కాంతను హృదయ పూర్వకంగా కౌగలించుకున్నాడు. ★

# రాశిఫలాలు

**13-7-60 బుధవారం మొదలు**
**19-7-60 మంగళవారం వరకు.**

బంగారుధర వారం ఆరంభంలో మంద, 16, 17 లలో కొద్ది తేజీ, వెండిధర గతవారం కన్నా కొద్దిగామందీ.

పసుపుధరలో పెరుగుదల కనుపిస్తుంది. చెలామణి బాగుంటుంది. వేరుశెనగపప్పు ధర నిలకడగా ఉంటుంది. నూనెధర కొద్దిగా పెరగవచ్చు.

ధాన్యంధరలో చెప్పుకోతగిన మార్పులు ఉండవు. నూవులధరలో తగ్గుదల రావచ్చు.

* * *

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

మీ శక్తిని మీరు తెలుసుకుని చురుకుదనంతో ముందుకు పోగలుగుతారు. వ్యవహార రంగంలో అనుకూలమైన సమయం. ఆదాయం బాగానే ఉంటుంది. శుభప్రయోజనాల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి. అధికారులవల్ల ఆదరణ పొందగలుగుతారు. శిరస్సు సంబంధించిన అవయవాలలో బాధ కలుగగల అవకాశాలున్నవి. బంధుమిత్రులవద్దనుంచి వచ్చే వార్తలు మీ సందేహాలను, ఆందోళనను పెంచుతవి. మీ వాక్చాతుర్యంతో ఎదటివారిని మెప్పించి కార్యభారాన్ని తప్పించుకోగలుగుతారు. 16, 17 తేదీలలో శుభవార్తలు, చిన్న చిన్న కలహప్రసంగాలు, ధనలాభం.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా. రోహిణి, మృగశిర 1, 2 పా.)

న్యాయం మాట్లాడి విరోధం తెచ్చుకోవలసిన సమయం. తిప్పట, దండగ ఖర్చులు పెరుగుతవి. అనేక సందర్భాలలో మీ ప్రయత్నాలు ఫలించక నిరాశచెందే సమయంలో ఇతరుల సహాయం లభిస్తుంది. స్నేహితుల సలహాలను నమ్మి సాహసమైన పనులకు దిగవద్దు. కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా ఉండదు. వృత్తి ఉద్యోగాలలో శ్రమగా ఉన్నా ఓర్పుతో వ్యవహరించి మీ మాటను నిలబెట్టుకోగలుగుతారు. బాహ్య ఆడంబరం పెరుగుతుంది. ఎదురుచూస్తున్న శుభవార్తలు నిదానంగా అందగలవు. 18, 19 తేదులలో ధర్మకార్యాలకై ఖర్చు వ్యవహారఅనుకూలత.

* * *

## మిథునం :

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రస్తుతం మీరు నిరాడంబరంగా కనిపిస్తు ఉన్నతస్థితిని సాధించగలుగుతారు. అందుకుతగినట్లు అన్నిరంగాలలోనూ వాతావరణం అనుకూలంగా ఉంటుంది. ఆదాయం పెరుగుతుంది. సంఘంలో గౌరవం లభిస్తుంది. ఇంతకుముందు ప్రయత్నించి ఆశ వదులుకున్న పనులు తిరిగి ప్రారంభిస్తారు. ముఖ్య విషయాలలో మీతో ఆప్తులమాదిరి ఉంటున్న మనుష్యులే మీ అభివృద్ధికి ప్రతికూలంగా ప్రయత్నిస్తున్నారనే విషయం తెలుస్తుంది. వారాంతంలో అవతలివారు తొందరపడినా మీరుమాత్రం కలహాలకు పోవద్దు. 14, 15 లలో కార్యసిద్ధి, మంచివారి స్నేహం.

> మేషంలో అంగారకుడు, మిథున కర్కాటకాలలో సూర్యుడు. కర్కాటకంలో శుక్రుడు. కర్కాటక సింహాలలో బుధుడు. సింహంలో రాహువు, ధనుస్సులో గురు శనులు, కుంభంలో కేతువు. కుంభమీన మేషవృషభాలలో చంద్రుడు.

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఆలోచించేసమయంలో ఉన్న చురుకుదనం పనిలోదిగినతరువాత కనుపించదు.



ముఖ్యంగా అలసట, మతిమరపు అధికంగా కనుపిస్తవి. అయితే దైవబలంవల్ల మీమాట చెలామణి అవుతూ ఉంటుంది. హోదా, ధనాదాయము పెరుగుతవి. వృత్తి వ్యాపారాలలో ఇతరులసహాయం బాగుంటుంది. కుటుంబంలో అసంతృప్తితో కూడిన ప్రసంగాలు రాగలవు. మీవల్ల ఎప్పుడు తప్పవస్తుందా అని ఎదురుచూచేమనుషు లుంటారు. జాగ్రత్త. అధికారులతో మైత్రి లభిస్తుంది. దూరబంధువులవద్దనుంచి అనుకూల వార్తలు తెలుస్తవి. 13, 14 లలో విలువగల వస్తువులు కొంటారు. మీ పనులలో పొరపాట్లువస్తవి.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

హోదా. ఆడంబరము బాగుంటవి. కాని, ఎప్పుడూ కార్యభారంతో సతమతం అవుతూ ఉంటారు. ఖర్చులుకూడా పెరుగుతవి. ప్రయాణాలు అనుకూలిస్తవి. వ్యవహార రంగంలో స్నేహితులసహాయం అంతగా లభిస్తుందని అనుకోవద్దు. ఏది ఎలాఉన్నా మీ అదృష్టం కలసవచ్చేసూచన లున్నవి. తలవనితలంపుగా జరిగే సంఘటనలు కొన్ని మిమ్ములను క్రమక్రమంగా ఉన్నతస్థితికి తీసుకుని వెళ్లుతవి. శుభపుణ్యకార్యాలు జరుగుతవి. మొత్తంమీద మీ మనస్సుమాత్రం ప్రశాంతంగా ఉండదు. 16, 17 లలో గౌరవం. నూతన ప్రయత్నాలు, అధికారుల స్నేహం.

* * *

## కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

మీ ఆలోచనలకు. పనులకు సంబంధం కుదరకపోయినా చివరకు అనుకూలత పొందగలుగుతారు. ఒకసందర్భంలో మిమ్ములను చూచి నిరసనభావంతో మాట్లాడినవారే మీకు అనుకూలిస్తారు. వృత్తివ్యాపారాలలో అభివృద్ధికరమైన సూచనలు కనిపిస్తవి. వ్యవహారాలు పూర్తిగా పరిష్కారం కాకపోయినా ఉత్సాహకరంగా ఉంటుంది. పిల్లలఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండండి. దూరబంధువులవద్దనుంచి కష్టవార్తలు తెలియగలవు. ప్రస్తుతం ఇతరులకు సలహా ఇవ్వటం గాని, కార్యభారం పైనవేసుకొనటం గాని మంచిదికాదు. 14, 15 లలో వృత్తిలో అభివృద్ధి, సంఘంలో గౌరవం, శుభవార్తలు తెలుస్తవి.

* * *

## తులా:

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా కొన్ని సమయాలలో చెడ్డపేరు తెచ్చుకోవలసి వస్తుంది. సాధ్యమైనంతవరకు విశ్రాంతిగా ఉండటం అవసరం. పెద్దమనుష్యుల అదరాభిమానాలు మాటలలో కనుపించినంతగా క్రియారూపంలో ఉండవు. ఆరోగ్యం సరిగా ఉండదు. చేతికి రావలసిన ధనం నిదానంగా వస్తుంది. సుబ్రహ్మణ్య స్తోత్ర పారాయణం చేసుకోనటంవల్ల మనోధైర్యం, కార్యనిర్వహణశక్తి బాగుంటవి. సభాగౌరవం పొందగలుగుతారు. వారం రెండవ భాగంలో వృత్తిలో చురుకుదనం కనిపిస్తుంది. 18, 19 లలో కారణంలేని ఆందోళన, ధనప్రాప్తి.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

కష్టసుఖాలను సమానంగా చూచుకొంటు మీ గమ్యస్థానాన్ని చేరుకోగలుగుతారు. ఆదాయం కూడా బాగుంటుంది. మీ మాటను అర్థం చేసుకుని మీకు అనుకూలించగల స్నేహితులు లభిస్తారు. వృత్తి ఉద్యోగాలకు సంబంధించిన సందేహాలు తొలగిపోయి ఒక నిశ్చయానికి రాగలుగుతారు. కుటుంబంలో ప్రశాంతమైన సమయం. అనుకున్న పనులు ఆలస్యమైనా సుముఖంగా ఉంటవి. వారాంతంలో మీ ఆరోగ్యం లోపిస్తుంది. ఒక విధంగా జాగ్రత్తపడుతూ ఉంటే మరొక విధంగా ఖర్చులు వచ్చిపడుతవి. 13, 14, 15 లలో మిత్రులవల్ల అనుకూలత, క్రొత్త విషయాలు తెలుసుకోనటం.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పా 1)

ప్రతివిషయంలోనూ బుద్ధి చురుకుగా పనిచేస్తుంది. మీ ఆలోచనలను వెంటవెంటనే కార్యరూపంలోకి తీసుకుని రాగలుగుతారు. అయితే అకస్మాత్తుగా వచ్చే అపవాదులను గురించి భయపడకుండాఉండటం అవసరం. డబ్బు ఖర్చు అయినా ప్రయోజనం పొందగలుగుతారు. మీతో ఉంటున్న మనుష్యులే ఒకానొక సందర్భంలో మీకు వ్యతిరేకం కావచ్చు. అయితే న్యాయం మీ ప్రక్క ఉండటంవల్ల గౌరవం దక్కించుకోగలుగుతారు. ప్రయాణాలు సుఖంగా జరుగక పోవచ్చు. 18, 19 లలో అనారోగ్యం, ప్రయాసతో కార్యసిద్ధి.

* * *

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

ఆదాయంకంటె ముందుగా ఖర్చులు ఎదురుచూస్తూఉండేసమయం. వృత్తి వ్యాపారాలలో అసంతృప్తికరమైనపనులు కూడా పైన వేసుకోవలసి వస్తుంది. ఆరంభంలో కలహాలు వస్తవనే అనుకుంటారు. కాని దైవానుగ్రహంవల్ల అనుకూలవాతావరణం ఏర్పడుతుంది. బంధు మిత్రులవద్దనుంచి శుభసంతోషవార్తలు తెలుస్తవి. పడమర ఉత్తర దిక్కుల నుంచి ధనలాభం ఉంటుంది. అనుకోని ఖర్చులువచ్చి మిమ్మలను తాత్కాలికంగా చికాకు పెట్టవచ్చు. మీ రహస్యాలను ఏ సందర్భంలోను బయటపడకుండా చూచుకొనండి. 16, 17 లలో సుఖభంగం, వృధా ప్రసంగాలు, త్రిప్పట.

* * *

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

వృత్తిఉద్యోగాలలో మీ సమర్థత సమయానుకూలత బాగా ఉపయోగపడుతవి. శక్తికొలది ఇతరులకు ఉపకారం చేయగలుగుతారు. ప్రయాణాలు సుఖంగా జరుగుతవి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. స్వంత మనుష్యులవల్ల కొన్ని చిక్కులున్నా ఈసమయంలో మిమ్మలను బాధించవు. మీకు మీ మిత్రులకు మధ్య విరోధాలు కలిగించే మనుష్యులుంటారు. జాగ్రత్తగా ఉండటం అవసరం. సత్పురుషులతో మైత్రి ధర్మకార్యాలనిమిత్తం ధనవ్యయం చేస్తారు 17, 18 లలో వస్తునష్టం, అసౌఖ్యం, సందేహావార్తలు.

* * *

## మీనం

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

మీ స్వంత పనులకన్నా ఇతరులపనులయందు ఆసక్తి, అధికంగా చూపవలసి వస్తుంది. మీరు యథార్థం మాట్లాడినా కఠినంగాఉండటంవల్ల ఒకరిద్దరు వ్యక్తులతో కలహాలువస్తవి. కుటుంబంలో శుభకార్యాలు జరుగుతవి. మీ స్వంతవృత్తి వ్యాపారాదులలో అనుకున్నంత అనుకూలత కనుపించదు. మీరు ఎవరిని నమ్ముతున్నారో వారివల్లే అపకారం జరిగేసూచనలున్నవి. కాని మీబుద్ధిబలంతో సమర్థించుకోగలుగుతారు. క్రమక్రమంగా ఆదాయం పెరుగుతుంది. సంతానంవల్ల సుఖసంతోషాలు 15, 16 లలో కార్యసిద్ధి, సంఘంలో గౌరవం, క్రొత్తవారి స్నేహం. ★


-దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి,
52/2 గల్లీలాపుదం వీధి,
కథెడ్రల్ రోడ్ మద్రాసు-6.



# వనితాలోకం

## ఎరువు ఇచ్చే పుస్తకాల బరువు

బి. యస్. లక్ష్మి

అప్పుడే భోజనాలయిపోయాయి. శ్రీవారు ఆఫీసుకు వేంచేశారు. మళ్ళీ రెండుగంటల దాకా నాకు తీరిక. పొద్దుటనగా వచ్చి (నాకు చూసేందుకు తీరికలేని కారణంచేత) నన్ను వూరిస్తూన్న "వీక్లీ" తీసుకు "ఈజీ చెయిర్"లో పడుకుని చదువుతున్నాను. "ఏం చేస్తున్నారండీ" అంటూ ప్రవేశించింది ప్రక్కింటివారమ్మాయి జానకి. నే జవాబు చెప్పేలోపలే తిరిగి "కొత్తదాఅండీ" అంది తనే.

పుస్తకము తీసి పేజీ అయినా త్రిప్పకుండానే ఇదేం "విఘ్నం"రా భగవంతుడా! అనుకుంటూనే మాట్లాడకపోవటము సభ్యత కాదుకనుక "క్రొత్తదేనమ్మా, గంటయింది వచ్చిఅన్నాను. ఇంతలో కూరగాయలమ్మి అమ్మగారూ డబ్బులంటూవచ్చింది. వుదయం కూరలు తీసుకుని చిల్లరివ్వలేదన్న సంగతి జ్ఞప్తికివచ్చి డబ్బులు తీసుకువచ్చేందుకు "వీక్లీ" కుర్చీలోపడేసి గదిలోకి వెళ్ళాను. దానిదగ్గిర చిల్లరతీసుకు బయటపడేసరికి పది నిమిషాలుపట్టింది. తిరిగి 'వీక్లీ' కోసం చూద్దునుకదా! అది జానకిచేతులో వుంది.

'ఇస్తావుటోయ్ నేచదవాలి' అన్నాను. 'ఒక్క క్షణమాగండీ కథ మంచిపట్టులో వుంది' అందాఅమ్మాయి పుస్తకముమీదనుంచి తల ఎత్తకుండానే. పావుగంటకు ఆకథ పూర్తయి జానకి నాకు "వీక్లీ" ఇవ్వవచ్చే వేళకు మా శ్రీవారి రాకతో ఆపుస్తకము చేత వుంచుకునే వాళ్ళింట్లోకి వెళ్ళిపోయింది జానకి. అతికష్టముమీద ఆరోజు సాయంత్రానికికానీ నా చేతికి రాలేదావీక్లీ. పెద చదువులు లేకపోయినా "వీక్లీలు", నవలలు చదివి జీర్ణించుకునే అక్షరాస్యత ఈ నాడు నూటికి తొంబదిమందిలో పెరిగింది. దానికి తోడు పత్రికలుకూడా "విజ్ఞానం" 'వినోదం' తగుపాళ్ళలో మేళవించటములో ఈ అభిరుచి మరింత పెరిగింది. ఇంతవరకు వినికని అనందించతగ్గ విషయమే. వచ్చే చిక్కు ఎక్కడంటే ఈ పుస్తకాలన్నీ ఉచితపుస్తక భాండాగారంలో, పొరుగింటి పుస్తకపఠనము చెయ్యాలంటేనే వస్తుంది.

అసలు కొంతమందికి పొరుగింటి పుల్లకూరలా, పొరుగింటి పుస్తకాలుకానీ రుచించవు. స్వంతడబ్బు వెచ్చించి కొనాలంటే అవే చెత్తపుస్తకాలయి వూరుకుంటాయి. అయిదు, ఆరు సంవత్సరాలనాటిమాట. మా ప్రక్క ఇంట్లో ఒకామె ఉండేవారు. నేను క్రొత్తపుస్తకము కొన్నవాసన తగిలేసరికల్లా తయారయ్యేవారామె. వస్తూనే, అదేమిటండీ 'ప్రభా' అచ్చే ఏంబాగుంటుందీ" అనో పత్రికయితే "దానిసాయి పడిపోయిం"దనో పిల్లలపత్రిక అయితే "పిల్లలు చదవాల్సింది పెద్దలకేమిటండీ" అనో భారతిలాంటిదయితే "అందులో కథలుండవని వ్యాసాలయినా సామాన్యులకు అందుబాటులో ఉండవనీ" ఇత్యాది ఏవో "రిమార్కులు" విసిరేవారామె.

భగవంతుడు తన్నన్నా పడతాడుట కానీ భక్తుల్ని అంటే మాత్రం సహించడుట. నా స్థితి కూడా అట్లాగే ఉండేది. నే నభిమానించి కొన్న పుస్తకాలు బాగుండవంటూంటే విని సహించలేక "ఈసారి చదివి చూడండి, ఈసారి చదివి చూడండి" అని ఆమెకా పుస్తకాలిచ్చి చదివించి ఆమె బాగున్నాయని అనాలని తాపత్రయపడేదాన్ని, ఆమెగారు ఎంతో అయిష్టంగా తీసుకున్నట్లు తీసుకునేవారు.

అట్లా అయిదారు నెలలు గడిచాయి. పుస్తకాలుగురించే ప్రక్కవాటాలోంచి మాటలు వినిపిస్తే శ్రద్ధగా విన్నాను. "ఈ మధ్య పుస్తకాలు జోరుగా చదువుతున్నావు. డబ్బు పెట్టే కొన్నావా ఇవన్నీ" అంటున్నారు ఆమెభర్త.

"నేనీ చెత్తపుస్తకాలకోసం డబ్బు వెచ్చిస్తానని మీరెల్లా అనుకున్నారండీ, మన ప్రక్కింటామె లేదూ! ఆవిడవి ఇవన్నీను. ఆవిడ చదువుతూన్న పుస్తకము బాగుండలేదన్నామా, ఆవిడే బలవంతాన మన చేతుల్లో పెడుతుంది ఈ పుస్తకాలు. అసలీ పుస్తకాల కోసం డబ్బు వెచ్చించే వాళ్ళలో ఏదో ఒక 'బలహీనత' ఉండనే ఉంటుంది. ఆ బలహీనతను కనిపెట్టామా ఆ పుస్తకాలన్నీ మనవే." అన్నారామె పెద్దగా నవ్వుతూ. ఆమెతో పాటు ఆమె భర్తగారు కూడా శ్రుతి కలిపారు.

అప్పుడు కానీ మాటలతో గారడీ చేసి నా చేతుల్లో పుస్తకాలు ఎగరకొట్టుకుపోయిందన్న విషయం నాకు స్ఫురించలేదు. ఆమెగారన్నట్లు ఏదో బలహీనత కాకపోతే డబ్బిచ్చికొన్న పుస్తకాలు మీరూ చదవండి అని ఎందుకిస్తాం అప్పు ఉన్నట్లు, అనుకున్నాను. తీసుకున్న పుస్తకాలన్నీ సురక్షితంగా అప్పచెప్పినందుకు ఆమెను అభినందించక తప్పదు.

ఎందుకంటే పుస్తకం వనితా...... అన్నారుకదా పెద్దలు. పొరుగింటి పుస్తకాలతో స్వంత లైబ్రరీ స్థాపించే వారు కూడా ఉన్నారు. మీ ఇంట్లో ఏదేనా పుస్తకము చూసి ఇవ్వమన్నారనుకోండి. అప్పటికి ఆ పుస్తకము మీరివ్వకపోయినా కొంతకాలము వేచి వుంటారు ఓపికగా ఈ రకంవారు. ఆపైన తీసుకువెళ్ళి వారమైనా, పదయినా ఇవ్వరు. ఒకసారి అడిగితే ఆ అబ్బే ఎక్కడండీ అంటూ ఆ పుస్తకం తీసుకెళ్ళాక (చదవకుండా) వచ్చిన ఇబ్బందులన్నీ ఏకరువు పెట్టి, ఇంకా చదవలేదని తేలుస్తారు చివరికి. మరో పదిహేను రోజులు "స్టాక్కా" ఉంచదు. బహుశా ఈపాటికి ఆ పుస్తకము ఎవరికిచ్చిందీ మరచే పోతాము. ఖర్మంచాలక మసగ మసగ్గా ఉన్న జ్ఞాపకంతో అడిగినా "అయ్యో అదేమిటండీ ఆ పుస్తకము అప్పుడే



















ఇచ్చానే, మరిచిపోయారా ఏమిటి? ఎవరికైనా మరపు (వారికి తప్పు) సహజమేలెండి. ఇంకెవరికేనా ఇచ్చారేమో జ్ఞాపకము చేసుకోండి, అంటూంటే అంత రాత్రి కొదంటూ ఈస్నా లక్ష్యపెట్టక మనమే పొరపడ్డామేమో అనుకుని అప్పటికి మెత్త, మెత్త, మెత్త, అంటాము. దానితో ఆ పుస్తకానికి మనకూ ఋణంచెల్లు.

ఏమైనా వుచితంగా పుస్తకాలు సంపాదించటము చదవటముకూడా ఒకకళేనేమో అనిపిస్తుంది నాకు. ఇట్లా ఉచితపుస్తకాలు సంపాదించేందుకు నల్గైదుగురుకలిసి జట్లు జట్లుగా కూడా సహాకరిస్తూంటారుట. నాకు కమలని ఒకస్నేహితురాలు ఉంది. అది పత్రికలు వారం వారం కొనేది. ఇది వాకిట్లోనే చూసిన ఎదురింటి అమ్మాయి నెమ్మదిగా కమలను మచ్చికచేసుకుని ఒకటివ్వండీ నేను చదివి ఇచ్చేస్తాను అని తీసుకునేదిట. అన్నీ ఒక్కసారి చదవలేముకదా అని తను ఇచ్చేదిట. ఇలా కమలదగ్గరినుంచి తీసుకువెళ్లిన పుస్తకాన్ని తన నల్గురు స్నేహితులు వాళ్ళచేత చదివించి తీసుకు వచ్చేదిట ఆ అమ్మాయి. వాళ్లుకూడా తాము సంపాదించిన పుస్తకాలను ఈ అమ్మాయికి ఇచ్చేవారుట. కమలకు చూచాయగా కొన్నాళ్ళకు ఈసంగతి తెలిసింది. దానితోపాటు వాళ్ళనలుగుచేత నాలుకొనిపిస్తే తను కొనేవి అవీ కలిసి అయిదారు పుస్తకాలు చదువవచ్చుకదా అని ఆశించిందిట. ఆ అమ్మాయి వచ్చినప్పుడు "ఈవారం 'పత్రిక' కొన్నారోయ్, అన్నీ కొనాలంటె రెండు రూపాయలు పెట్టాలి నెలకు. నీదగ్గర పుస్తకాలు తీసుకుచదివే, నీ స్నేహితురాళ్ళచేత ఇతరపత్రికలు కొనిపించూ అన్నారు"అందిట నవ్వుతూ. ఆ అమ్మాయి కొనాలేదు. ఇవ్వాలేదు. రెండువారాలు గడచిపోయాయి. ఆనాటిసాయంత్రము ఏమీ తోచక వాకిట గుమ్మంలో నిలుచునివుందిట కమల. ఎదురింటి అరుగుమీద ఆ అమ్మాయి స్నేహితురాళ్లు కూర్చుని మాట్లాడుతున్నారు. వాళ్ళు కమలను చూడగానే "కొరుక్కుతింటామనుకుంటారో ఏమో పుస్తకాలు చదివిస్తామంటే మొహం చూసుకుంటారు అందట ఒకమ్మాయి. "ఇంకా నయం కొందరు పుస్తకాలుపేరుచెప్పి డబ్బుకూడా వసూలుచేద్దామని చూస్తారు" అంది మరొకమ్మాయి. "కోడీ—కుంపటీ లేకపోతే తెల్లారదనుకుందిట వెనుకటికి ఒకావిడ. అయినా అందరూ అల్లాంటివాళ్లే ఉంటారా? ఏమిటి?" అందిట మరో నీసింద్రి.

ఈ మాటలు తననుగురించి అన్నవే అని తెలుసుకుని ఇన్నాళ్లా—ఇచ్చికూడా చెడ్డదాన్ని అయ్యానే అని కళ్లనీళ్ల పర్యంతమయింది కమలకు. తీరా ఇంట్లో అలమారులో చూస్తే ఆ వారమువి, క్రిందటివారమువి "వీక్లీ"లు కనబడలేదుట. నా "దాన"మయింది. ఇక శ్రీవారు మొదలుపెట్టారు కాబోలు ననుకుని ఆయనరాగానే అడిగిందిట.

"ప్రక్కవీధిలో సోమనాధంలేడూ - వాడడిగితే ఇచ్చాను తర్వాత తెస్తానులే" అన్నారుట ఆయన. భూమిగుండ్రంగావుంది అన్న సత్యం స్ఫురణకు వచ్చింది కమలకు. ఆ రోజునుంచి కమలంటే వాళ్ళకు అసహ్యం. తనను చూడగానే ఏదో ఒక సూటీపోటీ మాట విసరకుండా ఉండరు. "పెట్టనమ్మ పెట్టనే పెట్టదు. పెట్టేఅమ్మ కేమొచ్చె పెద్దరోగ" మన్నట్లు కొననివారూ, ఇవ్వనివారూ ఎల్లాగు లేదు 'కొనేవాళ్లకు - ఇచ్చేవాళ్లకు ఏమొచ్చిందో' అనుకోటంలో వింతేముంది?

ఇల్లా రాశానని కొంతమంది పఠితలకు కోపమొచ్చినారావచ్చు. కానీ ఇందులో

# ఎరువుఇచ్చే పుస్తకాల బరువు

నిశ్చయాలు సత్యదూరమైనవిమాత్రము కావు. కాలక్షేపానికి ఓ పుస్తకము అడిగి తీసుకెళ్లటము కూడా తప్పేనా అని అడుగవచ్చు. ఆ కాలక్షేపం ఎదుటివ్యక్తికి బాధాకరము కానంతవరము సమర్థనీయమే. ఉదాహరణకు నా సంగతేచూడండి. నాకు పుస్తకాలంటే అమిత ఇష్టం (కొనలేకానీ-అందరికీ ఇష్టమే మరి). చేతులో డబ్బు ఉంది అంటే ఏదో ఒక పుస్తకము కొననిదే, చదవనిదే నిద్ర పట్టదు. కొనేవరకు ఏ విఘ్నం ఉండదు. చదివేందుకు అన్నీ విఘ్నాలే. ఒకటిరెండు సార్లు అయితే మర్యాదకోసం నా తహ-తహను చంపుకు ఊరుకోగలను. ఎల్లకాలం అట్లా ఊరుకోటము సాధ్యమేనా, అటువంటప్పుడు అంత్య నిష్ఠూరముకన్నా — ఆది నిష్ఠూరమే మేలేమో అనిపించదూ?

మరొక్కసంగతి. అంతా కొనగలిగిన వాళ్ళే ఉంటారా? అటువంటివాళ్లకు ఇక పుస్తకాలు చదివే యోగ్యతలేదా? ఇంతకీ మీ రెవరిని 'అడిగి తీసుకోరా?' అని ప్రశ్నించవచ్చు. నిజమే నేనూతీసుకుంటాను. అసలు కొన్నవారు చదివారన్నాక వారికి మరొక పుస్తకము నా దగ్గిరది ఇచ్చి తీసుకుంటాను. ఒకవేళ వాళ్లివ్వకన్నా నేను బాధపడి వాళ్ళమీద అభాండాలు వెయ్యను. వాళ్లు డబ్బుపెట్టి కొన్నప్పుడు (ఉచితంగా) నా కెందుకివ్వాలి? అనుకుంటాను — ఇక పుస్తకాలు కొనాలి అంటే మా దగ్గిర డబ్బు లేదు అనేవారే పువ్వులకు – దారాలకు – పూసలకు-గాజులకు ఆడవాళ్ళూ-సినిమాలకు హోటళ్ళకూ మగవాళ్ళూ ఎంతలేదన్నా నాల్గూ-అయిదూ ఖర్చుచేస్తూనే ఉంటారు. ఆ విలాసాల్లో ఏఒక్కదాన్ని తగ్గించినా ఒక పత్రికకు చందాదారులం తేలిగ్గా కావచ్చునే, అట్లా నల్గురు సహకరిస్తే నాల్గు కాల పత్రికలు తెప్పించుకు చదవవచ్చు, అప్పుడు ఎవరికీ కష్టమనిపించదు. కానీ ఇంతోటి పుస్తకాలకు ఈ డబ్బు ఖర్చు చేసేదేమిటిలే అన్న నిర్లక్ష్యం ఎక్కడో అక్కడ సంపాదించి చదవలేకపోతామా అన్న ధీమా. మనల్ని నెలకు ఒక్కరూపాయి కూడా ఖర్చుపెట్టనీయదు.

ఇలా ఒక్కరూపాయి కూడా ఖర్చు పెట్టలేక కుంటిసాకులు చెప్పే మనము ఎదటివారు కొని విధితప్పకుండా దానం చెయ్యాలనుకోటం. హాస్యాస్పదమే మరి, ఈ వ్యాసం వ్రాయటము మరొకరిని విమర్శిద్దామని కాదు. ఈ ఆధునికయుగంలో మనిషికి తిండి ఎంతఅవసరమో! మెదడుకు కూడా విజ్ఞానం! వినోదం అందించే పుస్తకపఠనము అంతముఖ్యం. అటువంటి వినోదాన్ని, విజ్ఞానాన్ని అందించటములో ఈనాడు వెలువడే మాస, పక్ష, వారపత్రికలు, దినపత్రికలు ఎంతయినా ముందంజ వేస్తున్నాయి. వాటికోసం నెలకు రెండో, మూడో వినియోగించటము వృధాకాదని గుర్తించి, మనము చెల్లించే ఋణము, పణము సరస్వతీదేవి పాదాలకు పుష్పాంజలే ననుకుని ఇంటింటా వాడ వాడలా చిన్న-చిన్న పుస్తక భాండాగారాలు నెలకొల్పి తమ ఇళ్లు, వీధులు, (ఊళ్లు) ఈర్ష్యలకు, అసూయలకు తావులేని విజ్ఞాననిలయాలుగాచేసుకోవాలనే నావాంఛ. సహృదయులు ఒక్కరు ప్రయత్నించినా "సరస్వతీ" దేవికి "చేయూతే" అవుతుంది. అప్పుడు నాయీవ్యాసం కూడా శుద్ధదండుగ కాదు. 



దిండుగలేబు డిజైన్

—'శ్రీను'

# వనితా వాణి

## స్త్రీలూ - పురుషులూ

22-6-60 వారపత్రిక 'వనితాలోకం'లో ఎ. నాగలక్ష్మిగారు వ్రాసిన "స్త్రీలు, పురుషులూ" వ్యాసం చాలా బాగున్నది. ఇటువంటి వ్యాసములు వనితాలోకం గ్రహించి ఆచరణలో పెట్టుటకు కృషి సల్పుచున్న ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ప్రశంసనీయమైనది. నాగలక్ష్మిగారు వ్రాసిన వ్యాసం చక్కగా పోలికల పోకడలలో సత్యములను వ్రాసినారు. కాని ఆడవారికి అసలు చదువు అవసరం లేదు అన్నట్లు వ్రాశారు. అది కొంచెం ఆక్షేపణగా ఉన్నది. వారికి లోకజ్ఞానం కొరకు కనీసం బయటి ప్రపంచం పోకడ గమనిక కొరకయినా కనీసం ఉన్నత విద్యలు గాకున్నా కొద్ది చదువులు (హైస్కూలు) ముఖ్యమని భావిస్తున్నాను.

వి. బాల (అవుటపల్లి)

* * *

"ఆంధ్ర సచిత్ర వారపత్రిక" రికార్డుల సెట్టులోని "స్త్రీలు- పురుషులు" అనే నాగలక్ష్మిగారి నాగస్వరపు ప్లేటు చాలబాగుంది. ఎన్నిసార్లు విన్నా (చదివినా) విసుగు జనించటం లేదు. ఈ వ్యాసాన్ని అర్థం చేసుకుని అనుసరించిన వారికి కాపురంలో కష్టాలు కల్ల, సుఖాలు కొల్ల.

ముదునూరు హేమలతాదేవి.
(హైదరాబాదు)

* * *

22-6-60 వారపత్రికలో 'వనితాలోకం'లో ఎ. నాగలక్ష్మిగారు వ్రాసిన "స్త్రీలు - పురుషులు" అనే వ్యాసంలో నిజంగా ప్రస్తుతము మన దేశంలో ఉన్న పరిస్థితులను బాగా వర్ణించారు. ముఖ్యంగా స్త్రీకి వివాహం అయిన తరువాత పెరిగే బాధ్యతలను ప్రస్తుతం మన స్త్రీలు అవలంబించుచున్న పద్ధతులను చాలా చక్కగా వ్రాశారు. వారికి ఆంధ్ర సచిత్ర వారపత్రిక ద్వారా నా అభినందనలు తెలుపగోరుచున్నాను.

గన్నవరపు నూర్యం.
(ఖిలాయత్‌నగర్)

## సరళ సలహా

22-6-60 సంచికలో ప్రచురించిన సరళగారి సలహా ఎంతో బాగుంది. క్రొత్తగా పెండ్లి అయి తీయని కలలతో కాలం వెళ్ళబుచ్చే క్రొత్త జంటలు మూఢమి, ఆషాఢాల పట్టింపులు బట్టి ఎంతో క్రుంగిపోవలసి వస్తుంది. ఈ అత్యాచారాలను అరికట్టాలి.

కె. సత్య,
(నాగార్జున సాగర్ డాం)

## గృహపరిపాలనం

22-6-60 పత్రికలో మాటా...మంచి అనే వ్యాసం చాలా బాగుంది. నేటి గృహిణులు నేర్చుకోవలసిన పద్ధతులు ఈ వ్యాసంలో చాలా ఉన్నాయి. ఇటువంటి వ్యాసాలు. వ్రాస్తారని మీ వారపత్రికకు స్వాతి వర్షానికి ముత్యపుచిప్పమాదిరి ఎదురు చూస్తూ ఉంటాము.

ఈ వ్యాసం వ్రాసిన జయంతిగార్కి నా ధన్యవాదాలు.

రు. గా. దే. వీరమ్మ (శ్రీరంగాపురం)

## ఇంటింటా చిన్నతోట

29-6-60 ఆంధ్ర సచిత్రవారపత్రికలో చిత్రగారు వ్రాసిన "ఇంటింటా చిన్నతోట" వ్యాసం చాలా బాగుంది. మొక్కల పోషణ నుంచి వాటికి కావలసిన ఎరువులవరకూ చక్కగా సున్నితమగు శైలితో వర్ణించి మహిళలకు అర్థమయ్యేలాగ వ్రాశారు. మొక్కల పోషణ అందరికీ అవసరమైనదే. ఇలాంటివే ఇకముందుకూడా వారికి తెలిసినవి వ్రాసి ఇతరు లందరికీ తెలియచేయుదురని కుతూహలపడుచున్నాను. మీ పత్రిక ద్వారా రచయిత్రికి నా కృతజ్ఞతాభివందనాలు తెల్పుచున్నాను.

మైనూరు కుసుమాంబ (తాడేపల్లిగూడెం)

## పిలలూ.... పెంపకాలూ

ది 29-6-60 లోని సోదరి సత్యవతి వ్రాసిన 'పిల్లలూ ... పెంపకాలు' అనే వ్యాసం చాల బాగున్నది ఇంటిలోని అత్తకోడళ్ళు భార్యాభర్తలు వీళ్ళ ద్వేషము వల్ల ఒకరికొకరు ఇచ్చుకొను గౌరవము చూసి ఆయింటిలోని పిల్లలు వారికం [illegible] ఘనులగుదురు. తల్లిదండ్రుల అశ్రద్ధవల్ల పిల్లలు చెడిపోవుదురు. ముఖ్యముగా తల్లులనుబట్టి తల్లుల ప్రవర్తనుబట్టి పిల్లల నడవడియుండునని సోదరి చెప్పినది పైన చెప్పిన విషయములు నిజము. ఇటువంటి వ్యాసములు చూసి పిల్లలను కని పెంచు ప్రతి తల్లిదండ్రులు జాగ్రత్త పడుదురు. ఇటువంటి వ్యాసములను వారపత్రికలో ఇంకా ఎక్కువగా ప్రకటింతురని నమ్ముచున్నాము.

యస్. యల్లమందయ్య (శిరంగిపాలెం).

## ఉత్కళ మహిళల ఆచారాలు

వనితాలోకంలో ఉత్కళమహిళల ఆచారములపై ఎ. శ్రీదేవిగారు వ్రాసిన వ్యాసము చదివాను. ఆమె పట్టణములలోని స్త్రీలను తీసుకొని ఆ వ్యాసము వ్రాశారని తలుస్తాను. నేడు ఉత్కళమహిళలు నాగరికతకు అలవాటుపడి క్రొత్తగా కొన్ని అలవాటులను లోనగుచున్నారు. ఓఢ్రులలో ముఖ్యముగా ఎక్కువమంది 'గుడాకు' వాడుతారు. ఈ విషయం శ్రీదేవిగారు మరచిపోయారేమో.

ఆమె వ్రాసినట్లుగా మనము వాళ్ళనుండి చాలా నేర్చుకోవలసియున్నది. ఈ వ్యాసము వ్రాసినందుకు ఆమెకు నా అభివందనములు.

బి స్నేటి జోగేశ్వర్, (సంబల్‌పూర్.)

* * *

వనితాలోకంలో ఇరుగు పొరుగు అనే శీర్షిక కొనసాగిస్తే బాగా నేఉంటుంది. కాని ఈ విషయములో రచయిత లేక రచయిత్రి అతిజాగ్రత్తగాఉంటే మంచిది. ఏమంటే ఇది ఒకజాతికి సంస్కృతికి సంబంధించినది. ఉదాహరణకు మీ 15-6-60 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "ఉత్కళమహిళల ఆచారాలు"లో కొన్నిచోట్ల పొరపాటుపడ్డారు ఆ వ్యాస రచయిత్రి. ఉదాహరణకు 5, 6 ఏళ్ళ పాపాయిలదగ్గరనుంచి ఇద్దరు ముగ్గురు బిడ్డల తల్లులయేవరకు అంతా రెండు జడలు వేసుకొంటారు. (గుజరాతీవాళ్ళు వితే అయి ఉండొచ్చు) టీ నాడకముగూర్చి పూర్వాచారముగా ఉల్లేఖించేరు. (వారి ఆచారము రచయిత్రి ఒకచోట చెప్పిన తరవాతి వాచకమే.) అప్పడాలు వత్తడము (అవి వాగు తినడంకూడా తక్కువే, కారణం కారం.) నేను ఒరిస్సాలో పుట్టింది మొదలు ఆ విషయాలు నేను చూడలేదు. వారు బెండలకు "గర్యా" అంటారుగాని గరా అనరు. ఇక వారి తిండి విషయములో రచయిత్రి అసలు సంగతే మరిచారు. తమిళులకు సాంబారు, ఆంధ్రులకు గోంగూర లా ఓఢ్రులకు గుమ్మడికాయ (ఒరియాలో బొయితాల్) అంటారు. వారికి దీనిమీద, ఎంత ప్రీతి అంటే, ఆ కాయ నేగాక దాని (తీగ) ఆకును, పూవునుగూడ కూరగా చేసుకొని తింటారు.

★

వి హెచ్. శాస్త్రకళావు, (రాయఘడ.)

# 1

ఈ రాత్రే లక్ష్మి పెళ్లి. జాలి పెళ్లి! బ్రహ్మాండంగా లైట్స్ అరేంజ్ చేస్తున్నాడు సన్యాసిరావు. హడావిడిగా తిరుగుతూ పనివాళ్ళకు పనులు పురమాయిస్తున్నాడు. బంధువులు చాలామంది అప్పటికే వచ్చేశారు. టిఫిన్, కాఫీ సేవించి పేపర్ చదవడంలో నిమగ్నులయ్యారు కొందరు పెద్దలు. పందిట్లోని స్తంభాలచుట్టూ తిరుగుతూ ఆడుకొంటున్నారు పిల్లలు. బాజా, భజంత్రీ "వాయింపు"గాళ్లు ఏదో సినిమా పాటను యింపుగా వాయిస్తున్నారు.

"యువకులకు ఈ "పెళ్లిళ్లు" (పెళ్లి + ఇళ్లు) వారి జీవితంలో క్రాస్‌రోడ్స్ లాంటివి. దూరబంధువులు, స్నేహితులు ఎంతమందో వస్తారు. క్షణంలో "దగ్గిర" వారవుతారు. తిరిగి "దూరం"గానే వెళ్లిపోతూవుంటారు. కొన్నాళ్ళవరకు కలల కాంతిలోకంలో వారు "సిల్హౌట్ బొమ్మల్లా" కదులుతూ, విస్మృతి తెరలవెనుక విలీనమవుతూవుంటారు......' ఆలోచనలో పడిన సన్యాసిరావును అలా వొదిలివేద్దాం కాస్సేపు.

సన్యాసిరావునుగూర్చి చిన్న బయాగ్రఫికల్ నోట్,—

'స్వహస్త కథారచయిత' నంటాడు సన్యాసిరావు. [కాపీకొట్టేవారంతా సన్యాసులని, తనొక్కడే స్వంతంగా ఆలోచించి కథలువ్రాసే సిసలైన సన్యాసిరావునంటాడు. పోనీ! ఒప్పుకొందాం.] ఉత్త ఊహాజీవి అతడు. ఒక కవిరాజు 'శశికళ'ని, మరొక కవిసామ్రాట్ 'కిన్నెరసాని'ని సృష్టించుకొన్నప్పుడు తనేనా సృష్టించలేనివాడు? ఒక "దివ్యకథాసుందరి" అతనికీ వుంది. ఆమెను వర్ణనా సౌరభంతోనూ, భావనా కుసుమాలతోనూ అలంకరిస్తాడు. ఈ విధంగా అతని జీవితం 'సారంగ్'లా గడచిపోతోవుంది.

ఆలోచనల్లో పడిన సన్యాసిరావు తేరుకొని చుట్టూచూశాడొకసారి. వెలుతురుపోయి చీకట్లు క్రమ్ముకొస్తున్నాయి. లోపలికిపోయి మెయిన్ నొక్కా[illegible]దరంతా ఒక్కసారి స్వర్గంలా దేదీప్య[illegible] వెలిగింది. కాని ఆ లైట్లన్నిటినీ కాలదన్ని ధవళిమతో ఒక అప్సరస, ఒక 'శశికళాదేవి' ప్రత్యక్షమైంది పందిట్లో. సన్యాసిరావు కొద్దిక్షణాలు మూర్ఛపోయాడు. ఆమె చిరునవ్వుల అమృతవర్షానికి తేరుకొని మళ్ళీ ఆమెవంక చూశాడు. ఈమె తప్పకుండా ఏ కావ్యసుందరో అయివుంటుంది. దారితప్పి ఇలా వచ్చింది. ఆహా! ఏమి సౌందర్యం! విశ్వసౌందర్యానికి నిర్వచనంలా ఘనీభవించి నిలచిన ఈమెను పలుకరిస్తే కలలా కరిగి మాయమై పోతుందనే భయంతో సన్యాసిరావు ఆమెను పలుకరించలేదు. (పలకరించె ధైర్యం ఏదీ?) చూడానికి చాలా ఎడ్యుకేటెడ్ లేడీలా కనిపిస్తోంది. ఆమెను ఎలా సంబోధించాలో అతనికి అర్థంకాలేదు.

"ఏమండీ" అంది ఆ సముజ్వల సౌందర్యరాశి.

ఎక్కడో కొన్నివేల కోయిలలు కూసినట్లయిందతనికి. హృదయాన్ని తేనెలో ముంచినట్లైంది. 'ఎందుకన్నట్లు' ఆమెవైపు చూశాడు.

"లక్ష్మి ఎక్కడవుందో కాస్త చూపిస్తారా?" అంది తిరిగి ఆమె. ఓహో ఈమె లక్ష్మి స్నేహితురాలై వుంటుంది. తనకి ఒక కాలేజీ ఫ్రెండ్ వుందని, చాలామంచిదని, ఎవరితోనైనా సరే హృదయమిచ్చి (అదే తనకు కావలిసింది) మాట్లాడుతుందని, ఈమె ఈ పెళ్ళికి తప్పకుండా వస్తుందని లక్ష్మి నిన్నటివరకూ చెప్తూనే వుంది. ఆ సంగతే మర్చిపోయినందుకు తన్ను తాను కసి తీరా తిట్టుకొన్నాడు.

"తప్పకుండా, రండి లోపలికి" అని ఆమెను ఆహ్వానించాడు. ఈ ఊర్వశి తనవశమైతే...ఒక భావం మనసులో ఊరింది. హృదయం పురివిప్పింది. జీవిత 'మెయిన్‌రోడ్'మీద ఆశా 'స్ట్రీట్ లైట్లు' వెలిగాయి.

## కొప్పర్తి యజ్ఞన్న, సత్యేంద్ర

దూరంగా లక్ష్మి ఆమెనుచూచి పరుగెత్తుకొని వచ్చింది.

"హల్లో! రాధా! వచ్చావా, నాకు తెలుసు నీవుతప్పకుండా వస్తావని! ఇలా కూర్చో! ఏవిటి విశేషాలు?"...అంటూ కబుర్లలో పడిపోయారు వాళ్ళు.

రాధ! అబ్బ! ఎంతచక్కటిపేరు. పేరుకు తగ్గ అందం. ఆమె రాధఅయితే తను సన్యాసి...సన్యాసి రావేమిటి? ఆపేరు పెట్టిన తల్లితండ్రులను తలచుకొని ఒకక్షణం దుఃఖించాడు. తనపేరు 'కృష్ణ' అని మార్చుకొంటే రైట్...బావుంది. ఈసారి ఆమె తనపేరడిగితే అదేచెప్పాలి. ఆమె తిరిగి తనతో మాట్లాడుతుందా! ఆ అదృష్టం తనకువుందా అని అనుకొన్నాడు సన్యాసి...కాదు...కృష్ణ. కొంచెం స్మృతికలగగానే తను ఆడవాళ్ళమధ్య వున్నట్లు గ్రహించి, సిగ్గుపడి, ఇంకా అక్కడేవుంటే తను 'సార్థక నామధేయు'డవుతాడని భయపడి మెల్లగా బాధగా అక్కడినుండి వసారాలోకి వచ్చి కూలబడ్డాడు. పందిట్లో లైట్లు వెల వెల బోతున్నాయి. ముహూర్తం ఇక రెండు గంటలే వుంది. ఆమె ఒకరోజు ముందు వచ్చివుంటే ఎంత బావుండేది! ఆమెతో

"ఓరేయ్ నువ్వు పెద్దవాడివా? ఇసుక రేణువు పెద్దదా"

"ఏడ్చినట్టుంది ప్రశ్న. చెట్టంత మనిషిని..."

"చవటా ఇసుకరేణువు వయస్సులో నీ వయస్సు ఎన్నోవంతురా?"

—రాజులపూడి నరసింహారావు,
నర్సాపురం.

ఎలాగో కొంచెం 'గట్టి' పరిచయంచేసుకొని తన కథలు (అచ్చుఅయినవేలెండి) ఆమెకి చూపించి వుండేవాడు. ఏమంటే పనివుందని ఆమె ఇప్పుడు వచ్చింది. అతనిబాధకి అంతే లేదు.

# 2

సన్యాసిరావు కోరి 'కల' లో ఒకటి (ఆమెతో మళ్లీ మాట్లాడడం) సఫలమైంది. ఆమె వసారాలోకి వచ్చింది. అతను కుర్చీలోనుంచి లేచి నిలబడ్డాడు. ఒకసారి పత్రికని ఇవ్వమని అడిగింది. వెంటనే ఇచ్చేశాడు రావు. ఇదే మంచి అవకాశం, మళ్లీ రాదని అనుకున్నాడు. ఆమెతో ఎలా సంభాషణ ప్రారంభించాలో తెలియక, తెలిసినా ఆమె పేరే అడిగాడు. ఆమె జవాబు చెప్పింది. తన పేరు అడిగింది. వెంటనే 'కృష్ణ' అని చెప్పేశాడు. ఆమె కిల కిలా నవ్వింది.

అతనివళ్లు పులకరించింది ఆనందాతిరేకంలో. పేరులు కలిశాయని ఆమె నవ్వివుంటుందని ఆ మాత్రం గ్రహించలేడా కథారచయిత!

"ఏమండీ! మీకు కథలంటే యిష్టమేనా?" అన్నాడు ఆమెను 'ఫీల్డ్'లోకి లాగాలని.

"ఊఁ" అంది పత్రికలోంచి అతనివంక చూస్తూ. "మీ కెవరైనా అభిమానరచయితంటూ ఒకడు...అంటే ఎవరి రచనలైనా మిమ్మల్ని బాగా ఆకర్షించాయా?" అన్నాడు రావు.

"ఊఁ" అంది ఆమె. 'ఏవిటీ హార్డ్‌హేండ్ భాష' అనుకొన్నాడు రావు. "ఎవరో ఆ అదృష్టవంతుడు?" అన్నాడు రావు.

"సన్యాసిరావు కథలు అంటే నాకు చాలా యిష్టమండీ" అంది. ఆ కోమల కంఠం. పాపం! సన్యాసిరావుకి ఆ క్షణంలో గుండె, ఊపిరితిత్తులా ఆగిపోయాయి. మనస్సు 'స్పుత్నిక్'లా గిర, గిరా తిరిగిపోతూవుంది. తన రమ్య కార్యాలకు ఆమె మాటలు భూకంపంలా పనిచేసాయి. 'ఛీ! ఎందుకీ బ్రతుకు' అని వల, వలా ఏడ్చాడు

# నవకృష్ణలీలలు

లోపల్లోపల. ఆమె మాటల్తో మళ్లీ తేరుకొన్నాడు.

"మీకు నచ్చవా అతనికథలు?" అంది ఆమె.

"ఎందుకు..." యిక మాట్లాడలేక అక్కడ్నుండి వెళ్లిపోయాడు.

పెళ్ళి అయిపోయింది. ప్రొద్దున్నే రాధ వెళ్ళిపోయింది. రావు దిగులుగా మంచం మీదనుండి లేవలేక పీడకలలతో మూలుగుతున్నాడు. రాలిపోయిన నక్షత్రాన్ని పైకిచేర్చడం అసంభవం. అబద్ధమాడేశాడు. యిక ఆమెకు నిజంచెప్పి నమ్మించలేడు. ఆమెను ఇక చూడలేక తనగదిలోనే వుండిపోయాడు రావు.

* * *

## 3

సన్యాసిరావు పెళ్లిచూపులకు వస్తున్నాడని మురిసిపోయింది రాధ. తనొక కథా రచయిత భార్య కాబోతున్నాననే గర్వం ఆమెకు కలిగింది. కాని ఎంత చెరిపివేద్దామన్నా మనోఫలకంమీద ఆ 'కృష్ణరూపం' చెరిగిపోవుటలేదు. అతనిఅందం, మాటకారితనం ఆమెని మరిపించి మురిపింపచేసాయి ఆనాడు పెళ్లిలో' ఆ మధుర స్మృతిని ఎలా మరవడం? 'ఒకవేళ అతనిని ప్రేమిస్తున్నానా!' అనే సందేహం కూడా కలిగింది రాధకు. కాని తప్పదు, అతన్ని మరిచిపోవాలి. ఎటూ నిర్ధారణ చేసుకోలేక ఆమె హృదయం నిస్సహాయంతో ఘోషించింది. రోజులు జరిగాయి. పెండ్లికొడుకు, తండ్రి రానేవచ్చారు. రాధవచ్చి పెళ్లికొడుకుముందు తలవంచుకొని కూర్చొంది. అతన్ని చూసే...ఒకవేళ అతను అందగాడు కాకపోతే తను ఎంతనిరాశ పొందాలో! అందంగా కథలు అల్లే ఈ రచయితలు అందంగా (సాధారణంగా) వుండరని ఆమె పిచ్చినమ్మకం. ఆమె అతనిని చూడలేదు. చూపులవగానే పెండ్లికొడుకు పాడమన్నాడు. రాధ ఆశ్చర్యపోయింది. ఆగొంతు ఎక్కడో విన్నట్లుగుర్తు. హృదయం ఎంత అరిస్తున్నా చూడాలనే కోరికని బలవంతంగా అణగద్రొక్కింది.

పెళ్లివారు వెళ్ళినారు. తరువాత ఒక వారానికి వారిదగ్గరనుండి ఉత్తరం వచ్చింది. పెళ్లి కూతురు నచ్చిందని, పెళ్ళికి ముహూర్తం నిశ్చయము చేస్తున్నారని. ఒకవైపు కథారచయిత భార్య కాబోతున్నాననే 'ఆనందం', మరొకవైపు తనమనస్సులోని 'అతనికి' దూరమవుతున్నానే అనే వేదనా—ఆమె విజయవంతంగా 'ఆనందం' వేపే నడచింది.

## 4

పెళ్లయిన తరువాత శోభనంగదిలో... రాధ పట్టుపరుపుమీద తలవంచుకొని కూర్చొంది. ఎంత సేపటికీ ఆమె తల యెత్తటంలేదు. పోయిన స్వర్గం తిరిగి లభించిందనే సంతోషంలో తేలిపోతున్నాడు 'కృష్ణ'. (రావు పేరును మనమూ వదిలివేద్దాం). జరిగినదంతా అతనికి ఒక కథలా, తీయని కలలా మనోనేత్రానికి కనిపిస్తోంది. ఆనాటి ఆ రాధ ఎవరో? ఈనాటి ఈ రాధ తన ఆరాధనా దేవత. ఒకనాటి ఊహాసుందరి యిప్పుడు కళ్లెదుట దివ్యకాంతులతో ప్రత్యక్షమయింది. అమృతం నిండిన ఆ బంగారు కలశాలు తనవి, రాగరంజితమైన ఆ గులాబీ పెదవులు తనవి, అనే ధైర్యంతో ఆమె దగ్గరగా వెళ్ళాడు. ఆమె ఉలిక్కిపడింది – ఆమె ఆలోచనల గొలుసు తెగినట్టుంది.

"రాధా!" అన్నాడు మృదువుగా, నీలిమేఘాలవంటి ఆమె కురులు సవరిస్తూ. ఆమె హృదయం మంచులా కరిగిపోతూ వుంది. ఆమె ముఖము చేత్తో పైకి ఎత్తాడు. ఆమె కన్నులు మూసుకొనే వుంది.

"ఏం! నావైపు చూడకూడదా?" అన్నాడు కృష్ణ ఎక్కడో దూరాలలోకి చూస్తూ.

మెల్లగా, బరువుగా కన్ను తెరిచింది రాధ. ఆశ్చర్యార్థకంగా పెట్టిన ఆ ముఖమును చూచి తెల్లబోయాడు కృష్ణ. ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పోయిన రాధ కొన్ని క్షణాలు మాట్లాడలేకపోయింది. తరువాత అతని కౌగిలిలోకి వాలిపోయింది.

* * *

"కథ ఎలావుంది?"

"కథా!"

"అవును, మన జీవితం కథలా లేదూ! వాస్తవిక సంఘటనలతో కూడిన ఒక అద్భుత కథ అది. ఒక మధుర స్వప్నం. ఈ కథకి కథానాయకురాలు నువ్వు. కథానాయకుడు నీ కృష్ణ."

"మరి రచయిత ఎవరూ?"

"నేనే!"

"అంటే, కృష్ణా లేక......" ఆమెకి అడ్డువస్తూ,

"సన్యాసి రావనే పేరు నేను యిక పెట్టుకోను. యివాళనుండి నేను కృష్ణ, నీవు రాధ. వింటావు?" 

# పారిపోయిన శవం!

బొమ్మల కథ
బి.వి.సత్యమూర్తి

















# విశ్వాసంగల కుక్క

ఎ. శ్రీరాములు

ఒక ఊరిలో గంగయ్య అనే రైతుండేవాడు. అతనికి గొఱ్ఱెలు చాలా వుండేవి. అతనివద్ద ఒక ముసలికుక్క వుండేది. అది యెంతో విశ్వాసంతో తన యజమానికి సేవచేసింది. గొఱ్ఱెలకాపలాలో తన యజమానికి సహాకారిగా వుండేది. గంగయ్య యింటిని దొంగలబారినుండి అనేక మార్లు రక్షించింది. గంగయ్యకూడా కుక్కను యెంతో అప్యాయంగా చూస్తూ వచ్చాడు.

కుక్క ముసలిది అయిపోయింది. పళ్లు రాలిపోయాయి. శక్తి వుడిగిపోయింది. ఒకనాడు గంగయ్య తన భార్యతో యిలా అన్నాడు-

"మన కుక్కను నేను రేపు చంపేస్తున్నాను అది చాలా ముసలిది అయిపోయింది. ఇకమీదట దాని వల్ల మన కేలాటి లాభమూ వుండదు!" అన్నాడు.

"ఎందుకండీ దాన్ని చంపేయడం అది బ్రతికి నన్నాళ్ళు మన యింటికి సేవచేసింది. ఇక బ్రతికే కొద్దిరోజులైనా మనింట్లోనే, యేదో తిని పడివుంటుంది. దాన్ని చంపడమెందుకు" అంది అతనిభార్య.

"నీకు తెలియదులే, దీనివల్లా లాభం లేకపోగా, నష్టం మాత్రం తప్పదు. దీన్ని చూసి దొంగలెవరూ భయపడరు. ఇది వుంటే తిండికి నష్టమేగాని, ఫలితంమాత్రం లేదు. దీన్ని రేపు చంపేసి, వేరే కుక్కను పట్టుకొస్తాను." అన్నాడు.

తన యజమాని, యజమానురాలు మాట్లాడిన విషయాలన్నీ ముసలికుక్క వింది అది తన అకాల మరణాన్ని తలచుకొని దుఃఖించింది. తన స్నేహితుడైన తోడేలును కలుసుకొని, తన ఆపదనుగూర్చి చెప్పుకోవడానికి బయలుదేరింది. తోడేలును కలుసుకుంది. కొంతసేపు మౌనంగా మూతి ముడుచుకొని కూర్చుంది.

"మిత్రుడా! ఎందుకు అలా మౌనంగా కూర్చున్నావు ఏమి కష్టమొచ్చింది" అని తోడేలు పలకరించింది.




"ఏమని చెప్పను మిత్రమా! నేను రేపు ఉదయంవరకే బ్రతికుంటాను. అందుకనే విచారిస్తున్నాను"

"ఏమిటీ! రేపు ఉదయంవరకే బ్రతికి వుంటావా! నీకు జోతిష్యం కూడా వచ్చా?" అంది తోడేలు.

"లేదు. నేను ముసలిదాన్ని అయిపోయానట. నేను యెందుకూ వుపయోగంలేదట. నావల్ల తిండి ఖర్చేగాని ఎలాటి లాభంలేదట. అందుకని మా యజమాని రేపు నన్ను చంపేసి, వేరేకుక్కను తెచ్చుకుంటాడట" అంటూ కన్నీళ్ళు కార్చింది ముసలికుక్క.

తోడేలు కొంతసేపు తనమిత్రునికి వచ్చినకష్టానికి చింతించింది. కొంతకాలం దీర్ఘంగా యోచించింది. దాని నిశితబుద్ధికి యేదోఆలోచన తట్టింది. వెంటనే వుత్సాహంతో యెగిరిగంతేసింది.

"మిత్రుడా! నీవు భయపడవలసిన అవసరంలేదు. నాకొక మంచి ఆలోచనతట్టింది. ఆవిధంగా చేస్తాం. నీ కేలాటి అనుమానమూవద్దు. నీయజమాని నిన్ను చంపడు. నీవు సుఖంగా వుండవచ్చును" అంటూ ముసలికుక్క చెవులో యేదో చెప్పింది తోడేలు. కుక్క వుత్సాహంతో యింటికి వెళ్ళింది.



మరునాటిరోజు తెల్లవారి జాము ననే గంగయ్య, అతనిభార్య తమ బిడ్డనుకూడా తీసుకొని పొలానికి బయలుదేరారు. వారితో కూడా కుక్క కూడా బయలుదేరింది. వాళ్లు బిడ్డను గట్టుమీద, చెట్టు క్రింద పడుకోబెట్టి, పొలంలో పనిచేసు కుంటున్నారు. కుక్క గట్టుమీద పడుకొనివుంది. ఇంతలో తోడేలు మెల్లగావచ్చి, బిడ్డను నోటకరచు కొని పరుగుతీసింది ముసలికుక్క వెంటనే తోడేలును తరుముకొని పరుగెత్తింది. గంగయ్య యిదిచూసి నిశ్చేష్టుడై నిలుచుండిపోయాడు. అతనిభార్య భోరున యేడుస్తూవుంది. ముసలికుక్క పొదముందుకుపోగానే తోడేలు కుక్కకు బిడ్డను అందించింది. కుక్క బిడ్డను నోటకరచు కొని తిరిగివచ్చింది. గంగయ్య, అతనిభార్య కుక్కవద్దకు పరుగెత్తుక వచ్చారు. బిడ్డను ప్రాణాలతో చూసే సరికి వాళ్ళకు మితిమీరిన సంతోషం కలిగింది. ముసలికుక్క బిడ్డను యజమాని కాళ్ళవద్దవుంచి తోక ఆడిస్తూ నిలుచుంది.

"ఏమేవ్ ! మన కుక్క యిక చావడానికి వీల్లేదు. అది మన బిడ్డను కాపాడింది. దానికి యిక మీదట మంచిఆహారం యివ్వు. అది చచ్చేంతవరకు మాయింట్లోనే వుంటుంది. అదేమీ పనిచేయవలసిన అవసరంలేదు. ఈరోజు దానికి విందు భోజనం పెట్టు. దానికి పరుపు యిచ్చెయి. తిని దానిమీద పడు కొంటుంది" అంటూ సంతోషం పట్టలేక అప్యాయంగా కుక్కతల నిమిరాడు గంగయ్య

ఆ రోజు సాయంకాలమే ముసలి కుక్క అడవికి బయలుదేరి వెళ్ళింది తన మిత్రుడైన తోడేలును కలుసు కొంది. తన కృతజ్ఞత తెలియ పరిచింది.

"మిత్రమా! నీ మేలు నా జీవితంలో మరచిపోలేను. నీవీ సహాయం చేసి వుండకపోయినట్లయితే, ఈ పాటికి చనిపోయివుండేదాన్ని. జీవితాంతంవరకు నీకు నేను ఋణపడి వుంటాను..." అంటూ తన సంతోషాన్ని వెలిబుచ్చింది.

"నీవు నాకొక చిన్న సహాయం చేయాలి ... ... నాకు చాలా రోజు లుగా, మీ యజమాని గొర్రెల మందలో బాగా బలిసిన పొట్టేళ్ళను తినాలని వుంది. ఈ నా కోర్కె నెరవేరితే అదేచాలు...నీవు "ఊ" అంటే చాలు. నా పని నేను చేసు కొంటాను" అంది తోడేలు.

# కుక్క విశ్వాసం

"ఆ...! అటువంటి పనిమాత్రం యెప్పుడూ చేయను. మా యజమానికి నేనెప్పుడూ ద్రోహం తలపెట్టను' అంటూ, నవ్వుతూ కుక్క యింటికి వెళ్ళిపోయింది. కుక్క తనతో పరిహాస మాడుతూ వుందనుకొంది తోడేలు.

మునలికుక్క యింటికి వెళ్ళింది. తోడేలు తనతో అన్నమాట యజమానితో చెప్పి జాగ్రత్తగా వుండమంది.

ఆ రాత్రి గంగయ్య మంద దగ్గర దీపం వుంచుకొని, మంచి కఱ్ఱ ఒకటి దగ్గర వుంచుకొని, జాగ్రత్తగా తోడేలు కొరకు చూస్తున్నాడు. కుక్క అతని దగ్గరగా పడుకొని జాగ్రత్తగా పరికిలిస్తూంది.



తోడేలు పొట్టేలుకోసం మంద దగ్గరకు వచ్చింది. కుక్క అది గమనించి మొరిగింది. గంగయ్య వెంటనే తోడేలుమీదికి బడితె విసిరాడు. గురి తప్పింది తోడేలు తప్పించుకొని పారిపోయింది.

తోడేలుకు మునలి కుక్క మీద చెప్పలేనంత కోపం వచ్చింది. 'నేను దీని ప్రాణాలు కాపాడితే ఇది నాకు చేయవలసిన పని యిదేనా! రానీ, దీని [illegible] చూసుకొంటాను. కృతఘ్నురా!' అనుకొంటూ బాధపడింది తోడేలు.

మరునటి రోజు తన మిత్రుడైన అడవిపందిని కలుసుకొంది. తనకు జరిగిన అవమానం గురించి చెప్పింది. ఆ మునలి కుక్కకు తగిన బుద్ధి చెప్పాలనుకొన్నాయి. కుక్కను అడవికి రమ్మని, అడవి పంది దగ్గర చెప్పి పంపింది. అడవి పంది కుక్క దగ్గరకు వెళ్ళి చెప్పి వచ్చింది.

కుక్కకు తోడేలు యెందుకు రమ్మందో అర్థమైంది. తన్ను అడవికి రప్పించి కొట్టబోతుందనుకొంది. తనకు తోడు యెవరూ లేరు. తన యజమాని యింట్లో పిల్లి ఒకటి వుంది. దానికి మూడు కాళ్ళే. ముందు కాలు ఒకటి విరిగిపోయింది. దాన్ని తనకు తోడు రమ్మని చెప్పింది. కుక్క, పిల్లి యిద్దరూ బయలుదేరారు.

పిల్లి తన తోకను పైకి నిక్కబెట్టి నడుస్తూ వుంది. దానికి మూడు కాళ్ళే గనుక, క్రిందికి వంగి, పైకి లేచి నడుస్తూ పోతూంది. కుక్క, పిల్లి రావడం తోడేలు, అడవి పంది గమనించాయి.

నిక్కబెట్టిన పిల్లతోకను చూసి, తమను కొట్టటానికి కత్తి తెస్తున్నాయని భయపడ్డాయి. దానితోను; పిల్లి కుంటుతూ నడుస్తూండటం చూసి, తమ మీదికి విసరటానికి రాళ్ళు యేరుకొస్తున్నాయని అనుమానపడ్డాయి. దానితో వాటి భయం రెట్టింపయింది. వెంటనే పంది పక్కనున్న పొదలో దూరింది. తోడేలు చెట్టెక్కి కూర్చుంది.

మూడు కాళ్ళ పిల్లి, మునలికుక్క అక్కడికి వచ్చాయి. చుట్టూ కలయ చూశాయి. అక్కడ యెవరూ కనిపించలేదు. పక్కన పొదలో యేదో కదిలింది. పొదలో ఎలుకేదో వుందనుకొని, పిల్లి పొదలోకి దూకింది. పిల్లి దూకడం గమనించిన పంది బిత్తరపోయి, బ్రతుకు జీవుడా అంటు పరుగు తీసింది.

పంది పరుగెత్తడం చూసిన తోడేలు మరీ హడలెత్తిపోయింది. పిల్లి, కుక్క చెట్టుపైకి చూశాయి. తోడేలు కనిపించింది. పిల్లి, కుక్క చూడ్డం, తోడేలు గమనించింది. దానికి కాళ్ళు అదురుతున్నాయి. శరీరమంతా చెమట పట్టింది. భయపడి పోయింది.

"క్రిందికి దిగిరా!" అంటూ కేకేసింది మూడు కాళ్ళ పిల్లి.

"అయ్య బాబోయి! నేనేమి చేయను. బుద్ధి గడ్డితిని ఈ పని చేశాను. ఇక మీదట మీ జోలికి రాను. మునుపటిలాగే మీతో స్నేహంగా వుంటాను. నన్ను క్షమించండి." అంటూ తోడేలు వేడుకొంది. అందుకు కుక్క కూడా అనుమతించింది.

అప్పటి నుంచి అవి మూడూ స్నేహంతో కాలం వెళ్ళబుచ్చాయి.

★

# పాపము పండింది

బొల్లిముంత నాగేశ్వరరావు

ధర్మపురిని రాజధానిగా జేసుకొని జనార్ధన మహారాజు పాలన సాగించాడు. ఆ పట్టణం సార్థకనామాన్ని వహించిందని తలచాడు. అదేపదే మంత్రికి జెప్పి మురిసిపోయేవాడు.

ధర్మపురిలో కాంతయ్య కడు పేద. కట్టెలుకొట్టి పట్టణంలో అమ్ముతూ సంసారమును గడిపే మనిషి. దయామయుడు. అయితే అతనిదయ ఎవరి కుపకరిస్తుంది? ఒకదినము కాంతయ్య కట్టెలకై అడవికిపోయాడు. అచట ఎండిన మ్రోడు కనిపించింది. దానిని త్రవ్వటం మొదలు పెట్టాడు. ఈవిధంగా త్రవ్వే సమయమున అతని కో బంగారు తల కనిపించింది. దానిని పెకళించి బయటకు తీశాడు. దాని ఆకారము మునీశ్వరుని తల వలె యున్నది. నొసట అడ్డముగా మూడుగీతలు గీయబడియున్నవి. ఇదొక మునీశ్వరుడు చేయించుకొన్న బొమ్మని కాంతయ్య తలచాడు. దానిని తుడిచి శుభ్రముగా చేశాడు.

మరుక్షణములో "ఓయీ! అని పిలుపు వినిపించింది కాంతయ్యకు. భయకంపితుడై నలుమూలలా కలియజూచాడు. ఎవ్వరూ లేరు. మరల వినిపించినయ్. "నేనే నీ చేతి యందున్న బొమ్మను, నా చరిత్ర క్లుప్తంగా జెపుతా విను. నా నామధేయము అభయుడు. ఒకశాపము వల్ల సువర్ణప్రథమాంగ శరీరుడనయ్యాను. ఈ చెట్టుక్రిందనే తపస్సు మొదలు పెట్టాను. గాలివాన వచ్చి ఆకులతోను, మట్టితోను నిండి పోయాను! చివరికి నాశరీర మంతయు మన్ను తిన్నది. తలఒక్కటే మిగిలింది. ఒకధర్మకార్యము చేసినపిమ్మట నా ప్రాణము పోతుంది. కావున నీవు మహాపట్టణము రాజు యొద్దకు తీసుకొని పొమ్ము. నేనిక మాట్లాడ" నని అభయుడు తన చరిత్ర ముగించాడు.

కాంతయ్య అభయుడు జెప్పిన ప్రకారము రాజువద్దకు పయనమయ్యాడు. దారిలో అతనికి ముగ్గురు మనుష్యులు ఎదురయ్యారు. అందు గజదొంగయగు నాగడు, అతని యనుచరులు మారువేషాల యందుండిరి. కాంతయ్య చేతిలో ఉన్న మూటను జూచి సమీపించారు.

"ఎవరు నువ్వు?" కాంతయ్యను సూటిగా ప్రశ్నించాడు నాగడు

"నేను కట్టెలమ్ముకొని జీవించే వ్యక్తిని" అంటూ కాంతయ్య జవాబిచ్చాడు

"అయితే ఆ మూట ఏమిటి? మర్యాదగా ఇస్తే" అన్నాడు నాగడు.

"మర్యాద! మర్యాదగల వ్యక్తివైతే నన్ను తొలగిపోనీయ్" అన్నాడు కాంతయ్య.

"ఓహో! వ్యవహారము చాలా వరకుందే" అంటూ తన అనుచరులకు సంజ్ఞ చేశాడు నాగడు. వెంటనే వారిరువురు కాంతయ్యమీద కలియబడి మూటను లాక్కున్నారు. చివరికి కాంతయ్యను వారిచ్చవచ్చినట్లు కొట్టారు. నాగడు ఆ మూటను తీసుకొని "వాడిని రహస్యమందిరానికి తీసుకుపదండి. చిత్రవధ చెయ్యాలి. రాత్రికి నే వచ్చువరకూ మీరేమి చెయ్యవద్దు. వెళ్లండి" అన్నాడు. వారు ఆ విధంగా కాంతయ్యను తీసుకు పోయారు.

నాగడు మూటను విప్పాడు. ఒక్కసారి అమితానందం పొందాడు. మంచిరోజురా ఇదంటూ మురిసిపోయాడు. కాని 'ఓయీ!' అంటూ కేక వినిపించింది. 'అరె! చూశారా ఎవరన్నా' అంటూ మూట కట్టేసి, నలుదిక్కులను చూచాడు. ఒక్క మనిషి గూడా కనిపించలేదు. ఎవరా అంటూ భయముచే మూటను చంక బెట్టి బయలుదేరాడు. ఈ సారి "నేనే నీ మూట యందున్న బొమ్మను విప్పు"అంటూ వినిపించింద.

## పాపము పండింది

మాటను విప్పాడు. బొమ్మయందు కదలిక లేదు.

విచిత్రంగా లోపలినుండి శబ్దము పుట్టుకు వస్తున్నది. మరల ఈ మాటలు విన్నాడు. "నాచే నీకగు ఉపయోగము అవంతయు లేదు. కావున నన్ను రాజుయొద్దకు గొని పొమ్ము. మాట్లాడుబొమ్మ కిచ్చితి వని నీకు బహుమతులు తప్పక ఇచ్చును. నేనిక మాట్లాడ"నని ఊరకుండి.

వెంటనే నాగనికి గంపెడంత ఆశ పుట్టుకువచ్చింది. బొమ్మ చెప్పిన ప్రకారము రాజువద్దకు పయనమయి పోయాడు.

రాజదర్శనము దొరికిన పిమ్మట ఈ విధంగా నాగడు అన్నాడు: "ప్రభూ! నాకీబొమ్మ అరణ్యప్రాంతమున దొరికింది. దీనికి మాట్లాడు సామర్థ్యమున్నది. అందుచే తమకు కానుకగా ఇవ్వ వేడుకై వచ్చితిని. కొను" డంచూ చేతిలో పెట్టాడు.

రాజు అమితానందాశ్చర్యములతో బొమ్మను తీసుకొని మాట్లాడు నట్లు చెయ్యమన్నాడు. వెంటనే బొమ్మ "రాజా! నేమాట్లాడువిషయమున నాగడు అస్వతంత్రుడు. నీ ధర్మపురిలో నూతనాధ్యాయము బయలుదేరింది. రేపటి ఉదయము సభాంతరమున వేదిక అమర్చండి. దానిమీద నాగని నన్ను ఉంచండి. తదుపరి విషయము లన్నియు మీకే అవగాహన కాగలవు. నేనిక మాట్లాడ" నని అభయుడు ముగించాడు.

మరుదినము సభాంతరమున వేదిక. దానిపై నాగడు, బొమ్మ (అభయుడు) కలరు. అభయుడీ విధంగా మొదలు పెట్టాడు. "రాజా! పుర ప్రజలారా! నేను అభయుడను మునీశ్వరుడను. ప్రస్తుతము నాచరిత్ర మీ కనవసరము. నన్ని రాజువద్దకు గొనివచ్చిన వాని పేరు నాగడు. జనార్ధనమహారాజు తన ధర్మపురి పట్టణము సార్థక నామాన్ని వహించిందని తలచేవాడు. కాని అదంతా వట్టి భ్రమ."

రాజు, పుర ప్రజలు తెల్లబోయారు.

"ఈ పట్టణములో కాంతయ్యను కట్టెలు కొట్టి జీవించేవ్యక్తి కలడు. గడచిన దినము ఓ ఎండిన మ్రాను త్రవ్వుచుండగా బయలుపడితిని. నా యిచ్చప్రకారము రాజుగారిని కానుకగా నన్నియ నెంచి బయలుదేరాడు.

"కొన్ని వత్సరములనుండి అరణ్యము దొంగలమయమయింది"

అనగానే నాగడు తెల్లబోయాడు

"దానికి నాయకుడు ఈ వేదిక మీద నిలబడి ఉన్న నాగడు. కాంతయ్య వీని చేతికి దొరికాడు. తనకు నన్నియమని కాంతయ్యను బలవంతము జేసి, కొట్టి చివరికి లాక్కొన్నాడు. అయితే కాంతయ్య ఈసమయమున నాగని రహస్యమందిరమున బంధింపబడి యున్నాడు. నాగడు రహస్యమందిరాన్ని అరణ్యమధ్యమున నిర్మించాడు. ఎనుబదిమందిగల దొంగలముఠాను అమర్చాడు. నాగనికోసము కాంతయ్యను చిత్రవధ చేయుటకు ఎదురు చూచుచున్నారు. జనార్దన మహారాజా! వెంటనే కాంతయ్యను రక్షించి, నాగని, అతని యనుచరులను బంధించి నీధర్మపురి పట్టణాన్ని సార్థకము చేసుకో. మరి మూడు దినముల తరువాత నా ప్రాణము పోగలదు. నేనిక మాట్లాడ నని ఊరకున్నాడు.

అప్పటి వరకూ ఆగలేని రాజు ఉగ్రుడై ఖడ్గన్నెలాగి నాగనిమీదకు దుమికాడు. ★

---

## నను జూచి బతకరా నా తమ్ముడా!

బి. పురుషోత్తము

ఒకానొక యరణ్యమున
నుండిరి ముగ్గురు హితులు
సింహము, గాడిద, నక్క

ఒకనాటి వేటలోన
ఒదవిన యా మాంసమును
పంచుట కరముకు బడెను.

మూడు సమభాగములుగ
పోగులు పెట్టెగాడిద
అంతర మెరుంగ లేదు.

సింహమునకు రవ్వంత కోపెను
చివాలున తనపైకి
లంఘించి చంపె దాని.

ఈ సారి పంపకమ్ము
నక్కకు వచ్చె నిజమ్ము
జిత్తుల మారిది నక్క.

అంతా ఒక్కచోటగానె
అమర్చి కొంత జవ్వను
తన పాలికి వేసికొనె.

సింహము సంతోషపడి
ఎక్కడ నేర్చినావని
ఆదరమున నడిగినది.

ఎక్కడ నేమిటి దొరా!
ఇంతకు ముందే గదా
గాడిదకు నేర్చినారు.

అనుచుం జెప్పెను నక్క
అన్యుల యనుభవంబున
మనము నేర్చుకోవలెను.

# నర్తకి

(10-వ పేజీ తరువాయి)

విప్పింది. మళ్ళీ కట్టుకుంది. గజ్జె తెగలేదు. అతడు రాలేదు. బయట కారు హారన్ చెయ్యంకూసినట్లు ఆగకుండా అరుస్తోంది. రతి లేచి వెళ్లిపోయింది.

ఇంటికి వెళ్ళాక పద్మనాభరావు 'ఏం తల్లీ! అట్లా ఉన్నావ్?' అనడిగాడు.

'అమ్మాయికి సగంలో అలుపు రాకుండా బాదంపాలు ఇంకా ఎక్కువ ఇప్పించాలండీ' అన్నాడు గురూజీ.

'ఆ! అందులో రెండు విషంచుక్కలు కలపండి సరిపోతుంది' అనుకుంది రతి.

'ఏవిటమ్మా! ఒంట్లో బాగులేదా?' తిరిగి అడిగాడు పద్మనాభరావు.

'అవున్నాన్నా' అంటూ లోపలికి వెళ్లింది రతి.

'కొంచెం విశ్రాంతి అవసరం' అన్నాడు గురూజీ.

ఆతర్వాత గురూజీ, పద్మనాభరావు భారతదేశంలో మిగతా రాష్ట్రాలలో రతి నృత్యప్రదర్శనం గురించి చర్చించటం మొదలెట్టారు. ఏరాష్ట్రం నుంచి ఏ రాష్ట్రానికి పోవలసింది అక్కడ వసతులు హంగులు మొదలైన వివరాలు మాట్లాడుకున్నారు. నృత్యానికి సంబంధించిన దుస్తులు వగైరాలు కొనటానికి, ప్రయాణపు ఏర్పాట్లు పూర్తి చేసుకోవటానికి రేపే బయల్దేరి మద్రాసు వెళ్ళాలని నిశ్చయించుకున్నారు.

ఇల్లంతా బావురుమంటోంది. రతికి ఏమీ తోచటం లేదు. గురూజీ, పద్మనాభరావు రెండురోజులక్రితమే మద్రాసు వెళ్లారు. రతికి 'ఎందుకిదంతా' అనిపిస్తోంది. పనిమనిషి పళ్ళరసం పట్టుకొస్తే వద్దని తిప్పి పంపించింది. ఎదురుగా టేబుల్ మీద తెగిన గజ్జె, పక్కనే వాడిన గులాబీలు బిక్కు బిక్కుమంటున్నాయి. సాయంత్రపు ఈదురుగాలికి కిటికీ తలుపులు దబదబ కొట్టుకున్నాయి. తలుపులు వేసివద్దామని లేచి వెళ్ళింది. కిటికీలోంచి వీధిలోకి చూస్తే— అతనే...అతనే...గేటు దాటి లోపలికి వస్తున్నాడు. ముప్పిరిగొన్న సంతోషం ఊపిరాడనిచ్చింది కాదు. కాళ్లు తడబడగా రతి ద్వారం వైపుకి పరుగెత్తింది.

'రం...డి' మాట సగం గొంతులోనే మిగిలిపోయింది. రాజు లోపలికి వచ్చాడు. 'ఆనాడు మీ ప్రదర్శనానికి రాలేకపోయాను' అంటూ.

కుర్చీ చూపించి కూర్చోమంది. పనిమనిషిని పిలిచి పళ్ళరసం తెప్పించింది.

'మరి మీకో—' అన్నాడు రాజు.

తనూ తెప్పించుకు తాగింది.

రతి ఏమీ మాట్లాడలేకపోతోంది. సంబరపుటలలు ఎడాపెడా కొట్టి ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. తలవంచుకు కూర్చుంది.

'ఆరోజు నాట్యం బాగా జరిగిందా?' అడిగాడు రాజు. తల అటూ ఇటూ ఊపింది. అవుననో కాదనో అర్థం కాలేదు. మూగ నిమిషాలు రెండు గడిచాయి. మూడో నిమిషంలో ఇలా పలికింది 'అలా తోటలోకి వెళ్దాం—' రతిని అనుసరించాడు రాజు.

పచ్చగడ్డిమీద పక్కపక్కగా నడుస్తున్నారిద్దరూ. రతి చెప్పులతోటే నడుస్తోంది.

'అందమైన మీ పాదాలస్పర్శకు ఈ పచ్చగడ్డి నోచుకోలేదా?' అన్నాడు రాజు.

రతికి పూర్వవృత్తాంతం జ్ఞాపకం వచ్చింది. గిరుక్కున వెనక్కి తిరిగి బొటనవేలు కొరుకుతూ నవ్వుకుంది. చెప్పులు విసురుగా విడిచేసి రాజువైపు తిరిగి చూసింది. అతనేదో నవ్వుతూ అన్నాడు. రతికి ఏమీ వినిపించటం లేదు. అతని చిరునవ్వు వెన్నెల. అతని పెదవుల్లో కృష్ణలీలామృతపు ఝరులు.

జాజిపందిరికింద కూర్చున్నారిద్దరూ. రతి మోకాళ్ళమీద గడ్డం ఆన్చి అతనిలోకి చూస్తూ అంది 'చెప్పండి.'

'నేనేం చెప్పగలను...దేవత ఏమన్నా చెప్తే వింటాను'

'ఊఁ' అని మూతి తిప్పింది రతి. పెదవులు మన్మథబాణంలా వంగాయి. 'అయినా దేవత దేవుడికేం చెప్పగలదు?' నేలలోకి చూస్తూ అంది రతి.

గడ్డిపరక నిక్కినిక్కి చూసింది.

రాజు రతిచుబుకం పైకెత్తి తనవైపు తిప్పుకున్నాడు. రతి రాజుహృదయంలో తలదాచుకుంది. రాజు బలమైన చేతులు లతలాంటి రతిశరీరాన్ని పెనవైచినై. రతికి దేహావయవాలు పట్టు తప్పినై. దేహంలో అగ్నిపర్వతం బద్దలై లావా వెలువై పొర్లింది. జగత్తులోని సౌకుమార్యాలన్నీ రెండుగా విడిపోయి తిరిగి ఒకదానొకటి ఆప్యాయంగా కలిసికొంటున్నట్లు వారి పరిచుంబన - కోరిక రూపుకట్టి సిద్ధిని పొందుతున్న వారి గాఢపరిష్వంగం చూసి కొమ్మమీది గువ్వలజంట 'చూడు చూడని' ముక్కులతో పొడుచుకున్నాయి. సర్వమూ ఏకమై, ఇది - ఇది అని ఏమీ మిగలక-తమ అస్తిత్వం అణువై, పరమాణువై ఆనందంలో ఐక్యమవుతున్నట్లనిపించింది వారిద్దరికీ.

రతికి ఒళ్ళు తెలిసి, కళ్ళు తెరిచి చూసేసరికి తను రాజుకౌగిలిలో ఉంది. రాజు తనలోకే చూస్తున్నాడు. మత్తుగా తిరిగి కళ్ళు మూసికొని రాజును గాఢంగా కౌగిలించింది. రతికి తనప్రభువు కరుణించినట్లుంది. రాజుకు తనదేవత అనుగ్రహించినట్లైంది. పరస్పర

ఒకావిడ: మావారండీ, పదిమంది సహపంక్తిని ఉంటేగాని భోజనం చేయరు సుమండీ.

మరొకావిడ: కష్టమేనండీ! మరి ఈ రోజుల్లో రోజూ సంతర్పణ లెక్కనంటాయి?!

—రాజులపూడి నరసింహారావు,
నర్సాపురం.

ఆరాధకులైన వాండ్లకు తెలియకుండా చంద్రోదయమైంది.

రతి రాజును ఆరోజు తనతో భోజనం చెయ్యమని బలవంతపెట్టింది. కొసరి కొసరి వడ్డన చేయించింది.

భోజనమైంతర్వాత ఆకులు మడిచి ఇచ్చింది. రతికి శరీరమంతా గాలిలో తేలిపోతున్నట్లు తేలిగ్గా ఉంది. గబగబ మాటలు దొర్లించి కబుర్లు చెబుతోంది. కిల కిల నవ్వుతోంది. మాటలు చెప్తూ, నవ్వుతూ. మధ్య మధ్య రాజు ముంగురులు సరిదిద్దుతోంది. కొంగుతో అతడి నుదుటి చెమటను అద్దుతోంది. సగంలో ఆపి రాజుముక్కుగిల్లి 'వింటున్నారా!' అంటుంది. రాజు మాట్లాడకుండా తల అటూ ఇటూ తిప్పుతాడు. రతి మువ్వలు కుదిలించినట్లు నవ్వుతుంది.

ఉన్నట్టుండి రాజు 'ఒక్కసారి నృత్యం చేస్తావా?' అనడిగాడు.

'అంతకంటేనా - ఒక నిమిషం' అని పక్కగదిలోకి వెళ్ళింది రతి.

పావుగంట తర్వాత ద్వారం ముందు కిన్నెర సాక్షాత్కరించింది. రాజు చకితుడయ్యాడు. హంసనడకతో రాజువద్దకు వచ్చి పాదాభివందనం చేసింది. 'వద్దు వద్దని' చేతులు పట్టుకోబోయాడు. జారిపోయింది. నాట్యంలో రతి లేడిపిల్లలా చెంగున దూకింది. తటిల్లతలా మెరిసింది. ఎక్కడలేని ఆవేశాన్ని పొందింది. రతి సన్నటినడుము మెలికలు తిరిగిపోయింది. కాలిగజ్జెల రవళి సుళ్ళు తిరిగింది. ఇంతక్రితం నాట్యం చేస్తున్నప్పుడు తను పొందే అలసట నేడేమయిందో! రతి వేసిన ప్రతిపదమూ రాజు హృదయంమీద ముద్రవేసింది. అపురూపములైన హస్తపద విన్యాసాలు చూపింది. తన నాట్యవిశేషం సర్వాన్ని ఆవిష్కరించింది. సర్వమూ సమర్పణ చేసింది. రాజు తన్మయతలో మైమరపు చెందాడు.

'ఏమి టిదంతా' గట్టిగా అరిచాడు అప్పుడే గదిలోకి వచ్చిన పద్మనాభరావు. ఆయన వెనకాల గురూజీ. మద్రాసులో పని పూర్తి చేసికొని అప్పుడే బండికి దిగారిద్దరూ.

'నాన్నా!'

## నర్తకి

'ఎవరాయన? ఏమిటిదంతా?' అయోమయంలో పడ్డాడు పద్మనాభరావు. సరిగ్గా





ఒకరు: వరుసనుంచి వాడు, పదిమందికి పెడ్తేగాని తాను తిన లేడు...

మరొకరు: అయితే ఏ హోటల్లో పనండీ?

—రాజులపూడి నరసింహారావు,
నర్సాపురం.

ఆ దేసితిలో మాటరావటంలేదు గురూజీకి.

'చెప్తానుండు నాన్నా' రతి గ్లాసెడు మంచి నీళ్లు తాగి చెప్పింది. 'వీరు రాజు. వారిని నేను పెళ్లి చేసికోబోతున్నాను.'

'పెళ్లా! నీ కేమైనా మతిపోయిందా?'

'ఏమిటీ మాటలు?' పెద్దగా అరిచాడు పద్మనాభరావు.

'అవును నాన్నా! నేను అన్నీ ఆలోచించుకునే ఈ మాట చెప్తున్నాను.'

'నీకేం దయ్యం పట్టలేదు గదా! భారత దేశ పర్యటనకు మేమంతా సిద్ధం చేసిన తర్వాత పెళ్లి చేసికొంటాననటమేమిటి?'

'నేను పర్యటనకు రాను నాన్నా. నాకు ఖ్యాతి అక్కర్లేదు'

'ఆ! నా ఆశలన్నీ బుగ్గిచేశావ్! ఇంక నువ్వు ఈ ఇంట్లో ఉండి ఎవర్ని ఉద్ధరిస్తావ్!'

'తక్షణం వెళ్లిపోతాను నాన్నా' అని ఇంట్లోకి వెళ్లి పదినిమిషాల్లో చిన్న సూట్ కేసులో బట్టలు సర్దుకుని వచ్చి రాజు దగ్గర నిల్చుంది.

గురూజీ గొంతు సవరించుకుని 'చూడమ్మా రతీ! ఆవేశం కూడదు. నిదానంగా ఆలోచించాలి. నీకు దేశంలో, విదేశాల్లో పెద్ద పేరు తీసికొని రావాలని మీ నాన్నా నేనూ అనుకుంటున్నాం. నిన్ను నాట్యానికి అంకితం చెయ్యాలని మీ నాన్న కలలుగంటు న్నాడు......'

'నన్ను క్షమించండి గురూజీ. ఈ విషయంలో వాదనగాని, తర్కంగాని ప్రవేశ పెట్టకండి. ఇది ఒకొక్కర్ల వ్యక్తిగతమైన తత్వానికి సంబంధించింది. నేను నిర్ణయించిన మార్గం నాజీవితానికి సరైనది. సెలవు' అని రతి రాజు చెయ్యిపట్టుకుని గేటుదాటి వెళ్లిపోయింది.

ఆ తర్వాత తరచూ రతి ఉత్తరాలు వ్రాస్తున్నా, పద్మనాభరావు రతి ఇంటికి వెళ్లలేదు. తన ఇంటికి రప్పించలేదు. మూడు సంవత్సరాల తర్వాత ఒకనాడు రతి నుండి ఉత్తరం వచ్చింది. తనకు కూతురు కలిగిందనీ, 'మహతి' అని పేరు పెట్టాననీ, మనుమరాలికి తాతగారి ఆశీర్వాదం అవశ్యం కావాలనీ—. ఆ ఉత్తరం చూసి 'నా మహతిని తప్పకుండా నాట్యానికి అంకితం చేయిస్తాను' అని పెట్టె బెడ్డింగు సర్దుకుని ఇంటికి బయల్దేరాడు పద్మనాభరావు. ★

శ్రీ ప్రొడక్షన్స్‌వారి 'అభిమానం'లో కన్నాంబ, నాగేశ్వరరావు, సావిత్రి, కృష్ణకుమారి, కోటేశ్వరరావు.

# సరికొత్త పంథాలో 'సర్‌హద్'

దేవానంద్, సుచిత్రాసేన్, రాగిణి నటించిన అలంకార్ చిత్రవారి 'సర్‌హద్' రక్తి కట్టేపాటలూ, రంజయిన ప్రకృతి దృశ్యాలూ చక్కని కథగల బిగువయిన చిత్రం. శంకర ముఖర్జి దర్శకత్వం, సి. రామచంద్ర సంగీతం ఈ చిత్రంలో ఆకర్షణలు.

అమర్ అనే కుర్రవాడు చిన్నతనంలో తండ్రి కోపావేశాలకు కొట్టే దెబ్బలకు తట్టుకోలేక అడవుల్లోకి పారిపోయి-అక్కడ ఒకానొక మురానాయకుడు 'సర్దార్' చేతులో పెరుగుతాడు. స్వతహాగా ధైర్య సాహసాలుగల అమర్ (దేవానంద్) తాను 'సర్దార్' అవుతాడు అతను అడవిలో కలప వ్యాపారం పెంపొందిస్తూ ముఠాపట్ల నిర్దాక్షిణ్యంగా నాయకత్వం వెలిగిస్తాడు. అడవిలో వుండే గులాబీ (రాగిణి) అనే కన్యతో సరాగాలు తీసేవాడు కాని ఆమె యితని మనస్సులో ప్రేమబీజాలు నాటలేకపోతుంది.

కొడుకుకోసం నాటినించీ వెతికి వెతికి చిట్ట చివరికి తెలుసుకుని తాను పెంచిన అనాథ బాలమాల (సుచిత్రాసేన్)తో అమర్ తండ్రి అమర్ కోసం వస్తాడు. అమర్ తండ్రిని తృణీకరిస్తాడు. తండ్రి వెళ్లిపోతాడు. కాని మాల తిరిగి వెళ్లదు.

పశువుగా మారిన అమర్‌ను మానవుడుగా చేయాలని మాల, కొండజాతి గుండె కరగ రాదని గులాబీ అమర్‌ను వశం చేసుకొన జూస్తారు మాల అతని హితంకోరి తాపత్రయ పడుతుంది.

ఈ యిద్దరు స్త్రీలూ ఆ ఒక్కడికోసం వారు వారు పడే బాధలూ చక్కని కళ్లుయి మూస్తున్న దృశ్యాలతో చిత్రీకరించారు.

ముఖ్యంగా తుఫాన్ అనే అమర్ గుర్రం దెబ్బనయం చేయడం ద్వారా, అమర్ పశుత్వం కూడా మాన్పిన ఘట్టంలో సుచిత్రా దేవానంద్‌లు చక్కగా నటించారు.

ఈ చిత్రానికి ఛాయాగ్రహణం నిర్మాత కె. హెచ్. కపాడియా నిర్వహించారు.

కనువిందయిన ఆటలతో వీనుల విందయిన పాటలతో 'సర్‌హద్' చల్లగా హాయిగా సే ఉంది. ★



# [illegible]

వాహినీ స్టుడియో 1వ ఫ్లోర్‌లో అన్నపూర్ణావారి కొత్త చిత్రం షూటింగ్ చురుకుగా సాగుతోంది వరసగా మూడు శతదినోత్సవ చిత్రాలు తీసి 'హాట్ ట్రిక్' సాధించిన నిర్మాత మధుసూదనరావుగారు ఈ చిత్రం నిర్మాణం ఆరంభించడంలో కొంత జాప్యం చేసినా, నిర్ణీత కార్యక్రమం తప్పకుండా పనిసాగింగి, ఆనారను కొద్ది రోజులలో ధరికొనని తెలుసు, తమిళ ప్రతులను కూడ ఆరేసరీళ్ళు ఎడిట్ చేయించి సిద్ధం చేశారు

"అన్నపూర్ణావారు రెండేళ్ళకో చిత్రం ఇవ్వాలం తగువుకొవని తగనాడిన అభిమానులకు జవాబుగా ఇటుపై ఏడాదికి రెండు చిత్రాలు తీదామని సంకల్పించాము" అన్నారాయన.

ఇప్పుడు నిర్మిస్తున్న చిత్రం పూర్తికాగానే—ఇది జనవరిలో విడుదలఅవుతుంది—పిల్లలకోసం ఒక చిత్రం నిర్మించడానికి ఏర్పాట్లు చేస్తున్నట్లు ఆయన చెప్పారు.

*　*　*

నిర్మాణంలో ఉన్న చిత్రానికి కథ సాంఘికమైన వృత్తాంతమే అన్నపూర్ణా చిత్రాలలో పాల్గొనే బృందం అంతా—నాగేశ్వరరావు, సావిత్రి, రంగారావు, రేలంగి, సూర్యకాంతం, జగ్గయ్య మొదలగు వారుఇందులోనూ నటిస్తున్నారు. అదనంగా, ఆంధ్రపత్రిక ఫిలిం బాలట్‌లో ఉత్తమ సహాయనటిగా ఎన్నిక అయిన గిరిజ ఒక ప్రముఖ పాత్రను నిర్వహిస్తూంది మాటలు ఆత్రేయ, పాటలు శ్రీశ్రీ, కొసరాజు వ్రాశారు సంగీత రచయిత పెండ్యాల, (అన్నపూర్ణావారి తొలిచిత్రం దొంగరాముడు ఈయనే సంగీతం సమకూర్చారు) ఇప్పటికి ఆరు పాటలు రికార్డు చేశారు.

గాలి చల్లగా, ప్రియవచనంలా హాయిగా వీస్తోంది. వేసవి వేడికి కమిలిపోయి తన కోసం తపించిపోతున్న జీవకోటిని తల్లిలా సముదాయిస్తోంది. వీనస్ ఆవరణలో ఇలాటి మధుర సన్నివేశాలెన్నో చూచిన వృద్ధ వృక్షాలు గంభీరంగా తలలూపుతున్నాయి

ఉదయం తొమ్మిదినుండి ఎండలోను, స్టుడియో లైట్ల వేడిలోనూ శాంతికళావారి సెట్ మీద పనిచేస్తున్న నటుడు రేలంగి కుర్చీలో జేరబడి విశ్రాంతి తీసుకొంటూ ప్రకృతి సదుపాయాలను అనుభవిస్తున్నాడు అయనపక్కనే అంతగామూ పనిచేసి అలిసి



దేవర్ ఫిలిమ్స్‌వారి కార్మిక ఎజమానులలో మాలతి, కన్నాంబ

పోయిన దర్శకుడు మానాపురం అప్పారావు కూర్చొని తరువాతి షాట్ గురించి ఆలోచిస్తున్నారు. మధ్య మధ్య ఆ షాట్‌లో డైలాగులు రేలంగికి వినిపించి వివరిస్తున్నారు.

ఈ వేళ చాలా డల్ గా ఉన్నట్టున్నారన్నారొక సౌండ్ అసిస్టెంటు.

అవే. లేదు రేలంగి సాయంత్రం నాలుగు నుంచి ఆరువరకూ ఆలోచనలో పడిపోతారు ఆరింటికి లేచేసరికి—

"లేవను లేనుగా. ఇవాళ ఆరయినా ఏడయినా ఎనిమిదయినా ఇక్కడే ఇలా హాయిగా చల్లని గాలి పీలుస్తూ, హాయిగా ఇంట్లో పిల్లలతో ఆడుకుంటూ కూచోవలసిందే అని తలుస్తూ ఎవరూ ఏమీ అబ్జెక్షను పెట్టకపోతే ఆ లేస్తూ పోచుంటాను క్రేంచీ లేవు ఇవాళ అన్నారు రేలంగి' అనుకుంటాను మీరు కాని అనకులెండి" అన్నారు రేలంగి.

ఆరయినట్టుంది అన్నాడాయన చుట్టూ కూర్చున్న మిత్రులలో ఒకాయన.

*　*　*

షాట్‌కి అంతా రెడీ అయింది కాని, కానిది ఒక్కటే ఒక నటీమణి ముస్తాబులో ఉందన్నారు.

"ఎవరు చెప్మా?"

"ఎవరేమిటి తెలీతే ఇక్కడ సెట్లో ఉన్నా ఉంది ఇంకెవరూ సూర్యా" అన్నాడు రేలంగి కొంటెగా.

సెటే—సాధారణంగా సెట్ మీద తినుబండారాల బాపతు ఏదైనా కనిపిస్తే, ఆ రోజున సూర్యకాంతం అక్కడ నటిస్తుందని అనుకోవచ్చు రివాజే.

*　*　*

సుభోదయ వారి "భక్త శబరి"కూడా జూలై ఆఖరివారంలో విడుదల కావచ్చు. దర్శకుడు

చిత్రపు నారాయణమూర్తి. నిర్మాత వి.ఆర్ నాయుడు సుమారు వందమందితో గతవారం తిరుపతి వద్ద ఔట్‌డోర్ దృశ్యాలు చిత్రించారు.

* * *

కృష్ణచిత్ర వారి తొలికానుక "బావా మరదళ్లు" కత్తెర కెర కాకుండా సెన్సారు అయింది. అక్కచెల్లెళ్లు చిత్రానికి కథ వ్రాసిన పద్మనాభరావు ఈ చిత్రం దర్శకుడు, నిర్మాత రమణమూర్తి, కృష్ణకుమారి, మాలిని, సూర్యకాంతం, శోభ, రాజరత్నం, రేలంగి, సి. ఎస్. ఆర్, నాగభూషణం, కుటుంబరావు, బాలకృష్ణ, అల్లు రామలింగయ్య, పెరుమాళ్లు, చంద్రశేఖర్ మొదలగు వారు పాల్గొన్నారు. ఈ చిత్రం జూలై పూర్వార్ధంలో విడుదల కాగలదని తెలుస్తోంది

* * *

"ఏం బాబూ. పేరు సగంలో చెప్పి ఆగిపోయావు నేనేం కరుస్తానా మింగేస్తానా. మహాంకాళి ననుకున్నావా అమ్మోరికే ననుకున్నావా? చూడగానే జడిసిపోడానికి. ఆ? ఏం? చెప్పు. చెప్పవయ్యా. పేరుసగంలో ఆపేశావు. పెళ్ళికొడుకులా..."

ఒడిగాలి గిర్రున తిరిగి తిక్క వచ్చి పోయాక అనవసరాలే సూర్యకాంతం వచ్చి కూర్చుంది.

"చూశారా డైరక్టరుగారూ నే చెప్పలే. ఇవాళ గాడుపుకి నాలిక తిరిగిపోయిందని. చూశారా. ఇప్పుడు సూర్యకాంతమ్మ పెద్దపులాగున్నట్టు వినిపించింది. అదేమిటో పై పేరాగ్రాఫ్ చదువుకొండి ఏంగీరా చూసే అది వినపడ్డ పావుగంటకే కదా ఈవిడొచ్చి కూచుంది పాపం... ఆవిడనని మాటలు ఆవిడందని—

"ఏం? అనకపోడానికి నాకేం. ఎందుకన్నానని కేక వంలా అంటాను. నేనే అన్నాను అంటేనేకేం"—

"వుండవమ్మా.. డైరక్టరు గార్ని కెలికించి ఇవాళ లీవు తంపోయిద్దామనుకుంటే—"

"నా తండ్రీ—నేనుతీరా ఇంతముస్తాబూ అయిప్పాక లీవివ్వడానికి అయనెవరు, అడగడానికి నువ్వెవరు. అడిగినా నేనే అడగాలి, ఇచ్చినా నేనే ఇవ్వాలి, పుచ్చుకున్నా నేనే పుచ్చుకోవాలి" అంది సూర్యకాంతం.

"ఇదుగో అమ్మాయ్ ఆట్టే పెంకితనం చేస్తే, సూర్యకాంతమ్మకి చెబుతా జాగ్రత్తమరి" అన్నాను రేలంగి

అంతా విరగబడి నవ్వారు.

ఆరుదాటింది అన్నాడు అసిస్టెంటు తృప్తిగా

సెట్‌మీద కమల్‌ఘోష్ లైటింగ్ ఏర్పాటుచేసి రడీఅన్నారు

అలిసిపోయివచ్చిన రేలంగికి, సూర్యకాంతం ఉప్మా ఫలహారం పెట్టడం అందులో ఏర్పాటు.

ఉప్మాలో గులకరాయి కలిసింది. గులకరాళ్లలో ఉప్మా కలిసిందన్నట్టు మొహం పెట్టి నటించిన రేలంగి పోకచెలకి సెట్




'ఎహోల్ ఇన్ ది హెడ్'లో పాత్రధారులు ఫ్రాంక్ సినాట్రా (చిత్రంలో మధ్య ఉన్నవారు), సహచరులు.



మూనార్ ఫిలిమ్స్‌వారి ప్రథమ సాంఘికచిత్రం ప్రారంభోత్సవం వీనస్‌స్టూడియోలో ఇటీవల జరిగినప్పుడు తీసినచిత్రం. శ్రీ తిలక్ కెమెరా స్విచ్ ఆన్ చేశారు.

జనులు కూడా నవ్వేసినందువల్ల రెండు టేక్‌లు పాడయిపోయాయి.

"సార్. ఇలా టేకులు చేస్తయితే అతగాడూ ఉప్మా అంతా తినేస్తాడు. ఆకలి! మండుచ్చుకున్నాట్ట కూడాను— నా అ నాగమ్మలో వాడెవడో పిల్లలికివి బూడుచ్చుకున్నట్టు" అంది సూర్యకాంతం.

మొత్తానికి అదీ ఆ తరవాత మరి అరు టేక్‌లూ అయ్యాయి.

సెట్‌లోనే ఓమూల బల్లమీద ఉప్మా పళ్లెం ఉండేది.

"ఏమయింది చెప్మా ఉప్మా" అందరు సూర్యకాంతంకోసం వెతికారు.

ఆవిడ లేదు!

## బాటసారి

భరణీవారి 'బాటసారి' నిర్మాణం పూర్తి అయినట్టే. పతాకసన్నివేశానికి సంబంధించి పని కొద్దిగా ఉంది.

దీనికై అమరావతి దగ్గర ఔట్‌డోర్ షూటింగ్ జరుపబోతున్నట్లు దర్శకుడు రామకృష్ణ తెలియజేశారు.

భానుమతి, నాగేశ్వరరావు వాటిలో పాల్గొంటారు.

బాటసారి రచయిత సముద్రాల రాఘవాచార్య. సంగీత దర్శకుడు వేణు.

ఈ చిత్రాన్ని దసరా పండుగలకు విడుదల చేస్తారు.

మహేంద్రాదివారి కృష్ణప్రేమ 12 రీళ్లు తయారైంది.

బాలయ్య, జమున, ఎస్. వరలక్ష్మి నటిస్తున్నారు. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు. ఈ చిత్రం నవంబరులో విడుదల కాగలదనుకొంటున్నారు. ★

# సీరి వార్తలు

అతిశయోక్తులు

ఇటీవల విడుదల అయిన తెలుగు చిత్రాల నిడివి చూడగా—అది మళ్ళీ 19 వేల అడుగులకు పెరిగినట్లు కనిపించి నిరాశ కలిగిస్తోందని సినిమాభిమానులు మధనపడుతున్నారు. నిరాశ తగదని ఓదార్చి ధైర్యం చెబుతూ, "త్వరలోనే మన చిత్రాల నిడివి 13 వేల అడుగులకు దిగిపోతుందంటూ" ఒక సీలివార్త ప్రచారంలోకి వచ్చింది. 'పెరుగుట విరుగుటకొరకే' అనే పద్యపాదం, అది ఇచ్చే భరోసా మినహా ఈ వార్తకు ఆధారమేమీ లేదని గిట్టని వాళ్ళంటున్నారు.

* * *

బొంబాయివాళ్ళు ఇటువైపు తెలుగో కాని కథలతోనే సినిమా తీస్తారని అటు మడదలుపుతున్నారు కెని పెళ్ళివచ్చిన ఒక సినీ మనిషి బెదిరించారు.

* * *

శాంతారాం మళ్ళీ 'శకుంతల' ఫిలిం తీస్తాడన్నది సీలివార్త కాదనీ, ఆయన దుష్యంతుడు వేస్తాడన్నది అంతకన్నా కాదనీ ఇంకో సీలివార్త.

* * *

ఈ కారణంగా కాళిదాసుకు గల స్టార్ వాల్యూనుబట్టి ఆయన పుస్తకాలను 'క్యాష్' చేసుకుని పిక్చర్లు తీసేవాళ్ళంతా ఈ లోపలే ఆయా పనులకు పడికట్టడం మంచిదని సినీలోకరీతి తెలిసినవారు అనుకొంటున్నారు.

* * *

దేశవాళీ ఫిలిం హీరోయిన్లుమంతా సన్నబడదలుచుకున్నారు. ★

# నేపాల్ లో వింతలు, విశేషాలు

(16-వ పేజీ తరువాయి)

అందంగా ఉన్నది. బౌద్ధులు పైన గోడచుట్టూ ప్రార్థనా చక్రములు ఉంచుతారు. అవి ఎన్నిమార్లు తిప్పితే అంత పుణ్యం వస్తుంది, మనవారు జపమాల తిప్పినట్లు. నడక దారిని వెళ్ళితే నాలుగు పెద్దవి బుద్ధుని రాతి విగ్రహాలున్నాయి. వీటికి సమీపంలో బుద్ధ ఆశ్రమం ఆనందకుటి ఉన్నది. జయమందిరం అగ్నిపురం, కిండోల విహారం కూడా ఈ స్వయంభూనాథుని మందిరానికి చుట్టుపట్ల ఉన్నాయి.

దీనికి సమీపంగా బాయీస్ ధారా ఉంది. అంటే ఇరవై రెండు ఆకాశధారలున్నాయి. నీటిజల ఎక్కడినుండి వస్తుందో తెలియదు. ఎప్పుడూ నీరు పడుతూనే ఉంటుంది. ఇక్కడ నారాయణుని విగ్రహం చిన్నది ఒకేరాయితో చేసినది ఉన్నది. ఒక పెద్ద సిమెంటు కుండీమాదిరిగా ఉంటుంది. దానిలో బోలెడు పెద్దచేపలు, చిన్న చేపలూ ఉన్నాయి. ఈ స్థలంలో పెద్ద వెదురు పొదలు, సరుగుడు చెట్లు (మన వైపులాంటి సరుగుడు కాదు) ఉండడంచేత చిన్న ఉద్యానవనంలా ఉంటుంది.

బాయీస్ ధారాకు కొంచెం దూరంలో బూఢా నీలకంఠ్ ఉన్నది ఇది ఆపేరుగల ఒక పూజారి పేరున కట్టినది. కాట్మాండుకు ఆరుమైళ్ళదూరంలో ఉన్నది. క్రీ॥ వె॥ నాల్గవ శతాబ్దంలో కట్టినదట. నీటిలో శేషశయనుడు రమారమి ముప్పయి అడుగుల ఏకరాతి విగ్రహం. శిరస్సుదగ్గర త్రిశూలంఉంది. దీనికి దారి బాగులేదు. విగ్రహం జీవకళలుట్టిపడుతూ చాలా బాగుంది.

దక్షిణ కాళీ మందిరం: ఆలయం ఏడు వేల అడుగుల ఎత్తులో ఉన్నది. ఇక్కడ కార్లు వెళుతుంటే తిరుపతి కొండ పైకి వెళ్ళుతున్నట్లుంటుంది. ఒకవైపు కొండదొలిచి దారిచేశారు. మరొకవైపు అగాధం. మూడుకొండలు దాటాక నాల్గవ దానిలోకి వెళ్లి అక్కడకార్లు ఆగుతాయి. అక్కడినుండి కొన్ని మెట్లు దిగాక కాళీ మందిరం కనుపిస్తుంది. ఇక్కడకూడా బలులు విపరీతంగా ఎప్పుడూ ఇస్తారు. అందులో శనివారం మరి అడగక్కరలేదు. ప్రతివారూ మేకనుగానీ, ఎనుపోతునుగానీ, కోడినిగానీ బలి ఇవ్వవలసినదే. తిరిగి వెళ్లుతున్నప్పుడు నారాయణస్థాన్ చూస్తారు. ఇక్కడ పైన పెద్ద కొండ ఉన్నది. ఆ కొండకింద మందిరం కట్టారు. ఏడాదిలో ఏదో పర్వదినంలో కొండపైనుండి పాలు పాములాగా ఉన్న రాతిలోంచి సరిగ్గా క్రిందనుఉన్న నారాయణుని శిరస్సు మీద పడతాయని అంటారు. కొండదిగి కాట్మాండు వస్తున్నప్పుడు శీతాకాలమయితే తూర్పుదిక్కుగా లెక్కలేనన్ని మంచుకొండలు కనుపిస్తాయి. మరపురాని దృశ్యం ఇది.

దక్షిణకాళికి వెళుతున్న దారిలోనే కాట్మాండుకు ఆగ్నేయంగా మూడుమైళ్ళ దూరంలో 'చోబహార్' ఉన్నది. ఇదే పూర్వం మంజుశ్రీ కొండ తొలిచి సరస్సు నీటిని తోడ్చి బయటపెట్టిన కనుమ. క్రింద బాగ్‌మతీ పారుతున్నది. పైన ఊయలలాంటి బ్రిడ్జి ఉన్నది. ఇది ఊగుతూ ఉంటుంది. ఈ దృశ్యం చూడతగ్గది. బాగ్‌మతీ సమీపంలోనే ఆదినాథుని మందిరం ఉంది. దీన్నే జలవినాయక అనికూడా అంటారు. మందిరానికి పైన కర్రతో చెక్కిన బొమ్మలూ, దేవుళ్ళవీ, దయ్యాలవీ, మానవుల జీవితచరిత్ర చూపించేవి అనేక రకాలుగా చెక్కబడి ఉన్నాయి.

మరొక సుందరదృశ్యం సుందరీ జల్: ఈ జలధారనుంచి కాట్మాండుకు కొంత విద్యుచ్ఛక్తి లభిస్తుంది. ఇదికూడా దాదాపు ఏడు వేల అడుగుల ఎత్తులో ఉన్నది. పైన డామ్ కట్టారు. క్రిందకు నీరు గొట్టం ద్వారా తెచ్చించి యంత్రాలు నడిపి విద్యుచ్ఛక్తి పుట్టిస్తారు. పైకి ఎక్కడం కష్టం. మెట్లు ఏమీ లేవు. చిన్న చిన్న రాళ్ళు మనుష్యులు నడవడంవల్ల మెట్లులాగా అయ్యాయి. చేతికి ఏరాయి ఏకొమ్మ దొరికితే అదే పట్టుకొని ఎక్కాలి. నీరు పైనుంచి క్రిందికి వచ్చేందుకు గొట్టాలు పెట్టారుకదా? ఆ గొట్టం సహాయంతో ఎక్కవచ్చు. మెట్లు ఏమీలేవు. 'సుందరీజల్' లో మంచి జలపాతాలున్నవి. ఒక జల చాలా ఎత్తునుండి పడుతుంది. ఆ నీరు చూడడానికి పాలసముద్రంలా ఎంతో అందంగా ఉంటుంది. మరొకజల కూడా ఎత్తునుండే పడుతుందిగాని నీరు తొందరగా పడదు. ఇది సుందరీదేవతకు అతి దగ్గరగా ఉంది. సుందరీదేవతకుకూడా కొండలోనే మందిరం కట్టారు. అక్కడ పూజారి ఎవరూ ఉండరు. దారిలో బౌద్ధనాథుని స్తూపం ఉన్నది. బౌద్ధనాథుని స్తూపానికి ఎక్కడానికి మెట్లున్నాయి. ఈ బౌద్ధనాథుని స్తూపాన్ని అశోక చక్రవర్తి కట్టించినాడట. ఇది కాట్మాండుకు తూర్పుగా మూడున్నరమైళ్ళ దూరంలో ఉన్నది.

> ఉపన్యాసం అనంతరం:
>
> ఒకడు: అదేమిటండీ! హాస్యంమీద అంత బ్రహ్మాండమైన ఉపన్యాసం ఇచ్చి, ఇలా ఏడుస్తున్నారు?
>
> ఉపన్యాసకుడు: అది వాళ్లకు అర్థమైతేనా-అదే నా ఏడుపు.
>
> ఎమ్. ఎస్. ఆర్.
>
> (మద్రాసు)

లలితపూర్: దీనినే పాటన్ అనికూడా అంటారు. ఇక్కడ కృష్ణమందిరం ఉన్నది. ఇది చాలా పురాతన పట్టణం. ఇప్పుడిప్పుడే అక్కడి పాడుబడిన దేవళాలు బాగుచేస్తున్నారు. ఈ ఊర్లో ప్రతిమందిరంపైన కర్రతో చెక్కిన బొమ్మలు కొక్కోకశాస్త్రంవి, అనేకరకాలు ఉన్నాయి. ఇక్కడ ప్రతిఇంటిలో ఒక మందిరం.

పాటన్ దాటినతర్వాత జ్వాలాఖేల్ ఉంది. ఇక్కడ పెద్దపెద్దరాణాల ఇళ్ళు, మంచి మైదానాలు ఉన్నాయి. ఇక్కడ "జూ" (జంతుశాల) కూడా ఉన్నది. 10 పైసాల టిక్కట్టు.

ఈ జ్వాలాఖేల్‌కి అయిదుమైళ్ళ దూరంలో గోదావరీ అనిఉంది. ఇక్కడకూడా నీటిజల ఉంది. అక్కడే సిమెంటుకుండీ కట్టారు. అందులో చిన్నచిన్న చేపలు ఎర్రవి ఉన్నాయి. జ్వాలాఖేల్లో ఒక ఆస్పత్రీ, గోదావరీలో ఒకఆస్పత్రీ, మనసైనికప్రతినిధివర్గం నడిపేవి ఉన్నాయి. ఈ రెండుచోట్ల భారతీయ వైద్యులే ఉన్నారు.

భక్తిపూర్: దీనినే బాధ్‌గామ్అని కూడా అంటారు. ఇక్కడ నేపాల్ మిలిటరీ పేరక్సు ఉన్నది. ఊరు చిన్న పల్లెటూరిలాగా ఉంటుంది. మేజిస్ట్రేటు కూడా ఉన్నాడు. ఈ ఊరికి దగ్గరలో కొండమీద సూర్య వినాయక మందిరం ఉన్నది.

పైస్థలాలన్నీ కాట్మాండుకు దూరములో ఉన్నవి. పట్టణంలోనే భీమసేన్ జయస్తంభం (టవర్) ఉన్నది. ఇది ఢిల్లీ కుతుబ్ మీనార్ మాదిరి ఉంటుంది. లోపల ఎక్కేందుకు రెండువందల పదమూడు మెట్లున్నాయి. అక్కడక్కడ కిటికీలు అమర్చడంవల్ల వెలుతురు బాగానేఉంది. ఇదికాక కాత్యాయినీ మందిరం, పూర్వపు రాజదర్బారు అయిన హనుమాన్‌ఢోకాలో పెద్దరాతితో చెక్కబడిన హనుమంతుని విగ్రహం చూడతగవి. దసరాలలో ఇక్కడ ఎన్ని ఎనుపోతులను బలిచేస్తారో లెక్కపెట్ట శక్యంగాదు. దసరా కొన్ని దినములున్నదనగా కత్తులు సానపెట్టేవారికి మంచిగిరాకీ. దసరా రోజున ఎంతబీదవారయినా కోడినైనా అనవమం బలిఇచ్చితీరాలి.

నేపాలీ ప్రజలు వారి ఆచారములు, వ్యాయం: నేపాలు దేశసులు అధికంగా

# నేపాల్ లో వింతలు, విశేషాలు

నెవారీలు. వీరు అందమైన వారని చెప్పవచ్చు. వీరి భాష నెవారీ. ఈ భాషకు లిపులు అనేకం ఉన్నాయి. లిపి టిబెట్టు చైనా భాషల లిపులకు సన్నిహితంగా ఉంటుంది. మిగిలిన వారు నేపాలీలు. వీరి భాషలో సంస్కృతం ఎక్కువగా ఉంటుంది. లిపి హిందీ. హిందూమతం బౌద్ధమతం కలిసిన మతం వీరిది. అందుచేత బుద్ధమందిరాలలో విష్ణువును వినాయకునీ కూడా పూజిస్తారు. వృత్తిని బట్టి నెవారీలలో అరవై ఎనిమిది కులాలు వారు ఉన్నారని అంచనా. వాళ్లు రోడ్లు ఊడ్చేవారు, అన్ని జాతులకన్నా తక్కువ. నెవారీలు మంచి పనివాళ్ళు. పెగోడా రీతి శిల్పములో వీరికి హెచ్చు ప్రావీణ్యం ఉన్నది. స్వయంభూనాథ్ లోని ఇత్తడి బుద్ధ విగ్రహం నెవారీల శిల్ప చాతుర్యాన్ని చాటుతుంది. లెక్కకురానిబుద్ధుని బొమ్మలూ నేపాలురాజుల రూపాలూ, రాగితోనూ ఇత్తడితోనూ చేసిన ప్రతిమలూ చూస్తే పాశ్చాత్యులు అనాగరికులై అటవికులుగానున్న కాలంలో నేపాల్ లో మంచి నాగరికత ఉండేదని ఊహించవచ్చు. వీరు హిందువులకు మల్లే హోలీ దీపావళి దసరా పండుగలు చేస్తారు. ఇవికాక భైరవ జాత్ర, గోజాత్ర ఇంద్రజాత్ర, దేవీకుమారీ జాత్ర, మచ్ఛేంద్రజాత్ర వీరికి ముఖ్యమయినపండుగలు. నెవారీ స్త్రీలకు వైధవ్యంలేదు. ఎందుకంటే ముందుగా కన్నెపిల్ల మారేడు చెట్టును పెళ్ళాడుతుంది.

ఇంతవరకుముందు నేపాలు సైనికరాజ్యంగా ఉండేది. అందుచేత తుపాకిగానీ, మందుగుండుసామానుగానీ కోట్వాలుడు అధికారుల అనుజ్ఞ లేకుండా దగ్గర ఉంచుకో కూడదు.

పూర్వం న్యాయం వింతగా ఉండేది. తప్పు చేసిన వానిని బాధితుడు చిన్న బాకు (కుకిరీ)తో పొడిచి చంపవచ్చు. ఇప్పుడు 'కుకిరీ' లేదుగాని బాధితుని కాలు క్రింద దూరితే నేరస్థునికి ప్రాయశ్చిత్తం జరిగినట్లే. ఇప్పటికీ నెవారీ స్త్రీ తన భర్తను వదలదలచుకొన్నప్పుడు గుండ్రని 'పోకచెక్క' ఒకటి తలగడక్రిందపెట్టి ఇష్టమయిన చోటుకు పోవచ్చు. సాధారణంగా బాధితుడు పెండ్లికయిన ఖర్చులు మాత్రమే రాబట్టుకోగలడు. ఆడదానికి, బ్రాహ్మణునికీ ఏ తప్పు చేసినా సరే మరణశిక్ష లేదు. ప్రస్తుతం పోలీసుసిబ్బంది చాకచక్యంగా పనిచేస్తున్నది. అవును గాని, అబోతును గానీ ఏ వాహనమైనా ఢీకొంటే ఆవాహనం నడిపేవానికి కఠినశిక్ష విధిస్తారు. కోడిం గానీ, మేకనుగానీ రోడ్డు ప్రమాదంలో చంపితే దానిఖరీదు యజమానికి ఇచ్చివేసి చంపిన జంతువును తీసుకుపోవచ్చు. వాహనం వల్ల ప్రాణాపాయం సంభవించిన పక్షంలో వాహనాధికారి వెంటనే రెండువేల రూపాయలు పోలీసువారికి ఇవ్వాలి. ఎవరి ఇంటిలోనైనా దొంగతనం జరిగి వారు పోలీసుకు రిపోర్టు చేస్తే దొంగతనం స్థిరపడేవరకు రిపోర్టు ఇచ్చినవారినే ఖైదులో ఉంచుతారు. పోయిన వస్తువులు దొరికితే వాటిని తిరిగిఇచ్చేందుకు వాటి వెలనుబట్టి పోలీసు వారు కొంత తీసుకొంటారు.

నేపాలు దేశం చూడాలని ఎవరికుండదూ? కొండలనుచూచినా, కొండలతో చుట్టబడిన లోయలను చూసినా, రకరకాలయిన చెట్లు, చేమలూ, వెండి కొండల్లాగా మెరుస్తున్న మంచు శిఖరాలు చూసినా, వాటి మీద సూర్యుడు అస్తమిస్తున్నప్పుడు పూసిన బంగారు పూత చూసినా, వర్షాకాలం లోయలో ఉండి చుట్టునున్న కొండలను అనుకొని ఉన్న మేఘాల పొడుగును చూసినా కలిగే ఆనందం అనుభవించతగ్గదిగానీ వర్ణించ నలవికాదు. ★

చదరంగం:

# పాతపద్ధతిలో కొత్త నడక

హైదరాబాదు ఆటగాళ్ళలో ప్రముఖుడు తురబ్ అలీ. ఆయన భారతీయ పద్ధతి ఆటలో అందెవేసినచేయి. అంత భారతీయ పద్ధతిప్రకారం ఆట ప్రారంభించి ఆ జే కాలం కాకపోయినా దానిలోనూ విశేషమైన ప్రావీణ్యం గడించారు. ఇటీవల మద్రాసులో జరిగిన కస్తూరికప్ పోటీలలో రెండవ స్థానం ఆక్రమించారు. ప్రాత పద్ధతులు అవలంబించినా కొత్త నడక చూపి చక్కదనంగా ఆట సాగించడం ఆయన ప్రత్యేకత. ఇందుకు కస్తూరికప్ టూర్నమెంటులో బెంగాల్ ప్రతినిధి శైలేంద్రనాథ్ దత్తాతో ఆయన ఆడిన ఆట నిదర్శనం.

ఆ ఆటసాగిన క్రమం ఇది:

తురబ్ అలీ (తెలుపు); శైలేంద్రనాథ్ దత్తా (నలుపు).

1. బ - రా 4; బ - రా 4.
2. బ - రా గు 3 (క); గు - రా శ 3.
3. శ - గు 2; శ - శ 4.
4. బ - మ శ 3; గు - మ శ 3 (ఖ).
5. గు - రా 2; 0 - 0 (రాజు వైపుకోట).
6. బ - మ 4; బ X బ.
7. బ X బ; శ - గు 5 పా.
8. గు - శ 3; బ - మ 3 (గ).
9. 0 - 0 (రాజు వైపుకోట); బ-రా ఏ 3.
10. బ - రా ఏ 3; బ - ఏ 4 (ఘ).
11. బ - ఏ 3; శ - గు 3.
12. బ - మ గు 4; గు - రా 2.
13. శ - రా 3; శ - మ 2.
14. మ - మ 2; గు - గు 3.
15. రా - ఏ 2; ఏ - శ 1.
16. బ - శ 4; బ - శ 4.
17. గు బ X బ; బ X బ.
18. బ - మ 5 (చ)!; గు - ఏ 2.
19. బ - రా 5; శ - ఏ 4.
20. మ ఏ - గు 1; బ - గు 4.
21. మ - మ 3; బ - ఏ 3.
22. గు - రా 4; శ - శ 4.
23. బ - గు 4; బ - శ 5.
24. మ - మ 4; శ X గు.
25. శ X శ; బ - శ 6.
26. బ - శ 5; ఏ - శ 5.
27. బ X గు! (ఛ); ఏ X మ.
28. బ X గు పా; రా - ఏ 1.
29. గు X ఏ; మ - రా 2.
30. ఏ - శ 5; బ - గు 3.
31. గు - శ 6; మ X ఏ బ.
32. ఏ - శ 2; బ - శ 7.
33. శ - మ 4; బ X ఏ మ.
34. శ X మ; శ - శ 2 (జ).
35. బ - మ 6; శ X బ.
36. బ X శ (తెరచిరాజు); రా X బ.
37. ఏ - శ 6; రా - గు 1.
38. బ - మ 7 (ఝ); మ - శ 3.
39. శ - రా 4; మ - మ 7 పా.
40. శ - గు 2; బ - గు 5.
41. గు - రా 7 పా; రా - ఏ 2.
42. ఏ X బ పా; ఏ X ఏ.
43. బ-రా 3 మ; మ-శ 5 పా.
44. రా-ఏ 1; ఏ-శ 1.
45. మ-మ 5; బ-గు 6.
46. గు X బ; మ-శ 3.
47. రా-ఏ 2; మ-శ 2 పా.
48. శ-రా 5; ఏ-మ 1.
49. గు-శ 3 పా; ఓటమి అంగీకరించారు.

(క) పాతపద్ధతి అనుసరించిన ఎత్తు. శాస్త్రీయమైనది కాదు. భారతీయ పద్ధతి అవలంబించేవారు సాధారణంగా 'కింగ్ (రాజు) ఫియాన్ చెట్టో' ఆడతారు.

(ఖ) తెలుపు గు-రా 2 వేసిన తరువాత బ-రా 4 అపడానికి ఈ ఎత్తు ఉపకరించదు.

(గ) జంతువులు అన్నీ ఒకచోట చేరడం మూలంగా వాటిని తేయచ్ఛగా నడపడానికి ఆటంకం కలుగకుండా చేయాలంటే బ-రా 4 మేలు.

(ఘ) క్రమానుగుణంగా వేయవలసిన ఎత్తు ఏ-రా 1. లేకపోతే నలుపు ఆట దెబ్బ తింటుంది.

(చ) ఈ ఎత్తుతో కేంద్రం తెలుపు అధీనంలోనికి వచ్చినది. రాజువైపు దాడి సాగించడానికి కూడా ఇది దోహదం ఇస్తుంది.

(ఛ) మంత్రిని ఇచ్చినా మూడు జంతువులు చిక్కినవి. చాలా చక్కటిఎత్తు.

(జ) శ-రా 3 వేస్తే నలుపు విజయవంతంగా దాడి సాగించడానికి అవకాశం లభిస్తుంది.

(ఝ) ఇక్కడ మూడు ఎత్తులలో నలుపు ఆటకట్టించే అవకాశాన్ని తెలుపు కోల్పోయినది.

వేయవలసిన ఎత్తులు ఇవి:—

38. గు-రా 7 పా; రా-ఏ 2.

39. ఏ X బ పా; ఏ X ఏ.

40. శ X బ పా. ఆటకట్టు.

అయితే దీనివల్ల తెల్లబలానికి వచ్చిననష్టం ఏమీ లేదు. మంత్రి బంటు ఎనిమిదవ గడి చేరకుండా నిరోధించడం నల్లబలానికి సాధ్యంకాదు.

—వి. విశ్వనాథశాస్త్రి.

## రచయితలకు విజ్ఞప్తి

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురణార్థం కథలు గేయాలు చిత్రాలు మున్నగునవి పంపేవారు ఈ దిగువ పేర్కొన్న అంశాలు గమనించాలని కోరుతున్నాము:

ప్రచురణకు అంగీకరించని పక్షంలో తిరిగిపంపేనిమిత్తం స్టాంపులు అతికించిన చిరునామాఉన్న కవరు వాటితోబాటు పంపడం అవశ్యకం. లేకపోతే వాటిని తిరిగి రచయితలకు పంపడం సాధ్యం కాదు. ఏమైనా త్రిప్పిపంపిన రచనలు చేరేటట్లు చూడవలసిన బాధ్యత సంపాదకులదికాదు.

ప్రచురణకు అంగీకరించిన సందర్భంలో ముందుగా ఆసంగతి రచయితలకు తెలియపరచడం జరుగుతుంది.

ఏ సందర్భంలోను రచనలు మున్నగు వాటి విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం సాధ్యంకాదు.

రచనలు మున్నగువాటినిగురించి సంపాదకుల అభిప్రాయాలు తెలియపరచడం జరుగదు. —సంపాదకుడు

# జీవనగంగ

(23-వ పేజీ తరువాయి)

## 26

సాయంత్రం మసక మసగ్గా వుంది. బయట వాతావరణంతో పాటు కిటికీ వారగా కూర్చుని చదువుకుంటూన్న మల్లిబాబు మనసులో కూడా అదోరకంగా అనుభూతి చెందసాగాడు. బాబూరావు ఆనాడు ఎక్కడికి పోయాడో గాని రెండు రోజుల్నించీ రూముకి రావటం మానేశాడు. కాలేజీకి కూడా రావడంలేదు. అతని సామానులన్నీ ఇక్కడే వున్నాయి. కట్టుబట్టలతో అతను ఏ చిక్కు వ్యవహారాలలో మునిగిపోయాడో మల్లిబాబు ఊహించలేకపోయాడు. బాబూరావు ఎక్కడెక్కడికయితే మామూలుగా వెళ్తుంటాడో ఆ ప్రదేశాలన్నీ గాలించేశాడు. తెలిసున్న వాళ్ళందరినీ అడిగాడు. కాని బాబూరావు అంతు చిక్కలేదు.

ఆసాయంత్రమే ఒకవార్త విన్నాడు. ఒక మిత్రుడు ఆ విషయం చెప్పాడు. బాబురావు రైల్వేస్టేషన్లో కనిపించాడనీ ఆతర్వాత బండి ఎక్కటంకూడా తను చూశాననీ చెప్పాడు. అది మద్రాసు పోయేబండి అనికూడా అతనే చెప్పాడు. ఐతే అతను డబ్బుకోసం తండ్రి దగ్గరకు వెళ్లివుంటాడని మల్లిబాబు ఊహించాడు.

పుస్తకం చదువుకుంటూంటే మెట్లమీద అలికిడయి వెంటనే తలుపు తడుతున్న చప్పుడు కూడా వినిపించి మల్లిబాబు లేచి తలుపుతీసాడు. నిప్పులు కక్కుతూన్న చూపులతో ఆరుగురు దృఢకాయులు చేతిలో నిలువెత్తు కర్రలతో లోపలికి ప్రవేశిస్తూ "బాబూరావని ఓకుర్రవాడు ఉండేది ఇక్కడేనా?" అన్నారు.

"మీరెవరు?" అన్నాడు మల్లిబాబు అయోమయంగా చూస్తూను.

"మా సంగతి తర్వాత చెబుతాం. ముందు ఆయనసంగతి చెప్పండి." అన్నాడొకాయన ముందుకు వస్తూను.

మల్లిబాబు వాళ్లని లోపలికి రమ్మనమని కూర్చోపెట్టి విషయమంతా చెప్పాడు.

"ఐతే వారి స్వగ్రామం?" అన్నాడొకాయన.

"వారిది నిడదవోలు. వీళ్ళ ఇల్లు కూడా స్టేషనుదగ్గర."

"ముఖం ఎత్తి తిరిగే పనిచేశాడా. కొంప కూల్చి మరీ పోతేను. కనబడాలి గాని నెత్తురుదాహం తాగనూ?" అన్నాడొకాయన ఆవేశంగా నేలమీద పొన్నుకర్ర టక్కు టక్కుమని ధ్వని చేస్తూను.

మల్లిబాబు ఉత్కంఠతో "అసలు విషయం ఏమిటండీ" అన్నాడు.

"ఆడపిల్లని ప్రేమించి పెళ్లి చేసుకుంటానని మాట ఇచ్చి నిలువునా దాని కొంప ముంచిపోయాడు"

మల్లిబాబు నిర్విణ్ణుడై క్షణం పోయింతర్వాత "ఆపిల్లకి ఎంత వయస్సుంటుంది?" అని అడిగాడు.

"పందొమ్మిదేళ్ళుంటాయండి."

"అయితే ఈ పొరబాటులో అతని కెంత బాధ్యత వున్నదో ఆమెకీ అంతే బాధ్యత ఉన్నది."

"బాధ్యత ఎవరిదీ అని చర్చించటానికి కాదండీ ఇక్కడికి వచ్చింది. బాధ్యత ఎవరిదయినా పర్యవసానం అనుభవించేది ఆమె. అందుకని వ్యవహారం ఎలా అయినా సుఖాంతం చేద్దామనే వచ్చాం."

మల్లిబాబు ఒక కార్డుమీద తన యడ్రసు రాసి ఇచ్చి "బాబూరావు దొరకుతే ఏమయిందీ నాకు రాయండి. వీలయితే నేనూ మీకు సహాయం చెయ్యగలను" అన్నాడు.

వాళ్ళు లేచి వెళ్ళబోతుంటే "హింసకి పూనుకోకండి. మంచి మాటలమీదే కార్యం సానుకూల పర్చుకోవాలి" అని హితవు చెప్పాడు.

మల్లిబాబు రెండు రోజుల క్రితమే ఇలాంటి దేదో జరిగివుంటుందని ఊహించకపోలేదు. అతనిలో అవినీతి ఇంతటి ఉన్నతస్థాయికి పెరిగిపోయిందని అతను అనుకోలేకపోయాడు. బహుశా డబ్బుకోసం తండ్రివద్దకు వెళ్ళి వుంటాడేమో అనుకున్నాడు. ఈనాటి కుర్రవాళ్లు ఇలా ఆలోచనా పాలోచనా లేకుండా ఇలాంటి విపత్కరమైన, ప్రాణాంతకమైనసమస్యల్ని క్షణికోద్రేకంతో సృష్టించుకుంటున్నారు. ఇప్పుడా పిల్లజీవితం ఏమి కావాలి? ఏ బలహీనతలు వీళ్ళ నిలా అధోగతికి ఈడుస్తున్నాయి? అదంతా ప్రేమ అని మురిసిపోయేవాడు ఎందుకు పారిపోవాలి?

మల్లిబాబుకి ఏదో స్ఫురించి డ్రాయరులో ఒక కార్డుతీసి నిడదవోలు బాబూరావు తండ్రిపేర ఉత్తరం రాశాడు. అందులో జరిగిందేమీ రాయలేదు. బాబూరావు వస్తే మటుకు అతడ్ని అక్కడ్నించి కదల నివ్వద్దని రాశాడు.

అతనిలో ఆపూట ఏ పనిచేస్తున్నా యీ విషయమే గుర్తుకు రాసాగింది. కాలేజీలో పుస్తకం ముందు పెట్టుకొని లెక్చరరుకి ఎదురుగుండా కూచుని వున్నా అతని మనసు అక్కడ లేదు. అది పూర్తిగా ఆరోజు తను విన్న విషాదపూరితమైన ఉదంతంతో నిండిపోయివుంది.

పక్క విద్యార్థి పేజీ తిప్పి 'వినటంలేదా' అని హెచ్చరించాడు.

మల్లిబాబు తెప్పరిల్లి పుస్తకం మీదకు దృష్టి మళ్లించాడు. వెనక బెంచీలలో కుర్రవాళ్ళు గుసగుసలు పోతున్నారు. ఉపన్యాసకులు పాఠం ఆపి వాళ్ళని ఓమారు హెచ్చరించి తిరిగి తన అనర్గళమైన ధోరణిలో పడిపోయారు.

మల్లిబాబు తనకి కొద్ది దూరంలో గోడవారగా కూర్చుని ఉన్న ఆడపిల్లలను చూస్తూ తెలికుండానే చెమ్మగిలిన నయనాలను పుస్తకం చాటు చేసుకుని తుడుచుకున్నాడు. మనసు బొత్తిగా వికలమయి వుంది. ఎంత కాదనుకున్నా ఒక అభాగిని అతని కళ్ళముందు మెదుల్తూనే ఉంది.

ఆ సాయంత్రం ముసలితాత కుటుంబం జ్ఞాపకం వచ్చింది. అక్కడికి వెళ్ళి చాలా కాలమయింది. ఆ కుటుంబం ఒక పద్ధతి కుదురుకుందో లేక అస్తవ్యస్తంగా ఉన్నదో?

అతను వెళ్ళేసరికి ముసలితాత మనవల్ని చుట్టూతా పెట్టుకుని పొగాకు చుట్టుకుంటూ వాళ్ళతో కబుర్లు చెబుతున్నాడు. మల్లిబాబుని చూసి చప్పున లేచి 'నమస్కారం బాబూ' అంటూ చేతులు జోడించాడు. లోపలికి వెళ్ళి చింకిచాప ఒకటి తెచ్చి ముడతలు వేసి "కూర్చోండి బాబూ. కులాసాగా ఉన్నారా?" అన్నాడు.

మల్లిబాబు తలవూపుతూనే 'చాలా కాలమయింది. చూసిపోదామని వచ్చాను.' అన్నాడు.

సందు మొగలో దీపం వెలిగింది.

"బ్రతుకాలిగా బాబూ. ఏదో చెయ్యక పోతే ఎలా కుదురుతుంది. ఆడదిదే నాలుగు రాళ్ళు తెచ్చి పడేస్తోంది. నేను కూడా వెళ్ళి కాస్త సహాయం చేస్తున్నాను. అలాగే గడిచి పోతూంది" అన్నాడు ముసలితాత.

"మీ అల్లుడి సంగతి ఏమయినా తెలిసిందా తాతా?"

"వచ్చాడు బాబూ. అదో పెద గాథ. ఈమధ్య వచ్చి 'పెళ్ళాన్ని తీసుకుపోతాను' అన్నాడు. 'ఇంకెక్కడి పెళ్ళాం. ఏ

మేష్టారు: ఒరేయ్ రామాయణాన్ని ఎవరు రచించారు?

విద్యార్థి: అబ్బే నేనసలు దాన్ని చించలేదు సర్.

—రాజులపూడి నరసింహారావు, నర్సాపురం.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# గళ్లనుడికట్టు-10

## ఆధారాలు

### అడ్డము

1. పిడకలను ఇందులో వేటాడ కూడదంటారు!
4. అడ్డంలోని ఒక అవ్యయము.
7. ఎక్కువ మాత్రం కాదులెండి.
8 ఎవరి నడిగి ధాన్యాన్ని తీసుకున్నారు?
9. వెళ్లకుండా ఈ (పూగ) చెట్టు ఏం చెయ్యగలదు?
10. రాముని గురువులలో ఒకడు.
12. భూమిక్రింద పెరిగే పద్యం-తల క్రిందులుగా.
13. అలవాటు వాడుకలవాడు.
14. చెడ్డైన ఆకు ముందున్న వంటకము.
16. వంటరివానిలోని పక్షి.
17. మహాభారత యుద్ధం ముందు రేఖ, ఒకటి కాదు: ఎన్నో! [రేఖలు]
18. చాలా తలక్రిందు లయిపోయి నాయి!
19. వ్రాయబడినది.
21. చెరుపకు, తీపితీయి చాలు.
24. 22 నిలువులోని నక్షత్రం.
25. కపోతంలో తలక్రిందు లయిన భాగం.
27. ఏదైతేనేమి చక్రం గాడికి సరిపోవాలి గాని?
28. నగమయిన పొరుగు.
30. చిందరవందర యిపోయిన గ్రామోత్సవం.
32. విన్నతర్వాతపూర్తయిపోయిన మార్పు.
33. దాహము అవకమునుపే సంతోషం కోసం చూడండి!

### నిలువు

1. ప్రాణమున్నదాన్ని రమ్మని పిలిస్తే పువ్వు కనిపిస్తుంది.
2. ఒక విధమైన పాటను సూచించే మాట.
3. మరకతములోని మొదటిది తీసి ఒక గుణం కోసం చూడండి-సన్నటిదిమాత్రం కాదు!
4. తమిళంలోని శబ్దము.
5. మనదేశం తూర్పు ప్రదేశంలో దొరికేది కూరగాయేనా?
6. చేనును మేయకూడనిది!
9. సామ్యం.
11. అవరోహణలో వరుసగామూడు.
13. ముఖద్వారం.
14. ఎన్నో ఉన్న అంగులి.
15. కుములుతూ ఉంటే మారిగుచ్ఛకో గలదు!
17. పాటలోని ఇల్లు.
20. అతను వున్నది తప్పకాని దేహం కోసం పడవలసినపాటు!
21. స్నేహం.
22. పొగరెక్కిన చెట్ల సమూహం!
23. 1, 2 అడ్డంకూడా ఉన్న ఇతిహాసము!
26. పాపములో ఉన్నా పడకతప్పదు.
27. చెయ్యలేము అంటే నగం శిక్షణీయము!
29. ఒక ద్వీపానికి వాడే మాట-అక్కడ తెల్లటివారే ఎక్కువ.
31. అదుగో! ఆవనంలో ఉన్నగింజ.



## 8-వ గళ్లనుడికట్టుకు జవాబులు



ఉసురు పోసుకుని పోయింది' అని చెబితే దొంగకన్నీరు కారుస్తూ, ఏడుస్తూ నాటకం ఆడాడు. నేను నిజమే అనుకుని నమ్మాను. ఓదార్చాను. అంతకోపం చల్లార్చుకున్నాను. నాలుగురోజులు కూరా సారా సొంతడబ్బుతో తెచ్చి పడేశాడు. పిల్లలకి నాలుగుబట్టలు కుట్టించాడు. పోనీ ఆ పిల్లలకైనా ఆధారం దొరికిందని సంతోషించాను. ఓనాడు రాత్రి నిజం బయటపడింది. అర్ధరాత్రి నిద్రపట్టక అలా మంచంమీద పడుకునే ఉన్నాను. ఈ అల్లుడు లేచి పెట్టు గాలించటం మొదలుపెట్టాడు. నేను అనుమానించాను. వాడు ఓ పెట్టెలోంచి నే అనుమానిస్తున్న వస్తువుతీసి బొడ్లో దోపుకోబోతుంటే అల్లరిచేసి పట్టుకున్నాను. పెళ్ళాం 'కంటె' క్కింద పారేసి అదే పరుగు పుచ్చుకున్నాడు. ఆ వెధవ ఇందుకు చేరాడని అప్పుడు గ్రహించాను. ఏడిచాను. నా బిడ్డ చిన్నతనంలో నేను చేయించిన బంగారుకంటె—అదొక్కటే మిగిలింది. అది కాజెయ్యాలని వాడు నాటకం ఆడాడు. పిల్లలు అదృష్టవంతులు బాబూ. ఇంకా నయం. ఈ పిల్లల్ని తీసుకుని ఏ అడివిలో నన్నా వదిలిపెడితే ఏమయిపోయే వారూ?" ఆ జరిగిపోయిందంతా కళ్ళముందు మెదిలింది కాబోలు ముసలి తాత కళ్ళు తుడుచుకున్నాడు.

లోపల దీపం వెలిగింది. మల్లిబాబుని పీధి దీపం సగంగా పంచుకుంటుంది. తాత మనవల్లో ఒకడు మల్లిబాబు పక్కన వచ్చి కూర్చుని అతని జేబులోని పెన్నువైపు వింతగా చూడసాగాడు.

(ఇంకా ఉంది)

శాన్ ఫ్రాన్సిస్కోలో 'జో' అనే అతనికి తరచుగా తలనొప్పి వస్తూ ఉండేది. ఎన్ని మందులు వాడినా తగ్గలేదు. దానితో అతనికి విసుగెత్తింది. చివరికి ఒక మనస్తత్వశాస్త్రజ్ఞని దగ్గరికి వెళ్ళాడు. అతడు 'జో' చరిత్ర అంతా అడిగి తెలుసుకొన్నాడు. ప్రపంచంలో ఉన్న ప్రముఖులు అందరూ తన స్నేహితులే అని జో చెప్పగా విన్నాడు.

"నీకు జబ్బు ఏమీ లేదు. ప్రముఖులు అందరూ తెలుసు ననుకొనడం ఒకరకమైన పిచ్చి. దానివల్ల మెదడు వేడెక్కి తలనొప్పి వస్తున్న"దని ఆ మనస్తత్వ వేత్త అన్నాడు.

జోకు కోపం వచ్చింది. "అందరూ తెలుసునని అబద్ధం చెబుతున్నాననుకొన్నారా? కావలిస్తే పందెం వెయ్యండి. వాళ్ళందరూ నాకు తెలుసునో లేదో మీకే తెలుస్తుంది" అన్నాడు జో విసుగ్గా.

జోకు హాలీవుడ్‌లో ఎందరు తెలుసునో నిర్ణయించడానికి వెయ్యిడాలర్లు పందెం వేసుకొన్నారు ఇద్దరు.

హాలీవుడ్ (లాస్ ఏంజల్స్)లో విమానం దిగేసరికి క్లార్క్ గేబుల్ మొదలుకొని మార్లిన్ మన్రోవరకు విమానాశ్రయంలో జోకు ఘనస్వాగతం ఇచ్చారు. మనస్తత్వవేత్త తప్పనిసరిగా వెయ్యి డాలర్లూ చెల్లించుకొన్నాడు. "ఎలాగైతేనేం, ఇక్కడ సాధించావు. న్యూయార్కులో నీగొప్పతనం చూద్దాం. మరొక వెయ్యి డాలర్లు పందెం" అని జోను సవాల్ చేశాడు.

"[illegible]"నంటూ జో దానికి అంగీకరించాడు.

న్యూయార్కులో జోకు మేయర్ వాగ్నర్ పౌరసన్మానం చేశాడు. మనస్తత్వవేత్తకు ఉక్రోషం వచ్చింది. "ఇదంతా డబ్బు ఇచ్చి చేయించుకొని ఉంటావు! ఏమైనా అమెరికాలో డబ్బు పారేస్తే సాధ్యంకానిదేమీ లేదు. ఈసారి రాజకీయనాయకుల సంగతి చూద్దాము! రెండువేల డాలర్లు పందెం. పద, వాషింగ్టన్ పోదాం" అన్నాడాయన జోతో.

వాషింగ్టన్‌లో ప్రెసిడెంట్ మొదలుకొని ప్రముఖులు అందరూ జోకు స్వాగతమిచ్చారు. మనస్తత్వ వేత్తకు తలతిరిగింది. మరొక ఎత్తు వేశాడు. ఇంగ్లీషు వారు తలబిరుసు అయినవారు కదా జోకు శృంగభంగం అవుతుందని ఇంగ్లండుపోదాం రమ్మన్నాడు. నాలుగువేల డాలర్లు ఒడ్డాడు. జో అంగీకరించాడు.

లండన్ విమానాశ్రయంలో మార్గరెట్ రాకుమారి, డ్యూక్ ఆఫ్-ఎడింబరో జో రాకకోసం నిరీక్షిస్తూ ఉన్నారు.

ఈసారి మనస్తత్వశాస్త్రవేత్త గుండె దిగజారిపోయింది. బకింగ్‌హామ్ భవనంలో జోకు విందు ఏర్పాటు చేయడంతో అతనికి మతిపోయినంత పని అయింది.

"జో, ఇవన్నీ నీకు ఎలా సాధ్యమయ్యాయో నాకు తెలియదు. నీకు ఏమీ అభ్యంతరం లేకపోతే ఆఖరిసారిగా నీబలాయి [illegible] అవకాశం ఇవ్వు! ఎనిమిదివేల డాలర్లు పందెం వేస్తాను. రోమ్ వెళదాంపద! పోప్ నీకు తెలుసునో లేదో చూద్దాం" అని ప్రాధేయపడ్డాడు. జో జాలిపడి సరే అన్నాడు.

ఇద్దరూ రోమ్ చేరుకొన్నారు. పోప్ భవనానికి వెలుపల మనస్తత్వవేత్త ఆగిపోయాడు.

"జో, ఇంతవరకు నీ గొప్పతనం ఎలాగో నిలబెట్టుకొంటూ వచ్చావు. ఏమైనా పోప్ మహాత్మకారి ఆయన దగ్గర నీపప్పు ఉడకదు. నేను బయటే నిలబడి నీకు జరగబోయే పరాభవం చూస్తాను" అన్నాడు ఆయన. జో చిరునవ్వునవ్వి లోపలికి వెళ్లాడు.

మనస్తత్వ వేత్తకు ఏమీ తోచలేదు. బయటే తారట్లాడుతూ ఉన్నాడు. కొంచెం సేపట్లో ఆ ప్రదేశం అంతా జనంతో నిండిపోవడం గమనించాడు. పైగా అందరూ తలలు పైకెత్తి చూస్తూఉండడంకూడా గమనించాడు. ఏమాఅని తానూ ఆవంక చూశాడు.

పోప్ భవనంలో మిద్దెమీద బాల్కనీలో నిలబడి పోప్ భుజంమీద చేయివేసి ఆయన చెవిలో ఏదో చెబుతున్నాడు జో. మనస్తత్వ వేత్తకు నోట మాటరాలేదు. గుడ్లు అప్పగించి చూస్తూ ఉన్నాడు.

అంతలో అక్కడ మూగి ఉన్న జనంలో ఒకరు "ఎవరబ్బా, మన జోతో మాట్లాడుతున్నది" అని అడగడం వినబడింది మనస్తత్వ వేత్తకు. ★

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd,. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

ఎంత తాజాదనము...
ఎంత సువాసన...




# పాండ్స్
## డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

తేలికైన సువాసనగల, చెమటను పీల్చే మరియు
మెత్తని పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ మిమ్మల్ని
రోజంతా చల్లగా మరియు ఉత్సాహముగా ఉండేలా
ఉంచుతుంది. రోజూ స్నానము చేసిన తరువాత
పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌ను ఒళ్లంతా జల్లుకోండి!

*ప్రపంచమంతటా సౌందర్యవతులు దీనినే ఎన్నుకొంటారు*

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ. లో సంస్థాపితము)

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

# తిరిగి ఆశ్చర్యముగా పూర్తి స్వస్థత చేకూరుతుంది!



వాటర్ బరీస్ కాంపౌండ్ టానిక్కును ప్రపంచములో ఆరోగ్యమును వాంఛించు పిన్నలు పెద్దలు అందరూ కూడా ఆరోగ్యము నిచ్చుటలో సాటిలేనిదని పేరొందుటచే విడువక వాడుచున్నారు.

వాటర్ బరీస్ కాంపౌండ్ లో ముఖ్యమైన పోషక పదార్థములు కలసియుండుటచే సౌఖ్యప్రదమగు జీవితమును ప్రసాదించి మీ కుటుంబమునకు అవసరమైన అదనపు శక్తిని చేకూర్చును

వాటర్ బరీస్ కాంపౌండ్ ఎడతెగని దగ్గు, పడిశములు, శ్వాసకోశపు రుగ్మతలను నివారించును. వ్యాధినుండి త్వరితముగా కోలుకొనుటకు డాక్టర్లు దీనిని సిఫారసు చేయుచున్నారు.




పిల్ ఫర్ - ప్రూఫ్ మూతతోను, క్రొత్త ఎఱ లేబిల్ తోను యిప్పుడు సరఫరా చేయబడు చున్నది.

ఎల్లరావర్
ఇప్పుడు వాడుటలేదు

ఆరోగ్యమునకు హితమైన

# వాటర్‌బరీస్ కాంపౌండ్

వాడుడు